(2)

శ్రీ రామ

# దివ్యసూరి హృదయము

ప్రసిద్ధ రాళ్వారుల వైభవము

PADYALA PADMA

# దివ్యసూరి హృదయంగమము

ప్రథమ భాగము




తర్క వేదాంత విశారద

మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లు

# దివ్యసూరి హృదయము

## ప్రథమ భాగము

## (ఆళ్వారుల చరిత్రము)



తర్క వేదాంత విశారద

మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లు

శ్రీ వేణుగోపాల సేవాశ్రమాధిపతులు

పూడివాడ.

దుర్మతి - హేమంతము.

1982.

ప్రతులు : 1000.

హక్కులు : గ్రంథకర్తవి.

వెల : రు. 15-00.



పలయువారు :

శ్రీ మొవ్వ శ్రీవివాసపెరుమాళ్లు.

శ్రీ వేణుగోపాల సేవాశ్రమాధిపతులు

పూడివాడ.

వయా - నగరం.

పల్లపట్ల తాలూకా.

గుంటూరు జిల్లా.

ముద్రణ :

విజయ ఆర్టు ప్రెస్, తెనాలి.

# కృతజ్ఞతాంజలి

ఇది దివ్యసూరి హృదయము. రమణీయ భావ విలసిత కమనీయ వచన కావ్యకుసుమము. "దివ్యసూరులు" వైష్ణవమతాది పూరుషులైన ఆళ్వారులు - ఆచార్యులు. వారి లోకోత్తర భక్తి ప్రభావశీల వర్తనమే ఈ దివ్యగ్రంథము. ఆముష్మిక చింతన సంపూర్ణముగా విడువబడి, భౌతిక సుఖలాలసత కళ్ళు సాచుచున్న నేటి సమాజమును, తట్టి మేల్కొలిపి సామాజిక దృష్టి నాధ్యాత్మికమువైపు మరల్చుటకే ఇట్టి పవిత్ర గ్రంథము లుద్భవించును. అందునను ఇది వైష్ణవమత సంప్రదాయ గ్రంథము. ఏ మత సంబంధమైన సంప్రదాయమైనను, సామాన్యజనుల కంతగా అందుబాటులో నుండదు. కావున సామాన్యులలో సైతము, ఈ సంస్కారము వ్యాప్తినందుటకే సులభశైలిలో నీ గ్రంథము రచింపబడినది. తోరణ గ్రంథమాలా సాహిత్యరస పిపాసువులైన ఆధునిక పాఠకులకిది తలకెక్కునా? అని ఎవరైన ప్రశ్నించినచో వారికి కాలమే సమాధాన మొసంగగలదని విన్నవించుచున్నాడ.

ఈ గ్రంథమును రచించినవారు, బ్రహ్మశ్రీ వేదమూర్తులు - తర్క-వేదాంత విశారదులు - మా తండ్రిగారు శ్రీమాన్ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్లగారు. వారు గత దశాబ్దత్రయము నుండియు శిష్యసత్తములకు, శ్రీమద్రామాయణ - భారత - భాగవత - భగవద్గీతా - వైష్ణవమత సంప్రదాయములనెల్ల ప్రబోధించుచున్నారు. ఈ వైష్ణవ సంప్రదాయ విషయములను ఆంధ్రపాఠక సర్వమున కందించుటకే వీరు, ఈ బృహత్ప్రయత్నమునకు పూనుకొనిరి. తొలుతగా "పూర్వాచార్య చరిత్రము" అను పేర విశిష్టాద్వైత సంప్రవర్తకులగు రామానుజాచార్యులవారి దివ్యచరిత్రను, మనోహర మధురశైలితో రచించి, శ్రీ తిరుపతి - తిరుమల దేవస్థాన ద్రవ్యసహాయమున ప్రచురించియున్నారు. అది బహుజనాదర పాత్రమైనది. వెంటనే 'దివ్యసూరి హృదయ' రచనను కొనసాగించి హృదయంగమముగా నేడు పాఠక కరకమలముల కందించుచున్నారు. ఇంక ఆచార్య పురుషులు కొందఱు మిగిలియున్నారు. వారి జీవిత విశేషములను దివ్యసూరి హృదయము ద్వితీయభాగమున ప్రకటింపనున్నారు.

మా తండ్రిగారికి అనుపమాన పాండితీ వైభవమున్నది. అనవరతాధ్యయనాధ్యాపనములు కలవు. నవనవోన్మేష ప్రజ్ఞాపాటవము కలదు. గంగాప్రవాహ సదృశ వచన రచనాశైలీ సంపన్నత కలదు. వారి కలమునుండి ముముక్షువులకు సంతతానుష్ఠానీయములగు ననేక అధ్యాత్మిక గ్రంథరాజములు వెలువడగలవు. కాని అవి సూర్యాలోకన భాగ్యమునకు నోచుకొనుటకు అధికద్రవ్య మవసరము. అట్టి సమయమున ఈ దివ్యసూరి హృదయ ముద్రణమును మదీయ భుజస్కంధములపై నిడుకొని, మత గ్రంథములు ప్రచురించుటకు తిరుపతి - తిరుమల దేవస్థానమువారు, రచయితలకు సహాయ మొనర్చుచుండుటచే, దానిని తిరుమల తిరుపతి దేవస్థానమునకు, ద్రవ్యసహాయము నర్థించుచు పంపించితిని. వారు దయతో వెంటనే ద్రవ్యసహాయ మాచరించిరి.

ఉదారముగా కవిపండిత మత గ్రంథ ముద్రణమునకు ధనసహాయ మొనర్చు పథకమునకు రూపకల్పన మొనర్చి, కవి పండితులకు, ముంగొంగు పసిండియైన పరిపాలనాదక్షులు - ఉత్తమాశయులు - తిరుమల - తిరుపతి దేవస్థాన పురోభివృద్ధి కారకులైన శ్రీమాన్ పి. వి. ఆర్. కె. ప్రసాదు, ఐ. ఏ. యస్ తిరుమల - తిరుపతి దేవస్థానము ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారికి హృదయపూర్వక నమస్సుమాంజలులు.

మహాకవులు - భగవద్గీతా వ్యాఖ్యాతలు - సహృదయశ్రేష్ఠులు - కవిపండిత బాంధవులు శ్రీమాన్ రావుల సూర్యనారాయణమూర్తి, ఎం. ఏ; బి.యిడి. తిరుమల- తిరుపతి దేవస్థానము - పౌరసంబంధాధికారి గారికి, మనఃపూర్వకానేక నమస్సుమాంజలులు.

విమర్శకాగ్రేసరులు - మహావిద్వాంసులు - సహృదయసత్తములు - పండిత వర్యులు శ్రీమాన్ కె. సుబ్బారావు ఎం. ఏ. తిరుమల - తిరుపతి దేవస్థానము సంపాదకులుగారికి, హృదయపూర్వకానేక నమస్సుమాంజలులు.

సకాలమునకు చక్కగా ముద్రించి యిచ్చిన, విజయ ఆర్ట్ ప్రెస్, అధినేత శ్రీ టి. కోటిరెడ్డిగారికి కృతజ్ఞతలు.

కవిపండితానేక కావ్యముల్ గ్రంథముల్
ప్రకటించెడు నుదార భావనియతిఁ
బధక మొక్కటి సిద్ధపఱచి తెలుఁగుభాష
కును, హిందు మతమునకును, ననంత
సేవఁజేయుచునున్న శ్రీ ప్రసాదు ఘనుండు
అనఘుండు సూర్యనారాయణుండు
శుభ్రవర్తనుఁడైన సుబ్బరాయాఖ్యుండు
ముగ్గురుఁగూడి త్రిమూర్తులట్లు
హైందవాభ్యుదయంబున కవధిలేని
సేవఁజేయుచున్నారు. సుశ్రీవిలాస
సంపదాయురారోగ్య విస్తరతలొసఁగి
శ్రీనివాసుండు సతము రక్షించుఁగాక.

ఇట్లు,

కందుకూరు
25-12-81

మొవ్వ వృషాద్రిపతి
ఆంధ్రోపన్యాసకులు
కందుకూరు.

తర్క-వేదాంత విశారద శ్రీమాన్ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ ప్రణీత

## దివ్యసూరి హృదయ గ్రంథ ప్రశంసా

శ్రీనివాసం ప్రపద్యేతం జ్యోతిషం ప్రాహయస్యదృక్
పాదూర్వ్యాకరణాదీని ఛందాంసి స్యందనోఽభ్యధాత్ ॥ 1

వరవేదాంచల తర్కతంత్ర కుశల శ్రీవాసపెర్మాళ్కృతః
సకల ప్రాక్తనకోశ సర్వవిషయ ప్రఖ్యాపక స్సన్నుతః
అనభిజ్ఞానుజిఘృక్షయాఽఽన్ధ్రివచన శ్రేణీమయోమంజులో
జయతాదేషహి దివ్యసూరిహృదయాభిఖ్యః ప్రబంధోత్తమమ్ ॥ 2

ఈ దృశ కోశవతంస ప్రణయన విఖ్యాతకౌశల శ్రీమాన్
శ్రీ శ్రీనివాసపెరుమాళ్ ప్రాజ్ఞోజేజీయతాం సతతమ్ ॥ 3

గైర్వాణాంధ్ర ద్రావిడ భాషానేక ప్రబంధ విషయాఢ్యః ।
శ్రీ దివ్యసూరిహృదయా భిఖ్యః కోశోఽన ఘోజీయాత్ ॥ 4

అహో ! సంస్కృతముఖ్యాసు భాషాసు తవపై దుషీ
తద్భహు గ్రంథపఠనం సూతే శ్రీవాసవిస్మయమ్
కించతత్సర్వ విషయరాశేరేకత్ర సంగ్రహః
సరళారచనా చాఽఽహో ! శ్రీ వాస : భవతోఽద్భుతాః ॥ 5

ఇత్యభినందతి విద్యావనపంచా స్యాద్యనేకబిరుదస్య
విక్రాల రామచంద్రా చార్యస్యసుతః కవిప్రియశ్శేషః ॥ 6

ఇతినివేదయతి

విద్యారణ్యపంచానన, విద్యావాచస్పతి

కలికివాయ
25-12-1981

శ్రీ విక్రాల రామచంద్రాచార్య ద్వితీయపుత్రః
మహాకవిః కవితాచతురాననః
విక్రాల శేషాచార్యః

శ్రీ వేంకటగురుభ్యో నమః

# ప్రార్థన

శ్రీ కల్యాణ గుణప్రకాశితుఁడు, రాజీవాక్షభక్తుండు, జ్ఞా
నాకారుండు, అశేష శిష్యజన శ్రేయః కార్యధుర్యుండు; లో
కైకాత్యద్భుత పాండితీవిభవ విఖ్యాతుండు, వేదాంతసు
శ్లోకున్ వేంకటదాసవర్యు జనకున్ స్తోత్రింతు నశ్రాంతమున్.

అనయంబున్ వినయంబునన్ బతిపదాబ్జాతంబు లర్చించుచున్
ఘనకారుణ్యముమీర యాచకజనౌఘంబున్ సదా తన్పుచున్
మనమందున్ రఘురాము దీనజన తా మందారమున్నిల్పెనే
యనురాగార్ణవ, యట్టి మాజనని రాధాంబన్ బ్రశంసించెదన్.

శ్లో॥ యంబ్రహ్మణమితి బ్రువంతి పరమంచాస్మిన్ యుగే పండితాః
భక్తాభీష్ట ఫలప్రదోఽయమితియం సేవంత్యహో మానవాః
యస్యానుగ్రహమేత్య నిత్యసుఖినః తిష్ఠంతి భక్తాజనాః
సోఽయం వేంకటశైల నిత్యనిలయః దద్యాత్సదా మంగళమ్.

శ్లో॥ యస్యాఃప్రసాదామృత వృష్టిపాతాత్
ఫలంత్యమీ చేతన కేదరాస్సదా
విశ్వైక కర్త్రీం వృషశైలనాథ
ప్రియాం పరాం తాం శ్రియమాశ్రయామః.

శ్లో॥ విష్వక్సేనం ఖగకులపతిం కాద్రవేయాధిరాజం
శార్ఙ్గం దివ్యం సురవరగణైస్తూయమానంచ చక్రమ్
శంఖంశుభ్రం దితిజహరకౌమోదకీం నందకంచ
శ్రీవత్సాఖ్యం సురరిపురిపోః పార్షదాదీన్ భజేఽహమ్.

— గ్రంథకర్త

శ్రీ మ తే రా మా ను జా య న మః

# ము న్నుడి

హ ర్తుంతమస్సదసతీ చ వివేక్తుమీశో
మానం ప్రదీప మివకారుణి కోదదాతి
తేనావలోక్య కృతినః పరిభుంజతే తం
తత్రైవ కేపి చపలాశ్మలభీ భవంతి.

(శ్రీరంగరాజ స్తవము - ఉత్తరశతకము)

అజ్ఞానాంధకారమును పోగొట్టుకొనుటకును, మంచి చెడులు తెలిసికొనుటకును సర్వేశ్వరుఁడు జ్ఞానమను దీపము నొసంగెను. దానినుపయోగించుకొని కొందరు తరించుచున్నారు. మరికొందరు దీపమునందు పడి నశించు మిడుతలవలె దానిచేతనే నశించిపోవుచున్నారు.

అన్నట్లు ఈ ప్రకృతియందు బద్ధులై దేనికిని సమర్థులుకాక యందే లీనులై యున్న జీవులకు దయామయుండగు సర్వేశ్వరుడు కరచరణాద్యంగంబుల దయచేసి యున్నాడు. మరియుసమస్త విషయముల తెలిసికొనుటకు, ఈ బద్ధులగు జీవులు లీలావిభూతియందే మ్రగ్గక నిత్యవిభూతికి పోయి నిత్యులతోపాటు సుఖంబనుభవించుటకును తగిన విధానములను తెలుపునట్టి శాస్త్రము నిచ్చియున్నాడు.

"ఓమ్ యథేమాం వాచం కల్యాణీ మావదానిజనేభ్యః,
బ్రహ్మరాజన్యాభ్యాగ్ం శూద్రాయ చార్యాయచ స్వాయ చరణాయ"

(యజుర్వేదము 26-2)

జగదీశ్వరుడు బ్రహ్మ క్షత్రియ శూద్ర వైశ్య సంకరజాతులగు మానవసంతతి దుర్గతి పాలుగాక బ్రహ్మసాయుజ్యమును పొందుటకు శుభప్రదంబగు వేదరూప వాఙ్మయము నొసంగెను.

అయితే బ్రహ్మమను వస్తువొకటున్నదా ? జీవుడను వాడున్నాడా ? యని కొందరు ప్రశ్నించుచున్నారు. అట్టి వారికి సమాధానము చెప్పుట చాల దుర్ఘటము. ఎందువలన నన పరబ్రహ్మము ఇంద్రియంబులకు గోచరించదు. వాక్కున కందదు. మనస్సున కతీతము. అట్టిదాని నెట్లు చూపించగలరు ? ఇట్టిదని యెట్లు చెప్పగలరు ?

ఆ వస్తువు ఎవరికివారికి అనుభవైకవేద్యమే కాని వేరుకాదు. కాని ఇట్టి నాస్తికులు హిందూమతమునందు తప్ప క్రైస్తవ మహమ్మదీయాది మతములయందు వేరు అయినను మహాపురుషులెందరో యీ మతమునకై పాటుబడుచున్నారు. 'దేవుడు లేడు దెయ్యములేదు ఇవన్నియు ఒట్టి వ్యర్థము"లని యెంతమంది ప్రలాపించినను ఈ భారతభూమియందు దైవారాధన యెప్పటికప్పుడు వృద్ధినొందుచునే యున్నది. సర్వేశ్వరు నారాధించుచునే యున్నారు.

సర్వేశ్వరుని పొందుటకు పెద్దలనేక మార్గములు చూపించియుండిరి. ఆ చూపిన మార్గములలో భక్తియొక్కటిమాత్ర మన్నిటియందు నంతర్భూతమై యున్నది. సర్వమతాంగీకారమైన భక్తినే శ్రుతిమాత కొనియాడుచున్నది. 'భక్తిరేవైనం గమయతి' భక్తివశః పురుషః భక్తియొక్కటియే సర్వేశ్వరుని పొందించు చున్నది. సర్వేశ్వరుఁడు భక్తికివశుఁడు. భగవానులుకూడ నట్లే సెలవిచ్చియున్నారు.

"భక్త్యాత్వనన్యయాశక్య అహమేవం విధోఽర్జున
జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచపరంతప"
(భ. గీ. 11-54)

శత్రువులను తపింపఁజేయునట్టి అర్జునా! నన్ను యధార్థముగా తెలుసుకొన వలెనన్న, చూడవలెనన్న, చేరవలెనన్నను భక్తియొక్కటియే పరమసాధనము. అదిలేనిచో నేను గోచరింపను. భక్తియన నేమియన సర్వేశ్వరుని యందు ఎడతెగక నిలిచియుండు ప్రేమ.

"మయ్యావేశ్య మనోయేమాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయాపరయోపేతా స్తేమేయుక్తతమామతాః
(భ. గీ. 12-2)

ఎల్లప్పుడు నాయందే మనస్సునిల్పి నన్ను ఒక్క క్షణకాలమైన వదలజాలక అత్యంత శ్రద్ధగలవారై యెవరు నన్ను ఉపాసించుచున్నారో అట్టివారు భక్తులు. వారే యుక్తతములు. అని గీతాచార్యులు సెలవిచ్చియున్నారు. ఈ బద్ధసంసారులు తరించు టకు నిది సులువగు మార్గము. కొందరిట్టి భక్తిని చేయలేక అనేక కర్మల నాచరించి పలురకములగు చిక్కుట్లకులోనైరి. ఎట్లందురా? పూర్వము శ్వేతుడను రాజర్షి మూడువేల సంవత్సరంబులు తపంబాచరించి బ్రహ్మలోకమునకు పోయెను. కాని అతనికి ఆకలియు దప్పియు నశించలేదు. చతుర్ముఖునాజ్ఞచే తాను పూర్వము విడిచిన తన పాంచభౌతిక శరీరమునే కోసికొని తినెను. (చూడుడు ఉత్తర రామాయణము.)

మూడువేల సంవత్సరములు తపస్సుచేసిన దానికి కలిగిన ఫలమిదియా ? నృగుడను రాజు అనేక సహస్ర గోవుల దానముచేసెను. అంతమునం దతనికి గోదానఫలమగు పుణ్యమురాలేదు. సరికదా ఊసరవెల్లియై అనగా పెద్దతొండయై పుట్టెను. అపారమగు నన్నదానము నిరంతరము వేలసంవత్సరము చేసిన బ్రహ్మదత్తుడు గృధ్రమాయెను. కోటితీర్థంబుల మునిగివచ్చిన కుమారస్వామికి కోర్కె సిద్ధింపదయ్యె. రామనామంబు చేయుచు తన తల్లిచుట్టు తిరిగిన వినాయకునకు ఫలములభించెను. కేవలము సత్యమునకై పాటుపడిన హరిశ్చంద్రుడు మాలవానియింటనుండి శ్మశాన శాసకుడయ్యెను. శతాశ్వమేధంబు లొనరించిన నహుషుండు కొండచిలువయయ్యెను. అయితే వీరు చేసిన పనులన్నియు వ్యర్థమందురాయనిన కాదు అవ్వియు ధర్మములే అయినను అవి అచేతనములు. సాక్షాత్తుగా మోక్షమీయజాలవు. "ధర్మస్యప్రభురచ్యుతః" ధర్మమునకు ప్రభువు నారాయణుడు ఆ ధర్మములకు ఫలమిచ్చువాడు నారాయణుడే. అట్టి నారాయణుని వదలి వారు కేవల ధర్మములనే యాచరించి ఫలహీనులైరి. ఒకటి అంకె వైచి సున్నను పెట్టినచో (10) యగును. రెండు సున్నలు పెట్టినచో (100) నూరగును. అట్లే ఎన్ని సున్నలు పెట్టినను దానివిలువ పెరుగుచుండును. ఆ ఒకటి అంకె తీసి వేసినచో (000) సున్నలన్నియు వ్యర్థమగును. అట్లే భగవంతు నారాధించుచు ఈ ధర్మము లన్నియు భగవచ్ఛాసనములను బుద్ధిచే నుపాసించిన అవియన్నియు ఫలవంతములగును. దానినే గీతాచార్యులు సాయించియున్నారు.

"యత్కరోషియదశ్నాసి యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్"
(భ. గీ. 9.27)

అర్జునా ! నీవు దేనిని చేయుచున్నావో దేనిని తినుచున్నావో దేనిని హోమము చేయుచున్నావో దేనిని దానముచేయుచున్నావో దేనిని తపస్సుచేయుచున్నావో అదియంతయు అనగా దాని ఫలమునంతయు నాకర్పణముచేయుము. ఫలాభిసంధి రహితుడవై కర్మల నాచరింపుము. ప్రహ్లాదుని విషయమునందు చూడుడు -

"పానీయంబులు త్రావుచున్ గుడుచుచున్ .... .... ....

మంచినీరు త్రాగుచు అన్నముతినుచు మాట్లాడుచు తిరుగుచు పాడుచు సర్వేశ్వరుని యందు మనస్సు నిలిపి ఈ విశ్వమును మఱచెను. ఇదియే భక్తి. అట్టి భక్తి నాచరించలేక నేనే పరబ్రహ్మను, మీరందరు బ్రహ్మములే. వేదముకూడ నట్లే చెప్పుచున్నది, "అహంబ్రహ్మాస్మి" "సర్వంఖల్విదం బ్రహ్మ" యని వేదముల కపార్థములు చెప్పుచు కాషాయవస్త్రములు ధరించి ముండులై ఘోటకబ్రహ్మచారులై

లోకమున తిరిగినంతమాత్రమున సర్వేశ్వరుడు సంతోషింపడు. మేము ప్రపన్నులము మాకు జపముతో గాని, భజనముతోగాని, రామకోటితోగాని పనిలేదు. మేమొక్కసారి ప్రపత్తి చేసితిమి. చక్రవర్తి తిరుమకనారుకూడ అట్లే సెలవిచ్చియున్నారు. (సకృదేవ ప్రపన్నాయ) అని చెప్పుచు పట్టుధోవతులు ధరించి పట్టెనామంబులు పెట్టి తిరిగినంతమాత్రమున మోక్షము చేకూరదు.

రామకృష్ణశివాది దేవతలందరు సామాన్యులు. వీరందరికంటెను నతీతమగు శక్తియొక్కటికలదు. మేము దాని నాశ్రయించితిమి. కాన మాకు భక్తిప్రపత్తులతో నిమిత్తము లేదని చెప్పుచు మద్యమాంసాదుల నుపయోగించుచు జనుల మోసగించు వారలకు నరకయాతన తప్పదు.

సర్వేశ్వరుఁడు మన సౌందర్యమున కాశింపడు. మన ధనమున కాసపడడు. అభిజాత్యమును కోరడు. మన తెలివికి లొంగడు. అభినయాదుల తిలకింపడు. వాక్ప్రౌఢిమకు సంతోషింపడు. దాతృత్వమునకు చేచాచడు కాని మన మనస్సుల యందు భక్త్యంకురమున్నదా లేదాయని మాత్రము చూచుచుండును. దీని విషయమై శ్రీవత్సాంక మిశ్రులసూక్తి చూడుడు. —

శ్లో॥ వ్యాధస్యాచరణం ధ్రువస్యచ వయోవిద్యా గజేంద్రస్యకా ?
కుబ్జాయాః కిమునామరూప మధికం కింవాసుదామ్నోధనం
వంశఃకోవిదురస్య యాదవ పతేరుగ్రస్య కింపౌరుషం
భక్త్యాతుష్యతి కేవలం నచగుణైః భక్తిప్రియోమాధవః.

బోయయగు గుహుని శీలమెంత ? ధ్రువుని వయస్సెంత ? గజేంద్రుని విద్యయెంత ? కుబ్జారూప మెట్టిది ? సుదాముని ధనమేపాటి ? విదురుని కులాధిక్యమెంత ? ఉగ్రసేనుని పౌరుషమేపాటి ? సర్వేశ్వరుఁడు వీరినేమి జూచి సంరక్షించెను. భక్తి కొక్కదానికే సంతసించి యాదరించెను. సంసారంబనెడివిషసాగరంబున బడి దిక్కు తెలియకయున్న బద్ధసంసారులకు శ్రీమన్నారాయణుని పాదారవిందములు దక్క వేరుగతిలేదు.

నాథమునుల శ్రీసూక్తిని తిలకింపుడు. —

శ్లో॥ పుఙ్ఖానుపుఙ్ఖ విషయానుప సేవమానో
ధీరోనముంచతి ముకుంద పదారవిందమ్.
సంగీత వాద్యగతి తాన వశంగతాపి
మౌళిస్థకుంభ పరిరక్షణ ధీర్నటీవ.

నాట్యగత్తె సంగీతమును పాడుచు నభినయాదుల చూపుచు, నెత్తి మీదనున్న కడవ కదలకుండునట్లు నెట్లు చూచుకొనునో యట్లే విషయభోగముల ననుభవించుచు ధీరుడగువాడు ముకుందుని పదారవిందముల విడనాడడు.

ఎప్పుడో గుర్తువచ్చినప్పుడు తీరికయున్న సమయమున నెలకొకతూరియో, రెండుపర్యాయములో సర్వేశ్వరుని దలంచుట భక్తియనబడదు. గజేంద్రుడుకదా "ఏ రూపంబున దీనిగెల్తు" నని యారంభించి సర్వేశ్వరుడు గోచరించువఱకు విరామములేక యెట్లు స్తోత్రించెనో అట్లు చేయుటయే భక్తియని పెద్దలు చెప్పుదురు. "మంత్రరత్నానుసంధాన సంతత స్ఫురితాధరః" ద్వయమంత్రోచ్చారణచే నెల్లప్పుడు పెదవి కదలుచుండవలె. అనగా నిరంతర ధ్యానముచేయవలె. కులశేఖరులుకూడ ముకుందమాలయందు.—

శ్లో॥ శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుణ్ఠన కోవిదేతి
నాథేతి నాగశయనేతి జగన్నివాసే
త్యాలాపనం ప్రతిపదంకురుమే ముకుంద ।

ఓ లక్ష్మీరమణా ! కోర్కుల నిచ్చువాడా ! దయామయా ! భక్తులయందు ప్రేమకలవాడా ! సంసారమును ఛేదించువాడా ! ఓ ప్రభూ ! శేషశాయీ ! జగంబు లన్నియు వ్యాపించియుండువాడా ! యని ప్రతిపదమును నేను స్మరించుకొనునట్లు నాకు వరంబొసంగుమా యని ప్రారంభించెను.

గీతాచార్యులవారు భగవద్గీత నవమాధ్యాయమునందు భక్తి నెట్లు కొనియాడి యున్నారో చూడుడు.—

శ్లో॥ సతతం కీర్తయంతోమాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చమాం భక్త్యానిత్యయుక్తా ఉపాసతే.

(భ. గీ. 9.14)

ఎల్లప్పుడు నాయందే భక్తికలవారై, నన్నే కీర్తించుచు నన్ను సేవించుట యందే దీక్షకలవారై నన్నుగూర్చి సాష్టాంగ దండప్రణామాదు లాచరించుచు నాతో నిత్యసంబంధము కలవారై నన్నే ఉపాసించుచున్నారు. ఈ శ్లోకమునకు భగవద్రామానుజుల గీతాభాష్యమును చూడుడు.

"ఈ ఇరువదవ శతాబ్దమునందిట్టి గ్రంథము లెవరికి కావలె ? ఇవి యెవరు చదివెదరు ? అందురేమో ! అదియు సత్యమే. ఈ కాలమునందు మామలకు అత్తలకున్న (చందమామ-నవల) విలువ వేనికిలేదు. అయినను ఎవనిస్వభావమువాడు వీడడు. శ్రీకృష్ణదేవరాయలు "ఆముక్తమాల్యద" యను గ్రంథమును మహాకఠిన ముగా చెప్పినాడు. దాని నర్థముచేసికొనవలెనన్న పూర్వుల వ్యాఖ్యామో, నిఘంటువులో కావలె. అంతయు నారికేళపాకము. ఆ మహారాజంత కాఠిన్యముగా నెందుకు చెప్పినాడన, దానికి సమాధాన మెవరు చెప్పగలరు ? ఆ రాజన్యుని స్వభావమది. కాళిదాసమహాకవి ప్రహసనమను నొకగ్రంథమురచించెను. దానినివిన్నచో నందరు ఏవగించుకొందురు. దానినెందుకు వ్రాసినట్లు ? వల్లభరాయల క్రీడాభిరామము, కవిచౌడప్ప శతకము. వేణుగోపాల శతకము మొదలగునవన్నియు ఈ కోవకు చేరినవే. గుణాఢ్యుని బృహత్కథ యెన్నివేల గ్రంథమో చెప్పుటకు వీలుకాదు. వ్యాసభారతమంత గ్రంథము ప్రపంచమునందే లేదు. శ్రీ శుకప్రోక్తమగు భాగవతమంత కాఠిన్యయుక్తమగు గ్రంథము ప్రపంచమునలేదు. "విద్యావతాం భాగవతే పరీక్షా" అని దానికి బిరుదు. ఈ గ్రంథముల వీరెందుకు రచించినట్లు ? అని అడిగిన సమాధాన మెవరు చెప్పగలరు ? వారు వారు వారివారి స్వభావముల ననుసరించి వ్రాసిరి.

"వస్తా పదరా నే నొస్తా పదరా, కంచితిరునాళ్ళకు" "నాకూ నావారులేరు -
నీకూ నీవారులేరు పదరా బందరుపోదాము, బ్రతికియుంటె మళ్ళీ వద్దాము"

అని కొంతమంది వ్రాసియుండిరి. ఏమయ్యా ఇంత తేలికగా వ్రాసితివనిన ఆ మహాకవులకు కోపమువచ్చును. అందుచేత ఎవరిప్రకృతి ననుసరించి వారు వ్రాయుచుందురు. అట్లే నేనును ఈ గ్రంథమును వ్రాసితి.

శ్లో॥ శిద్ధిర్భవతి వానేతి సంశయోఽచ్యుత సేవినామ్
న సంశయోస్తి తద్భక్త పరిచర్యా రతాత్మనామ్.

సర్వేశ్వరుని సేవించినవారికి సిద్ధికలుగునా కలగదా యను సందేహముండిన నుండవచ్చుగాని, భాగవతుల సేవించినవారికి మాత్రము సిద్ధిపొందుటయందు సందేహము లేదను రీతిని, మహాభాగవతులగు ఆళ్వారుల చరిత్ర వ్రాసినచో జీవితము ధన్యమగుననియెంచి ఈ గ్రంథమును వ్రాసితి. నా శక్తికొలది గ్రంథమును రచించితి.

సారాసారవివేకజ్ఞాః గరీయాంసో మహాత్మనః
ప్రమాణతంత్రాస్సంతీతి కృతో వేదార్థసంగ్రహః

పూడివాడ
దుర్ముఖి-హేమంతము

ఇట్లు
గ్రంథకర్త



మొవ్వ శ్రీనివాసపెరుమాళ్లు, వీరి ధర్మపత్ని

శ్రీ వేంకట పరబ్రహ్మణే నమః

# దివ్యసూరి హృదయము

## (పన్నిద్దరాళ్వారుల వైభవము)

ఈ అనంతమగు విశ్వమునందు, అఖండమగు కాలావచ్ఛేదముచే అనేకములగు పరివర్తనములు వర్తించుచుండును. ఈ సమాజమునందు ఒక కాలమున దూష్యమైన విషయము, ఇంకొక్కతఱి స్తుతి పాత్రమగుచుండును. ఒకనాటిమంచి, మరియొకనాడు చెడుగా పరిగణింపబడుచుండును. భర్తతోపాటు భార్య లోకాంతరమున కనుగమించుట ఒకనాడు గొప్ప సాంప్రదాయము. ఆడపిల్లలకు 'ఓలీ' నొసంగుట ఒకనాటి ఆచారము, అయ్యది నేడు వరకట్న రూపమున సాక్షాత్కరించుచున్నది. ఆనాడు అశ్వమేధాదియజ్ఞములు ఉన్నత కర్మములుగా భావింప బడుటచే "అనాహూతోఽధ్వరంగచ్ఛేత్" వంటి వాక్యము లుద్భవించినవి. మహారాజు లందఱును, మహోత్సాహముతో ఆ యజ్ఞములు నిర్వహించుచువచ్చిరి. మహర్షి సత్తములు దగ్గరనుండి, ఆక్రతువులను నిర్విఘ్నముగా నిర్వర్తింపజేసిరి. యజ్ఞయాగాదులు ప్రాణిహింసా రూపమున నుండుట దర్శించిన మహనీయులు కొందరు, వానిని నిరసించి, నిషేధించిరి. వానిని ఆచరింపరాదని, జనులలో ప్రచార మొనరించిరి. వీనియందరి తప్పొప్పులను నిర్ధరించుట కెవ్వరికిని శక్యముకాదు. కాలమును బట్టి ప్రజలకు ప్రవృత్తిని వృత్తులు కలుగుచుండును.

అదేవిధముగా, ఈపవిత్ర భారతావనిపై ననేక వైదిక మతము లుద్భవించి, అత్యంత వ్యాప్తి గాంచినవి. ఏమతమైనను, ఏ మార్గమైనను, ఉత్తమ నీతి ప్రబోధమునకును, జనులకు, ఈశ్వర సాన్నిధ్యము కల్గించుటకును, లోకమును స్వర్గతుల్య మొనరించుటకును, రూపు దాల్చినవే. ఈశ్వరుని పేరుతో లోకమును మోసగించుట, మానవులలో

హెచ్చు తగ్గులు కల్పించి భేదభావములు సృష్టించుట, అమాయకులను వేధించుట, నేడు సర్వేసర్వత్ర గోచరించు చున్నది. ఇది క్షమింపరాని మహాపాపము. ఇది మానవుని నైతిక పతనమును, స్వార్థపరత్వాతిశయమును వ్యక్తీకరించును.

"సర్వం ఖల్విదంబ్రహ్మ" ఈజగత్తు సర్వమును, బ్రహ్మ స్వరూపము, నీతియుక్తుడు, సత్యసంధుడు, భగవద్భక్తుడు, నైన వాడెందున్నను, ఏకులము వాడైనను ఉత్తమోత్తముడే. విష్ణుభక్తిలేనివాడు ఏకులమునందున్నను, వాడు నీచాతి నీచుడే," అని సభలలో ప్రసంగించుచు నిజ జీవితమున వానిని పాటింపక, వీడు శూద్రుడు, వీడు బ్రాహ్మణుడు, వీడితరుడు, అని నిర్ణయించుచు, వీనికి శాస్త్రపఠనాధికారము లేదు. అట్లని ఈ శాస్త్రమున కలదు. ఈ శాస్త్రమున లేదేమియని ప్రశ్నింతువా, ఒక్క దానియందున్న చాలదా? అన్నింటిని సమన్వయించు కొనవలయును. ఈ శాస్త్రమునుబట్టి ఈ కులములవారి కార్యములుచేయ ననర్హులు. అని అన్నియు తమ స్వార్థానుకూలముగా, కులానుకూలముగా నిర్ణయించుకొనుచున్నారు. శాస్త్ర, పురాణ, వాక్యముల కపార్థములు సృజించుచున్నారు. "అనిత్యాని శరీరాణి - అందరిసొమ్ము నాకేరానీ" అనునట్లు కొందరు నిరంకుశముగా ప్రవర్తించుచున్నారు.

ఈ ప్రవర్తనమును సైరింపని కొందఱు, ఆ వాక్యములను పరిపూర్ణముగా ఖండింప పూనుకొనుచున్నారు. "ఈ విధముగా కొన్ని వర్ణములకు మాత్రమే అధికారము నొసంగిన గ్రంథములు సత్యములగుటెట్లు? వీనియందు ప్రతిపాదింపబడిన లోకాంతరవిశేషములును, సృష్టికర్తృసామర్థ్యాదులన్నియు నబద్ధములే" అని వాదించుచు, నాస్తికవాదమును లోకమున వ్యాప్త మొనరించుచున్నారు.

పై కారణములవలన, నొకకులమును గాని, ఒక మతమును గాని పేర్కొనక, లోకోపకారమునకై కావింపబడు కల్యాణకార్య

ములుగాని, శాస్త్రగ్రంథములుగాని, ఉపాదేయములు. ఈ విధముగా కుల మతాతీతులైన మహాత్ములు కొందఱు దక్షిణ భారతమును, తమ యుదయముచే పవిత్రీ భూతమొనర్చిరి. ఆదివ్య సూరులే ఆళ్వారులు. వారిలో అన్ని కొలములకును చెందిన వారున్నారు. వారు సర్వథా సర్వదా పూజనీయులే. అట్టి విశ్వకుటుంబ దీక్షాదక్షుల చరిత్రములు చదివినను, విన్నను, వ్రాసినను, జన్మము ధన్యమగును. ఆళ్వారులనగా సర్వేశ్వరునియందు అవగాహించిన మనస్సులు గల వారలని అర్థము. వారి దివ్యచారిత్రమును సూక్ష్మముగా తడవుటయే, ఈ గ్రంథ ముఖ్యోద్దేశ్యము.

## పొయగపూదపేయాళ్వారుల ప్రభావము.

పొయ్గ త. శ్లో॥ కాంచ్యాం సరసిహేమాబ్జే జాతం కాసారయోగినం
కలయేయః శ్రియః పత్యుః అరవిందమ కల్పయత్ ॥

పూద త. శ్లో॥ మల్లాపుర వరాధీశం । మాధవీ కుసుమోద్భవమ్ ।
భూతం నమామి యోవిష్ణోః । జ్ఞానదీప
మకల్పయత్ ॥

పేయా త. శ్లో॥ తులాశతభిషగ్జాతం । మయూర పురికైరవాత్ ।
మహాన్తం మహదాఖ్యాతం । వందే శ్రీనంద
కాంశకమ్ ॥

పద్మారమణ పాదాబ్జ ప్రేమ భ్రాంత్యా మనోజ్ఞయా
భ్రాంత యోగీతి విఖ్యాతం మునిం వందే
గుణాంబుధిమ్ ॥

మిణుగురు పురుగులవలె నిరవయవులై నిష్ప్రయోజకులై యున్న ఈ జీవుల నుద్ధరింప దలంచి, అనగా తన సన్నిధాన సౌఖ్యము నొసంగ వాంఛించి, శ్రీమన్నారాయణుండు మనుజ సంతతికి, కరణ కళేబరమ్ము లొసంగె. కాని మానవులు దైవముద్దేశించిన కార్యములకుకాక, ఈ అవయముల ననేక దుర్విషయములకు పాల్పడజేసి అధోగతి పాలగు

చుండిరి. కలుపు దీయుట కేర్పడిన ఇనుప కత్తితో కన్నుగవ పొడుచు కొనినట్లు, భగవత్సాయుజ్యము చెందుట కేయబడిన కళేబరముచే నరక గాములగు చుండిరి.

దయాసింధువైన సర్వేశ్వరు డిదిగాంచి, మానవ సమాజోద్ధరణమునకై రామకృష్ణాద్యనేకావతారము లెత్తెను. తదుపరి తన పరికరములగు నందక, పాంచజన్యాదులను ఆళ్వారులుగా జగత్తున జన్మింపజేసి లోకము నుద్ధరించెను.

పూర్వము ప్రజాపతి దేవాసురులతోగూడి సర్వేశ్వరుని గురించి, ఒక మహాయజ్ఞమును నిర్వర్తించెను. ఆ యజ్ఞహోమకుండము నందు సర్వేశ్వరుండు ప్రత్యక్షమై బ్రహ్మదేవుని కటాక్షించి, కోరినవరములు ప్రసాదించి, అంతర్హితుండయ్యెను. అందుచే నాస్వామికి 'వరదరాజు' అను పేరువచ్చెను 'క' అనగా బ్రహ్మ. అట్టి బ్రహ్మచే నర్చింపబడిన స్థలము కావున నాయూరికి 'కంచి' అను నామము కలిగెను బ్రహ్మసిద్ధిపొందిన ప్రదేశము కావున, నది సత్యావ్రత క్షేత్రమనియు వ్యవహరింప బడుచుండెను. అట్టి కంచియందు పదునాలుగు దివ్యదేశములు కలవు. ఆ దివ్యదేశములలో యథోక్తకారి సన్నిధియందున్న దివ్య కాసార మొకటి.

ఆ కాసారమునందు ఒక హేమారవిందము విరిసెను. ఆ బంగారు తామరపూవునుండి యొక దివ్యపురుషు డవతరించెను. కాసారమునందు జనించిన కారణమున ఆయన కాసారయోగి యను ప్రసిద్ధి నందెను. తమిళ భాషలో పొయి గాళ్వారను నామము మరియు మల్లాపురంబున మాధవీపుష్పమునుండి, నొక దివ్యపురుషు డుద్భవించెను. ఈయనను భూతయోగియని నామము ఈయన ద్రావిడ నామము పూదత్తాళ్వారు. మయూరపురమునందు కైరవపుష్పమునుండి యొక దివ్యపురుషుడు జన్మించెను. ఈయనను మహదాఖ్య యోగి యందురు. ఈయనకు పేయాళ్వారులని ద్రావిడనామము. వీరు ముప్వురును, అయోనిజులు

గావున వెంటనే బాల్య యౌవన కౌమారముల నతిక్రమించిరి. జ్ఞాన భక్త్యాదులకు జలధిప్రాయులై లోకము నుద్ధరించుచు బద్ధచేతనులకు జ్ఞానోపదేశము చేయుచు రెండుదినము లొకచో నుండరాదని గ్రామైక రాత్రులగుచు తిరుగు చుండిరి.

ఒకానొక దినమున కాసారయోగి భూభ్రమణము కావించుచు, ఒక గ్రామమున రాత్రివేళ ఒక పంచటరుగుమీద శయనించెను. అట్టి సమయమున భూతయోగియు నట నట సంచరించుచు, నచ్చటికే వచ్చెను. వీరొకరి నొకరెరుంగరు. ఆ కారణమున పండుకొనియున్న కాసారయోగిని జూచి భూతయోగి యిట్లనియెను. "ఇచ్చట పండుకొని యున్న మహనీయులు, తామెవ్వరో యెఱుంగవచ్చునా?" అపుడాతనిం జూచి కాసారయోగి, "మహాత్మా! నేను భగవద్దాసుండను. ఇందు శయించి యున్నవాడను. ఇంతకును తామెవ్వరో యెఱుంగనగునా?" యని ప్రశ్నించెను. అందులకు భూతయోగి "అయ్యా! నేనొక రామదాసుడను. మీరు పవ్వళించియున్న తిన్నె పైకి వచ్చుటకు ఈ దాసున కనుజ్ఞ నిత్తురా?" అని అడిగెను. ఆ తిన్నె యొక్కరు పండుకొనుటకు మాత్రమే సరిపోవును. ఆమాట విని కాసారయోగి "ఆర్యా! ఇంతకు ముందు నేనొక్కరుండనే గనుక పండుకొంటిని, దయచేయుడు. ఇరువురమును కూర్చుండవచ్చును." అని ఆహ్వానించెను. అంత వారిరువురును కూరుచుండి భగవద్గుణానుభవమున తేలియాడుచుండిరి.

ఇంతలో మహదాఖ్య యోగియు నచ్చటికరుగుదెంచెను. అరుగుపై నున్న వారింగాంచి, "ఆర్యులారా! మీరెవ్వరో ఇచ్చట ఆసీనులరై యున్నారు. నేనొక భగవద్దాసుండను. ఈ రేయి పుచ్చుటకు, మీరున్న ఆ తిన్నెపైకి నేను రావచ్చునా?" అని ప్రశ్నించెను. ఆమాటలకలరి, వారిరువురును, నూతనుని గాంచి "అయ్యా! మేమును భగవద్దాసులమే ఇంతకుమున్ను మేమిద్దరము కావున కూరుచుంటిమి. మీరును దయ చేయుడు. ముప్వురమును నిలుచుండి యుండవచ్చును. "అని ఆదరంబుగ

భాషించిరి. మహదాఖ్యయోగియు నాతిస్నే నలంకరించెను. ముగ్గురును నిలువబడి "బోధయంతః పరస్పరం" అనునట్లు భగవద్విషయము నొకరి కొకరు చెప్పుకొనుచు మహానందము పొందుచుండిరి.

ఆ సమీపమున తిరుక్కోవలూరను గ్రామంబుకలదు. అందు వాత్సల్య జలధియగు శ్రీమన్నారాయణుండు వేంచేసి యుండెను. ఆ మహాపురుషులు ముప్పురొకచోట నుండుటచే సర్వేశ్వరుడును అచ్చటికి వేంచేసి,వారి నడుమ నిలువబడెను."యత్రగాయంతి మద్భక్తాః తత్రతిష్ఠామినారద" "నారదా! నాభక్తులు నన్నుగూర్చి ఎచ్చట కొని యాడు చుందురో, నేను నచ్చటనే యుందు" నని సర్వేశ్వరుడు పూర్వమే నారదునకు చెప్పియున్నాడు కదా! అపుడు ముగ్గురాళ్వారులును మిగుల నొత్తిడి ననుభవించు చుండిరి. అపుడు వారు ముప్పురును, ఒకరి నొకరు చూచుకొని, యొకరు, మరి యిద్దరితో "అయ్యలారా! మనము ముప్పురమే యుంటిమి. నాలవవారెవ్వరును, మన మధ్యమునకు రాలేదు. మరి యిది యేమిచోద్యము. మనముప్పురి సందున నెవ్వో చేరి మనల క్రిందికి నెట్టుచున్నారు అని ఆశ్చర్యమగ్నులై చూచుచుండిరి. అపుడు వారిమధ్యనున్న జనార్ధనస్వామి హారకిరీట కేయూరగ్రైవేయక కటిసూత్ర నూపురాది దివ్యభూషణ భూషితుండై పీతాంబర శోభిత దివ్య విగ్రహుండై, శంఖచక్ర గదాది దివ్యాయుధ ధరుండై, లక్ష్మీ విరాజిత వక్షస్థలుండై వారికి ప్రత్యక్షమయ్యెను. అంత వారు దేవాది దేవుండగు జగదీశ్వరుని సందర్శించి, హర్షపులకిత గాత్రులై సాష్టాంగ వందన ప్రణామము లాచరించి, చేతులు జోడించి, అనేక విధంబుల కొనియాడిరి. ఆ జగన్నాయకుని దర్శించినంతనే, హృదయమున క్రిక్కిరిసిన ఆనందము శబ్దరూపమున బయలు వెలువడెనో యనునట్లు ఆశువుగా ముప్పురును, మూడు ప్రబంధములలో భక్తాభీష్ట ప్రదుండగు పరమేశ్వరుని స్తుతించిరి. ఇప్పుడామూడు ప్రబంధములును ద్రావిడ భాషయందు కలవు. వీరు ముప్పురును ఆదిమాళ్వారులనియు అప్పుష్ప

సంసారగంధులనియు, సర్వేశ్వర నామంబులే నిత్యధారక పోషక భోగ్యం బులుగా జీవించు వారనియు లోకము భావించెను. ఈ విధముగా లోకమున భక్తి భావము నుజ్జీవింప జేయుచు వారు లోకసంచారులై యుండిరి.

**తిరుమళిశైయాళ్వారు - భక్తి సారయోగి.**

శ్లో॥ "పంచశక్తి మయ దివ్య విగ్రహం
భక్తి మత్సుజన భూర్యనుగ్రహం
పాప చేతన మనోతి దుర్గ్రహం
భక్తి సారముని మాశ్రయేఽన్వహం"

పూర్వము సప్తర్షులు ప్రజాపతి కడకుంజని "స్వామీ! మేమొక యజ్ఞము నొనరింప తలంచితిమి. ఏ స్థలమున చేసిన నదిలెస్సగా భాసించి ఫలించునో, ఏది దివ్యసారమో, ఆనతిండు." అని విన్నవించిరి.

ఆ వాక్యములాలకించి విరించి తన మనమున యోజించి, అఖండ భూమీ మండలము నొక ప్రక్కను, విదేహ దేశము నొకవైపునను తుల యందుంచి, తూచెను. భూమండలమునకన్న విదేహమండలమే మిక్కిలి బరువుగానుండెను. అది చూచి బ్రహ్మ సప్తరుల భావించి "ఋషి సత్తములారా! అఖిల భూమండలమునకన్న విదేహ దేశమే గురుతరమైయున్నది. ఇది మహామహీసారము. ఇచ్చట మీరు యజ్ఞము నిర్వహింపుడు" అని ఆదేశించెను.

అంత నామహర్షులు బ్రహ్మ వాక్యానుసారముగా విదేహ దేశమున కరుగుదెంచిరి. అచ్చటి మనోహరోద్యానవనములందు క్రతువున కారంభించిరి. యజ్ఞాంతమునందు సర్వేశ్వరుడు సాక్షాత్కరించి, వారు వాంఛించిన వరము లనుగ్రహించి అంతర్హితుండయ్యెను. అందు భార్గవ ముని సంతానమును కోరెను. వెన్నుండను గ్రహించెను, అంత భార్గవుని ధర్మపత్ని గర్భవతియై దశమ మాసమునందు పుత్రుని ప్రసవించెను.

కాని పుట్టిన శిశువు మావిచే చుట్టబడియున్న హేతువున ఉల్బాకారమున నుండెను. అది చూచి భార్గవునిభార్య "అయ్యో! మాకు పుత్రుడు కలుగునని శ్రీహరి వర మొసంగెను. కాని కుమారుడు కలుగకపోగా తుంబ మొకటి జనించెను. ఈవిషయ మితరులు విన్నను, చూచినను హేళన చేయుదురు. దీని నెవ్వరును చూడరాదు." అని తలంచి, ఆ తుంబమును తీసికొనిపోయి, ఒక అడవియందు, ప్రేప పొదలోనుంచి తిరిగివచ్చి పతి శుశ్రూష చేయుచుండెను.

అంత జగదీశ్వరుడా అడవియం దవతరించి, ఆపిల్లవాని నొక్క సారి కటాక్షించెను. పిల్లవానిని కప్పియుంచిన మావి తొలగిపోయెను, లోపలి శిశువు సర్వాంగశోభితుడై ప్రకాశించెను. ఆ కలి కోర్వజాలక ఆ శిశువు ఏడ్చుచుండెను. జగదీశ్వరుడు, తన దివ్యరూపము నా బాలునకు ప్రదర్శించుచు, బాలకుని ఆనంద ప్రవాహమున నోలలార్చుచుండెను. కొంత సేపటికి శ్రీహరి, బాలునకు ఆకలిదప్పులు లేకుండ వారించి, అదృశ్యుండయ్యెను. అంతవఱకును, భగవద్దర్శనముచే నానందపడు చున్న పిల్లవాడు, తద్దర్శనము ముగియగనే, కెవ్వు కెవ్వుమని రోదించు చుండెను. అదేసమయమున తిరువాళరను పేరుగల మహాపురుషుం డొక్కరుండు ప్రేపపూవులు కోయుటకు ఆ యడవికివచ్చెను. పిల్లవాని రోదన ధ్వని విని ఆ పొద దరించేరి, యందున్న శిశువును గాంచెను. ఆ బాలకుండు దివ్య తేజోమయాకారుడై కటిక నేలపై పడియుండి యేడ్చు చుండెను.

తిరువాళరు, పిల్లవాని రూపసంపద కచ్చెరువంది, పిల్లవాని నెత్తుకొని పోయి భార్య కొప్పగించెను. సంతాన విరహితయగుటచే నామె ఆ బాలు నల్లారుముద్దుగ పెంచుచుండెను, అనపత్యుడగు తనకు దైవమీ విధముగా స్వయంప్రాప్తుడగు కుమారు నొసంగి నాడని ఆతడనేక విధముల నానందపడుచుండెను. ఆ పిల్లవాని కాదంపతులు భక్తిసారుం డని నామకరణము గావించిరి. శర్కరాసమ్మిశ్రిత గోక్షీర ధారలతో నాపిల్లవానిని పెంచుచుండిరి.

ఇట్టు లబ్బాలకునకు ఐదు సంవత్సరములు గడిచెను. ఒకానొక దినమున నా బాలకుడు పెంచుచున్న తల్లిదండ్రులంజూచి "జననీ జనకులారా! నేను మీగర్భవాసమున జనించితినా? లేక ఎచ్చటినుండియైన గొనివచ్చి నన్ను పోషించి పెంచుచుంటిరా!" యని ప్రశ్నించెను.

ఆ వాక్యము లాలకించి, వారలాశ్చర్య సహితులై సత్యసంధులు కావున "అయ్యా! నీవు భగవదనుగ్రహమున మాకు లభించిన పెన్నిధివి. ఎట్లైనను, మాకు కుమారుండవే" అని వచించిరి. అందులకా అర్భకుడు చిరునవ్వు నవ్వి "నేను మీకు కొమరుండ కాకపోవుటేమి? మీరు నాతల్లిదండ్రులే. దొరికిన నన్ను కొనివచ్చి ప్రేమాదరములు పెనగొన, నల్లారుముద్దుగా పెంచితిరి. అందువలన మీ ఋణమును తీర్పవలసి యున్నది. అందులకై మీకొక మనవి చేసెద. అన్యథా భావింపకుడు నేను పాన మొనర్చిన శేషదుగ్ధమును, మీరిరువురును త్రాగుడు. అట్లు చేసిన మీగర్భవాసమున నావంటి ఆత్మజుండొక డుద్భవింపగలడు" అని నిర్దేశించెను.

ఆ దంపతు లావాక్యముల కలరి, బాలుని మాహాత్మ్యంబున కచ్చెరువంది, పిల్లవాడు త్రావగా మిగిలిన పాలను గ్రోలిరి. అంత నామె గర్భమును తాల్చెను. నవమాసంబులు కడచన్న పిదప, నొక సుముహూర్తంబున నామె యొక అందాల పాపనిం గనియెను. ఆ పసివానికి "కణికణ్ణారు" అను పేరుపెట్టి ముద్దు ముచ్చటలు గాంచుచు పెంచుచుండిరి. ఇట్లు బాలకులిద్దరును, అన్యోన్యముగా సమస్త విద్య లభ్యసించు చుండిరి.

భక్తిసారుండు ఋషి పుత్రుండు కాబట్టి, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి రూపమగు అష్టాంగ యోగరహస్యము లన్నియు భగవదనుగ్రహముచే స్వయం ప్రాప్తమ్ము లయ్యెను. ఆ విధముగా నాతండు కొంతకాలము పెంచిన

తల్లిదండ్రుల యొద్దనుండి, ఒకానొక దినమున వారలతో నిట్లనియె. "ఓజననీ జనకులారా! ఈలోక మశాశ్వతము. సుఖరహితము. సంసారమునకు మించిన శత్రువు లేదని శాస్త్రములు వక్కాణించు చున్నవి. జీవులు పూర్వ కర్మానుసారముగా శరీరములు ధరించు చున్నారు. ఈ మనుష్య శరీరము వచ్చుట దుర్లభతమము. "దుర్లభోమానుషో దేహః" అను శాస్త్రవాక్యము వినరైతిరే. ఈ శరీరధారణచే జీవుడు జ్ఞానియగు చున్నాడు. ఇది మంచి. ఇది చెడుగు, ఇది చేయదగినది. ఇది చేయ తగనిది. అని తెలిసికొనగల్గు చున్నాడు. ఈ జన్మమునందే మోక్షమునకై యత్నింపవలయును. ఇతర జన్మములందు దీనికై యత్నించుట సాధ్యపడదు. ఈశ్వరోపాసన చేసిన వాడు గొప్పవాడు. ఈ దుఃఖరూపమగు సంసారమును వీడి, పరమాత్మ సాన్నిధ్యంబునందగలడు. ఇది తెలియక, ఈశరీరమే ముఖ్యమని, ఈ సంసారమే సర్వశ్రేష్ఠమని తలంచి, ఈ సంసార సాగరమున భ్రమించు మానవుడు చెట్టు కొమ్మమీద నిద్రించిన మూఢునివలె నధోగతి పాలగును. నేను పరమాత్మోపాసన గావించి తరించవలయునని తలంచుచుంటిని. మీరును అట్లే చేయుడు, మీకును దైవసాన్నిధ్య సాయుజ్యము లభింపగలదు. ఇక నేను పోయి వచ్చెద. నాకొఱకై మీరు మనః క్లేశమునంద వలదు".

ఇట్లు తల్లిదండ్రులను వీడ్కొని, బయలు వెడలి, దేశదేశములు సంచరించుచు, భక్తిసారుడు భగవత్సన్నిధికి చేర్చుటకు ఏమతము సామర్థ్యవంతమో! యని చర్చింప దొడగెను. అప్పటికే ప్రపంచమున గల, శాక్యోలూక, అక్షపాద, క్షపణ, కపిల, పతంజల్యాది మహర్షులచే నిర్ణయింపబడిన మతములను, శైవమాయావాదన్యాయవైశేషిక, భాట్టప్రాభాకరాది మతముల నారసి, అన్నింటియందును, శైవంబు గొప్పది యని యెంచి, శైవవ్రతదీక్షితుడై భస్మత్రిపుండ్ర రుద్రాక్షధరుండై, "శివాత్పరతరం నాస్తి" యని జనుల కుపదేశించుచు నొకచోట నివసించియుండెను. అట్టి సమయమున, ఆదిమాళ్వారులలో నొక్క

రుండగు మహదాఖ్యయోగి భక్తిసార యోగియున్న ప్రదేశమున కేతెంచెను. ద్వాదశోర్ధ్వ పుండ్రధారియు, తులసీ నలినాక్ష మాలాధరుం డగు మహదాఖ్యయోగిం జూచి, భక్తిసారయోగి "ఇతడెవడో వీర వైష్ణవుడుగా నున్నాడు. ఇతనితో మనకేమి ప్రయోజనము?" అని మాటలాడక మిన్నకయుండెను. అపుడు మహదాఖ్యయోగి భక్తిసార యోగిం జూచి "అయ్యో! ఇతడు మహాపురుషుండయ్యు వేదబాహ్యం బైన శైవ మతావలంబియై యున్నాడు, ఈతనిని చక్కదిద్ది సరియైన మార్గమున బెట్టుట యెట్లు!" అని ఆలోచించి భక్తిసారుని కుటీరమున కెదురుగా కుటీరమును నిర్మించుకొనెను. ఒక చెట్టు కొమ్మను తెచ్చి తలక్రిందుగా పాతిపెట్టెను. చిల్లికుండ నొకదానిని గ్రహించి నీరు కొని వచ్చి ఆ చెట్టుకొమ్మకు పోయుచుండెను. ఇట్లు కొన్ని దినములు గడచి నవి. భక్తిసారుడు మహదాఖ్యునిం గాంచి, విస్మయ సంజనితుండై ఆతనిని సమీపించి" ఆర్యా! నీవు వైష్ణవుండవు. అందును వృద్ధుండవు, నీవు చేయుచున్న పని వ్యర్థప్రయోజనకరమై గోచరించుచున్నది. నీవు చెట్టు కొమ్మను తలక్రిందులుగా పాతితివి. వేరును భూమిలో పాతుటకు మారుగా, కొమ్మ పైభాగమును భూమిలో నాటితివి. క్రిందిభాగమున పాతి, నీరుపోసిన బ్రతుకును. మంచి కుండతో నీరు పోయవలయును, కాని చిల్లి కుండతో నీర యెట్లు తేగలవు. దానిని బావినుండి పైకి లాగు లోపలనే నీరంతయు పోవుచున్నదికదా ! నిన్ను పిచ్చివానిగా తలంచుటకు వీలుగాక యున్నది. కాని నీవు చేయు పని యున్మత్త కార్యమై తోచుచున్నది. అని పలికెను.

అందులకు మహదాఖ్యయోగి, మందహాస మొనరించి "వత్సా! నీవీప్రశ్న వేయుదువని యెఱుంగుదు. నాకార్యము నీకు పిచ్చిదిగా గోచరించిన నీవు చేయుచున్న పని మిక్కిలి వ్యర్థముగా నాకు తోచు చున్నది. ఏలయందువా "సర్వం విష్ణుమయం జగత్" అనియు "నదైవం కేశవాత్పరం" అనియు, "ఏకోహవై నారాయణ ఆసీత్" అనియు

శాస్త్రములు సప్రమాణకములై వేయినోళ్ళ ఘోషించు చున్నవి.
ఇక లోకమునందు ప్రొద్దున లేచినది మొదలు, ఆచమన సంకల్పాదు
లన్నియు "కేశవాయస్వాహా" నారాయణాయస్వాహా" అనియు "మహా
విష్ణోరాజ్ఞయా" అనియు నారాయణ పరములుగా నున్నవి. అట్టి
నారాయణుని వీడి, శివ ప్రతిపత్తిని కలిగియుంటివి" అని పలికి విష్ణు
తత్త్వము నంతయు నుపదేశించి, భక్తిసారుని వైష్ణవమతమునందు నెల
కొల్పెను. భక్తిసారుండును హృదయపూర్వకముగా వైష్ణవమును స్వీక
రించి, ద్వాదశోర్ధ్వ పుండ్రములు ధరించి, తులసీ నలినాక్ష మాలాలం
కృతుండై విరాజిల్లెను. మహదాఖ్యయోగి, భక్తిసారయోగిని వీడు
కొని యథేచ్ఛంజనియె. మహదాఖ్యయోగి కృపాలబ్ధస్వ స్వరూపజ్ఞాన
సాగరుండై భక్తిసారయోగి, దివ్యజ్ఞాన సంపన్నుడై సత్యవ్రత క్షేత్రం
బను కాంచీనగరంబున కేగెను. యథోక్తకారి సన్నిధికేగి, ఆ దేవాది
దేవునకు మంగళాశాసనంబాచరించి, కాసారయోగి జన్మించిన సరోవర
తీరమునందు కుటీరమును నిర్మించుకొని దానియందు ధ్యానసమాధి
నిష్ఠుడగుచు సర్వేశ్వర భజన మొనర్చుచుండెను. అట్టి సమయమున
తనను పెంచిన జననీ జనకుల కుద్భవించిన కణికణ్ణారు తల్లిదండ్రులకు
చెప్పక సంసారమును నిస్సారముగా నెంచి సర్వసంగ పరిత్యాగియై
దేశాటనము చేయుచు సత్యవ్రత క్షేత్రమునకు వచ్చెను.

భక్తిసారయోగిని గూర్చి యెఱింగి, ఆయన పాదపద్మము
లాశ్రయించెను. గురుదేవుండును, ఆతనికి పంచ సంస్కారాదిహితంబు
లొనరించి, అర్థ పంచకము నుపదేశించి, ఆకారత్రయ సంపన్ను నొన
రించి, వేద వేదాంగాది విద్యల నధ్యయనింప జేయుచు సుఖంబుండెను.

ఇట్లుండ వామదేవుండు ఒకానొక దినమున, తన దేవేరియగు
గౌరీదేవితో గూడి నందివాహనారూఢుండై గగన మార్గమున పయ
నించు చుండెను. ఆ సమయమున భక్తిసారుండు ద్వాదశోర్ధ్వ పుండ్ర
ధారియై, తులసీ నలినాక్షమాలా విరాజిత వక్షస్థలుండై, పర్ణశాల

ముందు కూర్చుండి, కంథ నొకదానిని కూర్చుచుండెను. ఆతడెందులకో పైకి దృష్టి సారించి, వృషభధ్వజుని వాహనము నీడ తనమీద పడకుండ, నటు నిటు తప్పుకొనుచుండెను. అది గాంచి పార్వతీదేవి, శంకరునితో "ప్రాణేశ్వరా! ఈ వింత గమనించితిరిగదా! క్రింద పర్ణశాలా ప్రాంగణమ్మున కూరుచుండి, ఈతడెవడో, మన నీడ తనమీద పడకుండ తప్పుకొను చున్నాడు. ఆతని పేరేమి? అసలాతడెవ్వడు? చిహ్నములం బట్టి యాతడొక వైష్ణవ శ్రేష్ఠునిగా గోచరించుచున్నాడు" అని పలికెను.

భూతేశుడు, పార్వతి మోముందిలకించి "దేవీ! ఈతడొక విష్ణుభక్తుండు. భక్తిసారుండను నామధేయముగలవాడు. ఈతడు తొల్లి మన భక్తుడు. మారిపోయి విష్ణుభక్తుండైనాడు. విష్ణుభక్తులు, కలలోనైనను, పరదేవతలను కన్నులెత్తి కనుంగొనరు. అందువలన నాతడు మన నీడ పడకుండ, తప్పుకొని, వర్తించు చున్నాడు" అని సమాధాన మొసంగెను.

ఆ మాటలకపర్ణనవ్వి "ఈతడొకప్పుడు మనభక్తుడై యుండెనా? ఇప్పుడు వైష్ణవుడైనాడా? నాథా! తమకభ్యంతరము లేకున్నచో నీతని నొకసారి చూచిపోవుదము. వాహనమును క్రిందికి దింపుడు" అని విన్నవించుకొనెను. శూలి సమ్మతించెను. పార్వతీ పరమేశ్వరులు భక్తిసారయోగి యెదుట ప్రత్యక్షమైరి. భక్తిసారయోగి యొక్కసారి తలయెత్తి గిరిజాగిరిశుల దర్శించి, తలవాంచుకొని, ఏమియు మాటాడక తన పనిలో నిమగ్నుడై యుండెను.

అపుడు పరమేశ్వరుండు భక్తిసారుంజూచి "ఓయీ! లోక మహేశ్వరుండనగు నేనరుదెంచి, నీ ముందట నిలువబడియుండ నన్నిట్లు హేళన మొనర్చుట తగునా?" యని ప్రశ్నించెను. అందులకు భక్తిసారుడు "దేవా! మీవలన నాకు అణుమాత్రమైన పనిలేదు. కాదందువా, ఇదిగో యీకంథయందు సూది చక్కగా జరుగునట్లు వర మొసంగి దయ చేయుడు" అని నిర్లక్ష్యముగ సమాధాన మొసంగెను. ఆ మాటలు

విని రుద్రుండాగ్రహోదగ్రుండయ్యెను. కటములదిరెను. బొమలు ముడి
వడెను. "ఏమీ! నన్నింత చులుకన యొనర్చి హేళన మొనర్తువా!
పూర్వము మనసిజుని ఎట్లు భస్మ మొనర్చితినో, అట్లే నిన్నును భస్మీక
రించెద." నని భీకరంబుగ పలికి, నిటుల నేత్రాగ్నిని ప్రజ్వలింప జేసెను.
ఆ భర్గుని నేత్రోద్భవంబగు నాదారుణాగ్ని తన్నేత్రమునుండి, అవక్ర
పరాక్రంబున నిర్గమించి, ప్రళయ కాల సముద్భూత మహావాయు
నిర్ధూతచ్ఛటచ్ఛటోద్భటా శని సంఘాతనిర్ఘాత భస్మీభూత లోకాలోక
సప్త జిహ్వాభోగ బంధురంబై, ఆకాశము నిరవకాశ మొనరించుచు,
భక్తిసార గురుని ఆక్రమించి, విజృంభించెను, అయ్యది చూచి, భక్తి
సారుండు మందస్మిత వదనారవిందుండై భార్గవ వంశస్థుడగుటచేత తన
కుడికాలి బొటన వ్రేలియందున్న నేత్రాగ్నిని ప్రజ్వలింప జేసెను. అది
జృంభించి, అంతకాల చరాచరా స్తీర్ణ లోకాలోక దహన సముద్భూత
సహస్ర కరాభీల మార్తాండ మండలోద్భూత ప్రచండ వైశ్వానర
సమంబై ఆ భర్గనేత్రాగ్ని నెదుర్కొనియెను. అది చూచి పరమశివు
డత్యాగ్రహంబొంది పుష్కలావర్తకాది ప్రళయకాల మహామేఘముల
సృష్టించెను. అవి నీరంధ్రమ్ముగా ఆకాశమ్మున గ్రమ్మి ఖద్యోత
మండలము విద్యోతితంబుగాకుండ, ఆసారజటిలంబుగా వర్షించెను,
ఆ వర్షమున భక్తిసారుడు చలింపక తన యోగ సమాధిచే సుస్థిరుండై
కూరుచుండెను. భర్గుండు దానిం జూచి తన మాయనంతయును అడంచి,
భక్తిసారుంజూచి, "వత్సా! నీవంటి మహాపురుషుని మేమెన్నండును
చూచి యెఱుంగము. భక్తిసార నామంబును సార్థకపరచితివి. పోయి
వత్తుము" అని ఆశీఃపూర్వకంబుగా వీడుకొని, తన అర్ధాంగినింగూడి
నంది వాహనారూఢుండై యథేచ్ఛంజనియె.

ఇట్లు కాలము కడచనుచుండ, కొంకణ సిద్ధుండను రసవాది
యొకడు భక్తిసారుని సమీపించి, నమస్కరించి, "అయ్యా! తాము
దైవాంశ సంభూతులని వింటిని. విష్ణుభక్తి పరాయణుండవు. మీ యట్టి

మహానుభావులకు చేసిన దానంబు కోటిగుణితం బగునని పెద్దలు వచింతురు. నాయొద్ద నొకగుళికయున్నది. దానిని, ఏలోహమున కంటించినను, ఆలోహ మంతయు బంగారంబగు. దానిని మీకు సమర్పింప దలచితిని'' అని పలికి, దానిని సంచినుండి తీసి భక్తి సారునకీయబోయెను. అది చూచి భక్తిసారుడు'' సిద్ధవరా! నీగుళిక నాకవసరములేదు. ఇట్టి రసవాదములను నేను పెక్కు లెఱుంగుదును. నీ గుళికకు, హేమముగా మార్చుటకు లోహము కావలయును. నా యొద్దనున్న గుళికా ప్రభావముచే రాతినైనను, మట్టినైనను, హేమింప చేయగలను. చూడుము'' అనిపలికి, తన చెవియందలి గులిమిని కొంతతీసి, శరీరమందున్న మట్టిని నలిపి, తీసి రెండింటిని గుళికగా తయారుచేసి దానిని కోంకణసిద్ధున కొసంగెను. అది తీసికొని కోంకణసిద్ధుడు దాని నొకరాతికి తాకించెను. అది యంతయు పసిండి ముద్దయయ్యెను. అందులకు సిద్ధుడాశ్చర్యపడి, ''స్వామీ! అట్లైనచో, ఇపుడు మీశరీరమందున్న శాటి మిక్కిలి జీర్ణమైయున్నది. దానిని వీడి ఇదిగో ''నాయొద్దనున్న యీ దుశ్శాలువను గ్రహింపుడు. ఇది చాల విలువగలది'' అని పలికెను. ఆమాటలు విని గురుండు'' ''సిద్ధా! నాయొద్ద శాలువలు లేక దీనిని కప్పితినని యెంచితివా? అదిగో ఆ కంథయందున్న శాలువను తీసి చూడుము'' అని చెప్పెను. సిద్ధుడు గురుని సంచినుండి శాలువను పైకి తీసెను. అది సువర్ణమయమై రత్నస్థగితమై యుండెను. ధగధగ మెరయుచు కన్నులు మిరుమిట్లు కొలుపుచుండెను, అది చూచి సిద్ధుడు భక్తిసారుని పాదములపైబడి నమస్కరించి ''ఆర్యా! మీరు మానవులు కారు. సాక్షాత్తు జగదీశ్వరులే'' అని సన్నుతించి సెలవు గైకొని వెడలి పోయెను.

ఇట్లుండగా నా యూరిలోని యొక ముదుసలి అవ్వ ప్రతిదినము ప్రాతఃకాలమున నేగుదెంచి, భక్తిసారయోగియుటజాంగణము నెల్ల పరిమార్జన మాచరించి, కలయంపి చల్లి, రంగవల్లికలు తీర్చిదిద్ది, ఉటజము లోపలి భాగమును శుభ్రపరచి, అలికి పోవుచుండెను. ఇట్లు

కొన్ని దినములు కడచనినవి. ఒకనాఁడు గురుండా అవ్వను గాంచి 'అవ్వా! నీవేమి ప్రయోజనమును వాంఛించి, నాకీ పరిచర్య నొనరించు చున్నావు? నీకేమి కావలయునో కోరుకొమ్ము. సందియమ్ము వలదు' అని పలికెను.

ఆ మాటలకావృద్ధ భక్తిసార గురునికి పునః పునర్వందనములు గావించి, "మహాభాగా! నా శరీరము నలముకొన్న యీ ముదుసలి తనము నాకసహ్యమై యున్నది. ఈ లోకమే సౌందర్య హీనముగా గోచరించుచున్నది. మీకు నాయందు కటాక్షలేశమున్నచో దయతో, నాకు మనోహర నిత్య సౌందర్యము నొసంగుము" అని పరిపరి విధముల ప్రార్థించెను.

ఆ ముదుసలి కోరికకు గురుండు నవ్వి "అవ్వా! నీవొకప్పుడు యౌవన వతిగా నుంటివిగదా! అపుడు నీవు పొందిన శారీరక భోగములు నీకు సంతృప్తిని ఘటింపలేదా! ఇంతవఱకు నీవేమి సాధించితివి? ఇక వచ్చు యౌవనముచే నేసుఖంబుల ప్రాముకొనదలంచితివి? యౌవనాధుల నిత్యములు. భోగంబులు క్షణికంబులు. జీవితము బుద్బుదప్రాయంబు. ధనంబులు చందలాలతికలు. తెలివిగలవారు వీనిలో దేనిని విశ్వసింపరు. పూర్వ యౌవనముతో కొంత పాపము సముపార్జించితివి. ఇంకను కొంత యార్జింపగలవు." అని బోధించి, "అవ్వా! అట్లే నీ కోరిక ప్రకారము నీకు యౌవన ప్రాప్తియగు పొమ్ము" అని పలికెను.

ఆ ముదుసలి, గురునకు సాష్టాంగము లాచరించి, గృహమ్మున కరిగెను. ఆరాత్రి నిదురించి యుదయమున లేచుసరికి, గురు ప్రభావంబున, ఆ తన్వి ఇరువది యైదు వత్సరములు కలిగినదై, రంభాద్యప్సరోంగనా సౌందర్యమును తిరస్కరించుచు, చూపరులకు మిక్కిలి ఆశ్చర్యాద్భు తమ్ముల కలిగించెను. ఆమె సౌందర్యము ప్రజా సందోహమునకు నిత్య స్తవనీయ మయ్యెను.

ఆనోట, ఆనోట బడి, ఆమె సౌందర్య వార్త రాజు చెవి చేరినది. అతడు స్వయముగా విచ్చేసి, ఆమె సౌందర్యమున కాసపడి, ఆమెను వివాహమాడి, యిష్టసుఖము లనుభవించుచుండెను. ఇట్లు కొంతకాలము గడచినది. ఆ నరపాలుని యౌవనము, గ్రీష్మ సమయ ప్రవాహ నీరమ్ము భాతి క్రమ క్రమముగా జారిపోయెను. భార్య యౌవనము క్రమ క్రమముగా పెరుగుచుండెను. ఆ వింతనారసి, ఆ భూజాని భార్యతో "ప్రేయసీ! నాశరీరమునందు నానాటికి పాటవము తగ్గుచున్నది. నీశరీరపాటవము నిరంతరాభివృద్ధి ప్రదమై యొప్పుచున్నది. దీనికి కారణమేమి?" అని ప్రశ్నించెను.

ఆమె భూమీశుంగాంచి "ఆర్యా! నా యౌవ్వనము శరీర సహజము కాదు. నేనొక పండు ముదుసలిని. మన పట్టణమునందలి భక్తిసార గురునాశ్రయించి తద్దయా ప్రాప్తిచే నీ యౌవన సహిత సౌందర్యమును బడసితిని. మీరును వారి శ్రీపాదము లాశ్రయించితిరేని, మీకును యౌవనోదయము సంప్రాప్తించును. అతని శిష్యుడు కణిక్కణ్ణారని యెడు భాగవతోత్తముండు ప్రతిదినంబును, మన భవనమ్మునకు భిక్షాటనమునకై యేతెంచుచుండు. అతడు కవిసత్తముండు. అతనిచే కొనియాడబడినచో మీకు మంచిదశ రాగలదు" అని హితమును వచించెను.

ఆ నరపాలుడు రాజ్యాంగ విషయముల విసర్జించి, కణిక్కణ్ణారెప్పుడరుదెంచునో, అతనితో నెప్పుడు సంభాషణం బబ్బునో యని యువ్విళులూరుచు నెదురు చూచుచుండెను. కణిక్కణ్ణారు భిక్షాటనమునకై రాజగృహమ్మునకే తెంచెను. రాజు కణిక్కణ్ణారును జూచి "ఓయీ సన్యాసీ! నీగురుండు సర్వసమర్థుండని వినియుంటిమి. అతని నిక్కడకు తోడుకొని రమ్ము" అని అధికార దర్పము ధ్వనింపగా నాజ్ఞాపించెను. ఆ మాటలు విని కణిక్కణ్ణారు మండిపడి "రాజా! నీ వధికార గర్వంబున క్రిందు మీదు నెఱుంగక వదరు చుంటివి. నా

ఆచార్యుల నాజ్ఞాపించుటకుగాని, తీసికొని వచ్చుటకుగాని, ఫాలాక్షునకే
శక్యముకాదు. ఇక నీబోటి యల్పుని గూర్చి చెప్పనేల? అదియుంగాక
మాగురుండు భగవదాలయంబులకుందప్ప స్త్రీల కడగంటి చూపులకు
వశ్యులై పెంపుడు కుక్కలవలె, ఇంటి పిల్లులవలె తిరుగాడు నీవంటి
నీచనరాధముల యింటికి విచ్చేయునా?" అని నిరసించి పలికెను.

ఆ మాటలు విని రాజు "పోనిమ్ము. నీవేదో కవీశ్వరుండవట.
కవిత్వము చెప్పెదవట. నన్ను స్తుతించుచు, నాపై కొన్ని పద్దియము
లల్లుము" అని పలికెను. అందులకు కణికణ్ణారు నవ్వి "పిచ్చిరాజా'
నేను దైవమును స్తుతింతును. గురుస్తోత్రము గావింతును. ఇతర విష
యముల కవిత్వము చెప్పనొల్ల" నని నిక్కచ్చిగా తెల్ల మొనర్చెను.

రాజునకు కోపము వచ్చినది. ఆగ్రహోదగ్రుడైనాడు. ఆ సాధు
సత్తముం జూచి, "ఓయీ! నీవు నోటికి వచ్చినట్లు ప్రేలుచుంటివి.'!
"నావిష్ణుః పృథివీపతిః" అను న్యాయము నెఱుంగవా ? ప్రభుండు
విష్ణ్వం సంభూతుండను నది విస్మరించి, నన్ను చులుకన జేసి మాటాడి
తివి. ఈ ప్రభుని దేశమున, ఆతని దయచే బ్రతుకగలుగుచున్నానను
సత్యమును విస్మరించితివి. మేము నిగ్రహించినచో నీగతి యేమగునో
వెనుక ముందరయక పలుకుచుంటివి. ఇట్టి నీవు మాదేశమున వసింప
రాదు. మాదేశంబును వీడి ఎటకేనియు పొమ్ము" అని గద్దించి పలికెను.

ఆ సాధుసత్తము డాతనిం జూచి "అట్లే ఇక క్షణముగూడ
నీవంటి నికృష్టుని రాజ్యమున నుండను. నీవు పొమ్మనక పోయినను, ఇంక
నిచ్చట నిలువరాదు" అని పలికి గురుని సమీపించి, అంఘ్రిద్వయము
పైబడి, రాజమందిరమున జరిగిన వృత్తాంతము నంతయు సవివరముగా
తెల్పి "క్షణమైన నీదేశమున నుండరాదు. ఎచ్చటికైన పోయెద
అనుజ్ఞయియుండు" అని ప్రార్థించెను. గురుండు శిష్యునిం జూచి" వత్సా!
నీవు లేనిచోట నాకుమాత్ర మేమిపని? నీవు లేక నేనెట్లు నిలువగలను!
నేనుగూడ నీతోడ వచ్చెద. మనంతట మనము పోవుట మంచిదికాదు.

అనంతశయనుండగు స్వామికి చెప్పి, ఆజ్ఞ గైకొని వెడలి పోవుదము' అని చెప్పి, శిష్య సహితుడై యథోక్తకారి సన్నిధికిం బోయి దేవాది దేవుని దర్శించి, పాదారవింద ద్వయంబునకు సాష్టాంగము లాచరించి, "ఓ ప్రభూ! బ్రహ్మదేవుని యజ్ఞమును కాపాడుటకై ఇచ్చట అనంతుని పై శయనించి లోకముల కటాక్షించు చుంటివి. నీయనుగ్రహమున మేమి చ్చట ఐదువందల యేండ్లనుండి సుఖంబున్నారము.

ఈ దేశపాలకునకును, మాశిష్యునకును నేటికి కలహము సంప్రా ప్తించినది. మా శిష్యుడీదేశమును వీడిపోనున్నవాడు, అతండు లేక నేను నిలువజాలను గాన, నేనును వెడలిపోదలంచితిని. అనుగ్రహించి, సెల వొసంగి, ఆశీర్వదించి, పంపింపుము. పోయివత్తు, జగదీశా! తమ దివ్య చిత్తమున, నన్ను విస్మరింపవలదు." అని నమస్కరించి వెనుదిరిగెను.

ఆ మాటలు విని జగన్నాయకుండు "వత్సా! నీ సన్నిధానము మాకు మహానందదాయకముగా నున్నది. నిన్ను విడనాడి, నేనిచ్చట వసియింపజాలను. నీవెంట నేనును చనుదెంచెద" నని వచించి, భుజగ నాథుని చుట్టగా చుట్టుకొని, చంక నిడుకొని బయలు దేరెను.

ఈ విధముగా బయలుదేరి, ముందు కణికృష్ణారు, సాగిపోవు చుండెను. వెనుక భక్తిసారయోగియు, ఆవెనుక యథోక్తకారియు సాగిపోవుచుండిరి. ఈ విధముగా వారు ముగ్వురును కాంచీనగరపు సరి హద్దుల దాటిపోయిరి. వెంటనే కాంచీపురిలోని శివాలయాంతర శివ లింగములు, విష్ణ్వాలయాంతర్భాగ విగ్రహంబులు నొక్కసారిగా అదృ శ్యంబయ్యె. పట్టణం బంతయు నంధకారం బావరించెను. ఉల్కలు రాల జొచ్చెను. నక్కల అరపులు కర్ణకఠోరములై వినిపించెను. ఆకసంబున గ్రద్దలాడ జొచ్చెను. కాకఘూకములు, వికారముగా ధ్వనింప సాగెను. రాజనగరులోని గుఱ్ఱంబుల కన్నీరు కార్చజొచ్చెను. ద్విరదములు మదవిహీనమ్ములయ్యెను. ఇట్లు అనేక దుర్నిమిత్తములు గోచరించెను.

ఈ ఘోరదృశ్యముల తిలకించిన కాంచీపురాధిపుఁడు, భయపడి, పెద్దల రావించి "అయ్యలారా! ఈ మన కాంచీనగరంబు పుణ్యప్రదంబు. ఏలకో ఈ నాఁడీ దుర్దశ ప్రాపించినది, అకారణముగా నగరంబంతయు, పీడాకరంబై భయంకర దర్శనమై యున్నది. దీనికి పరిహారోక్తి నానతిండు" అని వేడుకొనియెను.

ఆమాట లాలకించి వారు రాజా! ఈదుశ్శకునంబులకు నీవే కారణము. కణికృష్ణారను సాధుపుంగవుని నీవు దూరితివి. అతని దేశ బహిష్కృతుని గావించితివి. అతఁడు తన గురుండగు భక్తసారయోగితో గూడి పోవుచున్నవాఁడు. వారిని యథోక్తకారి అనుసరించినాఁడు. కావున ఈ యుపద్రవము లావహిల్లినవి. సాధుపుంగవులతో విగ్రహించుట మంచిది కాదు. వారు నిగ్రహించుటకును, అనుగ్రహించుటకును సమర్థులు. వారికి కోపము వచ్చిన రాజాధి రాజైనను నశించును. వారనుగ్రహించిన దరిద్రుడు దేవేంద్రుడగును. కావున నీవిప్పుడు బయలుదేరి వారిని ప్రార్థించి తీసికొని రమ్ము, లేనిచో ప్రమాదము మితిమీఱును" అని ఆనతిచ్చిరి.

ఆ మాటలు విని, తన చేతకు పరితపించి, పెద్దలను కొందఱిని వెంట నిడుకొని, పట్టణంబు బయలు వెడలి, భక్తిసారుఁడు పోవు మార్గము వెంటబడి, రెండు క్రోసుల దూరమేగుసరికి, వారు గోచరించిరి. అంత రాజు సపరివారుడై శీఘ్రగమనంబుల వారల సమీపించి, యథోక్తకారిం దర్శించి, మువ్వురకును నమస్కరించి, స్వామితో "దేవా! తామిట్లు గ్రామమును తిరస్కరించి వెడలి పోనగునా!" అని వేడుకొనెను. ఆమాటలు విని స్వామి "నేనూరక పోవుచుంటినా నాభక్తుఁడు పోవుచున్నాఁడు. నేనాతని వెంబడించి పోవుచుంటిని. అతని విడిచి నేనుండజాల" నని తెల్పెను.

అప్పుడా రాజు భక్తిసారయోగి పాదారవిందముల పైబడి "స్వామీ! దయతో నా పట్టణమునకు మరలి రావలసినది" అని

వినయముతో విన్నవించుకొనెను, ఆమాటలకు యోగి శ్రేష్ఠుడు నిర్మల వదనుండై "రాజా! నాదేమున్నదయ్యా! శిష్యుడు వెడలిపోవుచున్నాడు. నేనునువాని ననుసరించుచుంటిని." అని బదులు పలికెను. అపుడు రాజు కణికణ్ణారు పాదముల పై బడి, "సాధుసత్తమా! మరలి నాదేశమునకు రండు" అని ప్రార్థించెను. కణికణ్ణారు రాజు శీర్షమును, కాలితో నావలకు నెట్టి" రాజాధమా! "నాపట్టణమందుండవలదు. వెడలిపొమ్ము" అని గర్వముతో నాజ్ఞాపించితివికదా! నీ యానతి ప్రకారమే పోవుచుంటిని. ఇప్పుడు నాయవసరము ఏమి కలిగినది? నీవు పొమ్మన్నప్పుడు పోవుటకును, రమ్మనినప్పుడు వచ్చుటకును, నేను నీ మోచేతి నీళ్లు త్రావు సేవకుడనని యెంచితివా? మాగురు సత్తముడానాడు నీకంటికంత చులకనగా గోచరించెనా? పొమ్ము, పొము. నీరాజ్యమునందొక్క అడుగైన నిడజాల" నని కఠినముగా సమాధాన మొసంగెను.

రాజు పట్టిన పట్టు విడువక, కణికణ్ణారు పదద్వయి పయి మాటి మాటికి పడజొచ్చెను. కణికణ్ణారు తిరస్కరించు చుండెను. అది చూచి భక్తిసారయోగి శిష్యునితో "శిష్య" ఉత్తమస్యక్షణం కోపమ్" ఉత్తమున కొక్క క్షణకాలమే కోపముండునని పెద్దలందురు. నీవంటి నిర్మల హృదయునకు దీర్ఘక్రోధము తగదు. రాజొనర్చిన నేరమునకు శిక్షను విధించితివి. ఇక చాలు. ఆతని క్షమింపుము" అని అనునయించి పలికెను.

కణికణ్ణారు గురుని వాక్యములు శిరమున ధరించి "రాజా! నా ఆచార్యానుగ్రహముచే బ్రతికి పోయితివి, పద. నగరమును ప్రవేశింతము" అని శాంతించి నరపాలుని వెంట వెనుకకు తిరిగెను. రాజు వారినందఱ వెంట బెట్టుకొని కాంచీపుర ప్రవేశము చేసెను. దుర్నిమిత్తము లన్నియు నశించెను. దేవాలయము లందలి బింబములన్నియు యథాప్రకారము గోచరములయ్యెను. యథోక్తకారి తన ఆలయమున శేషశయ్య నలంకరించెను. భక్తిసారుండును శిష్యుండును కొంతకాల మచ్చటనే సుఖనివాస మొనర్చిరి.

కొంతకాలమైన పిదప భక్తిసారయోగి, సత్యవ్రత క్షేత్రమును వీడి ఒకానొక కొండ బిలములో ప్రవేశించి అందు నిరంతర భగవదారాధన మొనరించు చుండెను. ఆది మాళ్వారులగు కాసారయోగి, భూతయోగి, మహదాఖ్యయోగి. మువ్వురును కలిసి దేశాటనము చేయుచుండిరి. వారు మార్గమధ్యము నందున్న పర్వత గుహయందొక దివ్యతేజమును దర్శించి ఆశ్చర్య నిమగ్నులైరి. ఇదియేమి? ఇందేదియో దివ్యతేజమున్నది, సాక్షాద్దర్శనము కావించు కొందమని, మువ్వురును అందు ప్రవేశించిరి. లోనికేతెంచుచున్న పెద్దల దర్శించి, భక్తిసార యోగి, వారలకు సాష్టాంగ ప్రణామంబు లాచరించి, అర్ఘ్య పాద్యాది విధుల పూజించెను. వారును భక్తిసారయోగికి సాష్టాంగనతు లొనరించి కుశల ప్రశ్నలు నైచిరి, అనంతరము భగవద్విషయమున నోలలాడుచు కొంత కాలము గడపిరి.

అంత కాసారయోగియు, భూతయోగియు, భక్తిసారునితో పోయి వచ్చెదమని చెప్పి సెలవు తీసికొని వీడిపోయిరి. మహదాఖ్య యోగియు, భక్తిసారయోగియు, ఆ కొండబిలమునందే భగవద్గుణానుభవ మొనరించుచు, కొంతకాలముండి, ఎవ్వరి త్రోవవారు చనిరి. వారిరువురు ఆ కొండ బిలమునందుండి భగవద్గుణానుభవము నెరపిన కాలము, ఐదువందల సంవత్సరములని పెద్దలు వచింతురు.

ఆ తరువాత భక్తిసార గురుండు, కుంభకోణ దివ్యక్షేత్రమున వేంచేసియున్న అపర్యాప్తామృత దేవుండగు శార్ఙ్గపాణిని దర్శింప నెంచి, పోవుచుండెను. మధ్యేమార్గమునందొక అగ్రహారము కలదు. భక్తిసారులా అగ్రహార మధ్యమున చనుచుండెను. అందు కొందఱు విప్రులు వేదాధ్యయనము చేయుచుండిరి. వారు భక్తిసారునింగాంచి, వదన వర్చస్సునుంబట్టి బ్రాహ్మణుండని తలంచిరి. కాని ఆతనియందు విప్ర చిహ్నములు లేవు. కావున నాతడు విప్రుండు కాడని తలంచి, అధ్యయనము నాపివైచిరి. అది గమనించిన భక్తిసార యోగీంద్రుండు

మనంబున నిట్లు తలంచెను. "వీరు నన్నుంగాంచి, బ్రాహ్మణుండను గానని యెంచి, వేదశ్రవణంబున కనర్హుండనని భావించిరి కాబోలు. అందులకే వేదాధ్యయనము నాపివైచిరి. ఇచ్చట నుండరా"దని యెంచి, త్వర త్వరగా నడచిపోయెను. కొంతసేపకాటికి భూసురులు, వేదము నారంభింప తలంచిరి. కాని, వారెచ్చట వదలిరో, ఆ భాగమెవ్వరికిని స్మృతి పథంబున గోచరింప దయ్యెను. అంత నాధరణీసురులు, తమలో తామిట్లని వితర్కించుకొనిరి. "మనము చాల దోసంగా చరించితిమి. ఇప్పుడేగిన మసీషి, విప్రచిహ్న బాహ్యుడైన కతమున, బ్రాహ్మణుండు కాడని తలంచి, వేదపఠనమును నిలిపి వైచితిమి. అంతియేకాని, బ్రహ్మ విదగ్రేసరుండగు భాగవతోత్తముండని చింతింప మైతిమి. ఆతని ప్రభావంబుననే మనకీ విప్రతిపత్తి యేర్పడినది. ఆతని యొద్దకే పోయి, మనము తెలిసికొనవలయు. నింతకన్న మార్గాంతరములేదు" అని తర్కించి, బయలుదేరి, కొంతదూరమేగి భక్తిసార గురుం దర్శించి, ఆతనితో నా బాడబులిట్లనిరి. "అయ్యా తమరు వచ్చు సమయమున మేము వేదాధ్యయనము చేయుచుంటిమి! మిమ్ము దర్శించి విరమించితిమి. మరల నారంభించుటకు ప్రయత్నించితిమి. కాని దాని నెచ్చట నాపితిమో స్ఫురణకు రాలేదు. వేదము నెచ్చట నాపెదరో అచ్చటనే ప్రారంభింప వలయుగాని, ముందు వెనుకల నారంభించుట మహాపాతకమని పెద్దలు వక్కాణింతురు, దయతో మేము, ఆపినవిషయమును తెలియజేయుడు "అని ప్రార్థించిరి. అపుడు భక్తిసారుడు" అయ్యలారా! నేను వేదమును వినరాదని గదా మీ అధ్యయనము నాపితిరి. అట్టిదని నేనెట్లువింటి. అది నాకు గుర్తున్నను శూద్రకులజుండనగు నేనెట్లు వాక్రుత్తు? ఐనను మీరు బాధపడుచున్నారు గాన గుర్తు చేసెదనని తెల్పి, నల్లని వడ్లగింజ నొకదానిని చేత ధరించి, దానిని గోటితో రెండుగా చీల్చివైచెను. అది చూచిన బ్రాహ్మణుల కందఱకును, అపుడు "కృష్ణానాం వ్రీహీనాం నఖనిర్భిన్న" మనియెడు ఋక్కు గదాయని జ్ఞప్తికివచ్చెను. అపుడా విప్రులందఱును

విస్మయావిష్టచిత్తులై "మానవులకు కులము ప్రధానముకాదు, గుణములే ప్రధానము. భగవద్భక్తుడగు వాడేకులమున జనించినను, శూద్రుడుకాడు. అతడు బ్రాహ్మణ శేఖరుడు, ఆత్మగుణములు లేనివాడు మాత్రమే చండాలుడు అని గుర్తించి, భక్తిసారుని పాదారవిందములకు ప్రణమిల్లి, అనేక విధముల కొనియాడిరి.

భక్తిసార గురుండదే గ్రామమునందు భిక్షాటనము చేయుచుండెను. ఆగ్రామ మధ్యమున నొక దేవాలయము కలదు. ఆ దేవాలయము నందలి దైవ విగ్రహము, భక్తిసారుడే వైపున భిక్ష నందుచుండెనో ఆవైపునకు తిరుగుచుండెను అట్లు గిర గిర తిరుగుచున్న విగ్రహమును వీక్షించి, అర్చకులు భయమంది, అనతి దూరమ్మున యజ్ఞము చేయుచున్న విప్రులకు తెలిపిరి. వారందరును చనుదెంచి, విగ్రహ భ్రమణమ్మును దర్శించి, అచ్చెరువంది, ఏమియిది యని ఆలోచించిరి. కొంత తడవునకు వారికి సత్యము గోచరించెను. "ఈ గ్రామమునందెవ్వరో భక్తిశ్రేష్ఠుడు సంచరించు చున్నవాడు. అతడేవైపునకు పోవునో విగ్రహమును, ఆవైపునకే తిరుగుచున్నది. అతడెంతటి మహనీయుడోకదా!" అని నిర్ణయించిరి. అట్లు నిశ్చయించి, వారందఱును గుమిగూడి గ్రామమున భిక్షపట్టుచున్న భక్తిసార గురుని దర్శించి, "ఈ యోగియే సర్వేశ్వర విగ్రహ భ్రమణమ్మునకు కారకుండని నిశ్చయించి, సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి, తామొనరించుచున్న యజ్ఞవాటమ్మునకు కొంపోయిరి. యజ్ఞకర్త భక్తిసార గురుని ప్రభావంబు విని అర్ఘ్యపాద్యాది విధుల పూజించి అతనితో నిట్లనియె. "స్వామీ! మీరు సాక్షాన్నారాయణ స్వరూపులరు, మమ్ముద్ధరించుటకై యజ్ఞ వాటికకే తెంచినారు. మీవంటి మహాత్ములను పూజించిన భగవానుడు సంతసించు. మేమొనర్చిన మహా పాతకములన్నియు నశించిపోవు. మీ దర్శన భాగ్యమ్మున మేము కృతార్థులమైతిమి. మా జన్మము పవిత్రమైనది." ఈ విధముగా నగ్గించి, యజ్ఞాంతము నందొక మహా పూరుషుని

పూజింప వలయునను నియమము ననుసరించి భక్తిసారగురుని పూజించెను. అది చూచి పెక్కురు సంతసించిరిగాని, కొంద రసూయాగ్రస్తులు రాజసూయావసరమున ధర్మజుడు శ్రీకృష్ణ భగవానున కొనరించిన పూజనుగాంచి, అధిక్షేపించిన శిశుపాలునివలె, నధిక్షేపించుచు యజ్ఞకర్తతో నిట్లనిరి.

"ఓయీ! నీ వొనర్చిన, ఈ మహాయజ్ఞ మంతయు నీకార్యముచే నిష్ఫలమైనది. యజ్ఞాంతమున దివ్యపురుషుండగు బ్రాహ్మణుని పూజింప వలయును. ఎవనినో, దేశద్రిమ్మరియు, గుణహీనుండునునగు నీశూద్రునితో కొనివచ్చి పూజించితివి. నీవందుచే కులభ్రష్టుండవైతివి. అట్టి నీయజ్ఞమున బ్రాహ్మణులమగు మేము భుజింపరాదు. తెలిసియో, తెలియకయో నీవొనర్చిన పూజను, ఆశూద్రకులజుండు గ్రహింప వచ్చునా? నాకు తగదని చెప్పవలె. అట్లు చేయక మహాపురుషునివలె పూజనంతయు గ్రహించినాడు. ఇక నీసవన మేమగునో? ఈ గ్రహించిన శూద్రుడేమగునో చూడుడు. దీనినంతయు నాశమొనర్తుమని ఆగ్రహోదగ్రులై తర్జన భర్జన చేయుచు నోటికివచ్చినట్లు పొగరు మాటల వదరుచుండిరి.

ఆ వాక్యములన్నియు నాలించి, యజ్ఞకర్త భక్తిసారయోగింజూచి "ఆర్యా! నేను మీకొనరించిన అగ్రపూజను సహింపలేక, యీ దుర్మార్గులు దుర్భాషలాడుచున్నారు. వీరి నోరులు పడిపోవునట్లు మీ దివ్యమహిమ నొక్కసారి ప్రదర్శింపుడు" అని వేడుకొనెను. భక్తిసారుడు సారసాక్షుని మనసార ప్రార్థించెను. సభయంతయు నొక్కసారి భగ్గురని మండిపోయినట్లు గోచరించెను. ఆ భక్తిసారయోగి శిరస్సున విష్వక్సేనాది నిత్యసూరులతో, శంఖచక్రాది దివ్యాయుధ పంచకముతో, హార కిరీట కేయూర వనమాలాది దివ్య భూషణములతో, శ్రీభూనీళాది దివ్యమహిషీ సముదాయముతో సహస్ర భోగి భోగపర్యంకంబున శయనించియున్న అనంత శయనుండు ప్రత్యక్షమయ్యెను.

ఆదివ్య తేజమును సహింపనేరక కొందరు మూర్ఛిల్లిరి. కొందరు నేత్రములు మూసికొనిరి. కొందరు మహాభక్తులు మాత్రము "సర్వ దివ్య మంగళ విగ్రహాయ, సమస్త పరివారాయ శ్రీమతేనారాయణా యనమః" అని వేదవాక్యంబుల ప్రస్తుతించుచుండిరి. కొందఱు పురుష సూక్తము నధ్యయనించుచుండిరి. ఇట్లు కొద్దిసేపు దివ్యదర్శన మొసంగిన జగన్నాథుం డంతర్హితుండయ్యెను కల్లోలితమైన సభయంతయు కొంతసేపటికి తెప్పరిల్లి, భక్తిసారగురుని యెదుట మోకరిల్లి అనేక విధముల కొనియాడి, బ్రహ్మరథాధి రూఢుం జేసి గ్రామోత్సవంబు నెరపిరి. గ్రామస్థులందఱు పుష్పాక్షతాది నానావిధ పూజాద్రవ్యములచే నమ్మహాత్ముని అర్చించి, నీరాజనంబు లొసంగి తరించిరి. భక్తిసారయోగీంద్రుండు, ఆ పూజనము లన్నింటినీ గ్రహించి, అందర నాశీర్వదించి, వారల వీడ్కొని కుంభకోణంబునకు చనియెను.

ఇట్లాతడు కుంభకోణ సమీపమున ప్రవహించుచున్న మరుద్వృధయం దవగాహన మొనర్చి, ద్వాదశోర్ధ్వ పుండ్రధారియై, శార్ఙ్గపాణిస్వామి ఆలయంబునకేగి, గోపురంబునకు జోహారువులిడి, బలిపీఠము కడ శిరమువంచి, ధ్వజదండంబున కంజలించి, గరుడునకు ప్రణామము లాచరించి, జయవిజయులం గొనియాడి, గర్భాలయంబున ప్రవేశించి, అనంతునిపై శయనించియున్న జగదాది దేవుండగు శార్ఙ్గపాణిం దర్శించి చేతులు జోడించి "భక్తవత్సలా! దయాజలధీ! ఏలపరుండియుండితివి? మత్స్యరూపమును ధరించి, సోమకాసురు సంహరించిన అలసటయా? యజ్ఞవరాహ రూపివై ప్రళయోదధిమగ్న వసుమతి నుద్ధరించిన నాటి శ్రమయా! లేక కూర్మావతారమున మందరగిరి మోచిన నాటి ప్రాలుమాలికయా? మావంటి దాసజను లేతెంచినప్పుడును లేచి పలుకరింపవలదా"! యని ప్రశ్నించెను.

ఆమాటలువిని జగదీశ్వరుండు చిరునవ్వుతో శేషునిపై నుండి లేచుచుండెను. అది గమనించి భక్తసారయోగి సర్వేశ్వరునితో "దేవాదిదేవా ! విశ్వమయా ! అవధరింపుము. నీవనంతకోటి బ్రహ్మాండముల కధిపతివి. జగజ్జన్మ క్షేమలయాదులకు కర్తవు. లక్ష్మీభర్తవు. అట్టి జగన్నాయకుండవైన నీవు, జ్ఞానహీనుండనైన నాయాజ్ఞ పాటించుట పాడియా ! చాలు చాలు, నికలేవవలదు." అని వారించెను.

ఆమాట లాలకించి శార్ఙ్గపాణిస్వామి అట్లేనిలువబడియుండెను. భక్తుల వాక్యములకు సర్వేశ్వరుడు కట్టుబడియుండ గలడని ప్రబోధించుటకై స్వామి యిప్పటికిని, కుంభకోణంబునందు, ఉత్థానశయనంబు గలిగి సర్వజనులకును దర్శనమిచ్చుచున్నాడు. భక్తసారయోగి శార్ఙ్గపాణిస్వామికి మంగళాశాసనముచేసి, కుంభకోణమునందే నివసించి, చాలకాలము సమస్త చేతనులకు భగవత్తత్త్వంబు బోధించుచు, తుదకు వైభవంబును చాలించెను.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

— : ౦ : —

## కులశేఖరులు

శ్లో॥ కుంభే పునర్వ సూజాతం - కేరళేకోళి పట్టణే
కౌస్తు భాంశం ధరాధీశం - కులశేఖర మాశ్రయే.

శ్లో॥ ఘుష్యతేయస్యనగరే - రంగ యాత్రాదినేదినే
తమహం శిరసావందే - రాజానంకుల శేఖరం.

కేరళ దేశమునందు కులశేఖరుండను మహాపురుషుడొక్కరుండు, రాజకులశేఖరుండు గలడు. ఆతని రాజధాని తిరువనంతపురము. లెక్కకు మిక్కుటమగు రథగజతురగ పదాతి సైన్యసమూహంబుతో,

అనేక సామంతరాజులతో కేరళదేశము నేకచ్ఛత్రాధిపత్యముగా పరి
పాలించుచుండెను. ఆతడు భగవదనుగ్రహ సంజనిత జ్ఞానవసుధియై,
భగవదేకాంతరంగియై వైష్ణవజన తిలకుండై యుండెను.

ఆతడు రాజ్యమునకు వచ్చిన వెంటనే, భగవద్భాగవతారాధన
తత్పరమతియై, రాజ్యభారము నంతయు విశ్వాసముగల మంత్రుల భుజ
స్కంధము లందుంచి, భాగవత గోష్ఠితో కాలముగడపుచుండెను. ఒక
నాడు గోష్ఠిలో పండితుడు తిరుమల వేంకటేశ్వరుని వైభవమును
వీనుల విందుగా వినిపించుచుండెను. దానిని విన్న కులశేఖరుల కానంద
ముచే, భక్తిభావముచే శరీరము పులకించినది. అపుడాతడు "ఓపద్మా
వతీ విభూ ! నేనురాబోవు జన్మమున వేంకటాచలము నందొక పక్షిగా
జన్మింతునుగాక. నీదేవాలయ మంటపము ముందు గడపగా పడియుండి,
నీ భక్తుల పాదధూళిచే నిరంతరము కృతార్థతనందు చుండెదగాక',
అని భావించుచుండెను. ఆకారణమున నిప్పటికిని, తెలిసిన భక్తులు,
వేంకటేశ్వరుని ముందున్న గడపను కులశేఖరు లాశ్రయించి యుందురని
తలంచి, దానినెవ్వరును త్రొక్కరు.

ఆరాజ చంద్రునకు నిత్యమును ఒక పండితుడు శ్రీ మద్రామా
యణమును వినిపించుచుండ వలయును. ఒకనాడు రామాయణము
వినుచు కులశేఖరుడు పులకితగాత్రుడై, తద్గాథయందేలయించిన
చిత్తముగలవాడై యుండెను. పౌరాణికు డారణ్య కాండమునందలి ఖరా
సుర వధాఘట్టమును వర్ణించుచుండెను. అదివిని కులశేఖరులప్పుడే
రామాయణ చరిత్ర జరుగుచున్న దానినిగా భావించి, సేనాధిపతుల
నందఱరావించి, మీరందరు చతురంగబల సమేతులై రామునకు బాస
టగా నరుగుడు. శ్రీరామచంద్రునిపై ఖరాదులు యుద్ధయాత్రకు
వచ్చుచున్నారు. నేనును యుద్ధసన్నద్ధుండనై వచ్చుచున్నాడనని
తెల్పి, ఉత్తమాజానేయము నొకదాని నధిరోహించి, భయంకర ఖడ్గము
నొంటు ధరించి బయలుదేరెను.

రామ చరిత్రము గతించిన గాథయని చెప్పినను, అంగీకరించు స్థితిలో లేడా రాజపుంగవుడు. దానికొక ఉపాయ మాలోచించి, బుద్ధి శాలురైన సేనానాయకులు రాజునకంటె ముందు కొంత దవ్వరిగిరి. అట్లు ముందరిగిన నాయకులొక లేఖను సృజించి, వెనుతిరిగివచ్చి యుద్ధ సన్నద్ధుడైవచ్చుచున్న ప్రభున కాలేఖ నొసంగిరి. శ్రీరామచంద్రుడు ఖరాసురాదుల పదునాల్గు వేలమంది రక్కసుల జయించి, విజయలక్ష్మీ విరాజమానుడై సీతాలక్ష్మణ సమేతుడై పర్ణశాలయందు సుఖమై యున్నాడని ఆలేఖాసారాంశము. ఆలేఖను ముత్పులకలతో పఠించి, మహానంద పరవశుడై సంతృప్తితో వెనుదిరిగి రాజధానీ నగరమును ప్రవేశించెను.

మరి యొకనాడు పౌరాణికుడు సీతాపహరణ ఘట్టమును చెప్పుచు.

"జగ్రాహరావణః సీతాం బుధః ఖేరోహిణీమివ
వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణసః"

అను శ్లోకమును చదివి దాని అర్థము నిట్లుచెప్పెను. "మహాదుష్టుండగు రావణాసురుడు జగన్మాతయగు సీతాదేవిని గగనమునందు రోహిణీ సతిని బుధుడు గ్రహించినట్లుగా, గ్రహించి, ఆకాశమార్గమున తన లంకకు తీసికొనిపోయెను"

ఆ మాటలాలకించిన కులశేఖరుడాగ్రహోదగ్రుడయ్యెను. కటము లదిరెను. కన్నులు నిప్పులుమిసెను. అధరము కంపించెను. భ్రుకుటి ముడివడెను. శరీరాంగములన్నియు కదలెను. ముచ్చెమటలు పోసెను. "నేనుండగా రావణుడు మాతల్లిని తీసికొని పోవుచున్నాడా? చూడుడు వానినిప్పుడే చీల్చిచెండాడి జగన్మాతను తెచ్చెద" నని ఖడ్గ ధారియై తురగము నధిరోహించి, సర్వసైన్యమును తన్ననుసరింపుమని ఆజ్ఞాపించి, కడలిని సమీపించి, సముద్రమున ప్రవేశించి దక్షిణ దిక్కుగా పోవుచుండెను. గుఱ్ఱములలతాకిడి కీదలేక పడిపోయెను. రాజు నీటి యల

లలోపడి తేలియాడుచుండెను. రాజాజ్ఞ మీరనలవికాదు కనుక కడ లిని ప్రవేశించిన సర్వసైన్యముల పనియునట్టులే యుండెను. ముందు పోయి జవాబు తెచ్చుటకు వీలుకాదు కావున, నేమి చేయుటకును తోచక మంత్రులు కలగుండువడుచుండిరి.

ఆ సమయమున మహాభక్తుడైన కులశేఖరుని రక్షించుటకు సర్వే శ్వరుడు రామరూపమున సీతాలక్ష్మణ సహితుడై రాజున కెదురుగా వచ్చి "వత్సా! నేను రావణుని సంహరించి సీతను కొనివచ్చు చున్నాను. నీవు శ్రమపడవలదు." అని ఆనతిచ్చి అంతర్హితుండయ్యెను. సంతోషభరితాంతరంగుడై కులశేఖరుడు సమస్త సైన్యములతో మరలి రాజధానికి వచ్చెను.

కొంతకాలము కడచినది. ఒకనాడు కులశేఖరులు మంత్రుల పిలిపించి "మంత్రులారా! నేను శ్రీరంగనాథుని వైభవమును దర్శింప దలంచితిని. రేపే ప్రయాణము. మనపట్టణములో నెవ్వరైన రంగనాథుని దర్శింప నపేక్షించినచో రావచ్చునని చాటింపు వేయింపుడు" అని ఆన తిచ్చెను.

ఆమాటలకు మంత్రులు తమలో తామిట్లు చింతించిరి. "మన ప్రభువు శ్రీరంగమునకు పోయినచో మరలి రాజ్యమునకు రాడు. రాజ్యమంతయు నరాజక మగును. చాటింపు వేయింపక యూరకున్నచో కోపగించును కానిండు" అని చాటింపు వేయించిరి. తరువాత వారు నేసికొనిన పదకము ప్రకారము, మరునాడుదయముననే, నొక వైష్ణ వుని రాజసన్నిధికిం గొంపోయి "ప్రభూ! వీరు మహాభాగవతులు భాష్యభగవద్విషయముల సేవించిన వారు. మన పూర్వపుణ్యవశమున నిట్టీదినమిచ్చటి కరుదెంచినారు అని విన్నవించిరి.

కులశేఖరుడా వైష్ణవునితో కొన్ని దినములు గడపి, మరల నొక దినమున రంగయాత్రయని వచించుచుండెను. ఆమరుదినము

మంత్రులు మరొక వైష్ణవుని సమ్ముఖమునకు గొనివచ్చి పూర్వము వలెనే వచించిరి. ఇట్లు రాజు రంగయాత్ర యనినపుడెల్ల నొక క్రొత్త వైష్ణవుని తోడ్కొని వచ్చుచుండిరి.

ఇట్లు కొంతకాలము గడచినది. మంత్రులు మరల సమావేశమై "మన మొనర్చిన కార్యముతోడనే మన ప్రభుండు మందమతి యగుచున్నాడు. నిరంతరభాగవత సాంగత్యముచే లోక విషయములందాదరము లేని వాడగుచున్నవాడు. ఈతని నెట్లైన భాగవత సహవాసము నుండి విడివడ జేయవలె" నని యోజించిరి.

కులశేఖరుల నిత్యార్చనయందు స్వామి విగ్రహ మొండు కలదు. ఆ విగ్రహము మెడలో గొప్ప విలువైన రత్నాలహారము కలదు. మంత్రులాహారమును దాచి, రాజును సమీపించి "రాజశేఖరా! మన నిత్యార్చనస్వామి కంఠము నందలి రత్నమాల నెవరో దొంగిలించిరి. మన గృహమునం దితరులు ప్రవేశించుట కవకాశములేదు. నిరంతరమును, శూల పాణులైన భయంకర భటులు మన గృహమునకు నిత్యమును కావలి కాయుచున్నారు. ఎవ్వరికినీ దొంగిలించుటకు సాధ్యముకాదు. మీరిచ్చిన చనవుచే వైష్ణవులు నిరంతరము స్వామి సన్నిధికి పోవుచు వచ్చుచుందురు. ఈ పని వారే చేసియుందురని మేము తలంచుచుంటిమి. మీకు విన్నవించితిమి. ఇక దేవరవారు చిత్తానుసార మవధరింపుడు" అని మనవి చేసిరి.

ప్రభువు విస్మయ మందెను. వెంటనే సభ చేయించి, సమస్త మంత్రి బాంధవ సామంతుల రావించి, ఒక భీకరకృష్ణ సర్పమును తెప్పించి సభాసదులతో నిట్లుపలికెను. "అయ్యలారా! మామంత్రులు వైష్ణవులపై నొక నేరమారోపించిరి. మాస్వామి మెడలోని మణిదామములు వైష్ణవు లపహరించిరట. ఆవైష్ణవుల పక్షమున నేను ప్రమాణము చేయుచున్నాను. వైష్ణవులు దొంగలుకారు. ఇదిగో

సర్పము నోటిలో వ్రేలుదూర్చుచుంటిని.” అని కృష్ణసర్పము నోటిలో చేయిదూర్చి ప్రమాణ మొనర్చెను.

ఆ తదుపరి వారల నందఱిని చూచి “నిత్యసంసార గంధులు, పాములునైన మీకును, భగవద్భక్తుల మగు మాకును, ఇక సంబంధము కుదురదు. మా కుమారునకు రాజ్యాభిషేకము చేయుచుంటిమి” అని నిర్ణయించి, కుమారునకు రాజాభిషేక మొనర్చి, రాజ్యమంతయు నాతని వశమొనరించి, సర్వసంగ పరిత్యాగియై శ్రీరంగమునకుపోయెను. అట్లుచేరి కావేరీ నదీనీరము నందవగాహన మొనర్చి ద్వాదశోర్ధ్వ పుండ్రములు ధరించి, ప్రణవ విమాన మధ్యము నందున్న రంగధాముని సేవించి, కొంతకాల మచ్చట గడిపి, నిత్యధామము నలంకరించెను.

ఓం శాంతిః ఓం శాంతిః తచ్ఛాంతిః

—: ౦ :—

## పెరియాళ్వారుల వైభవము

“మిథునేస్వాతిజం విష్ణోరథాంశం ధన్వినః పురే
ప్రపద్యేశ్వశురం విష్ణోఃవిష్ణుచిత్తం పురశ్శిఖమ్”

దివ్య ప్రాసాద భాసురంబై, పుణ్యపురుషావాస యోగ్యంబై బుధజనాలంకృతంబై, దివ్యసీమంతినీ విరాజితంబై సకల సంపద్భోగ భాగ్య విలాస విస్తృతంబై, భక్తిభావ పరిమిళితంబై, దక్షిణదేశంబున ధన్విపురంబను పట్టణంబొండు భాసిల్లుచుండు. అందు పురశ్చూడ మహా బ్రాహ్మణ వంశంబున, యజుశ్శాఖయందు, ముకుంద భట్టరను మహా భాగవతోత్తముండు నివసించియుండు. మహాసాధ్వీమ తల్లికయగు పద్మావతి యను సీమంతిని భార్యగా సుఖగృహస్థాశ్రమమును నిర్వహించుచుండెను.

ఆ పుణ్యదంపతులకు గరుడుని అంశంబున నొక కుమారు
ండుదయించెను. ఆ పిల్లవానికి "విష్ణుచిత్తు" లని నామకరణంబు చేసిరి.
ఆ శిశువు దినదిన ప్రవర్థమాన దేహుండై, ప్రహ్లాదసూరివలె ఆజన్మ వైష్ణ
వుండై సర్వేశ్వరునియందు బద్ధచిత్తుండై సార్థక నామధేయుండై
యుండెను. ఆతనికి వయస్సుతోపాటు భక్తి మిక్కిలి విజృంభించు
చుండెను. ఈ సంసారబంధంబును వీడి భగవత్సన్నిధిని చేరు టెట్లని
ఆలోచించి, శ్రీమన్నారాయణునకు ప్రేమపాత్రమగు కైంకర్య
మేదియా యని ఆతడు నిరంతర మాలోచించుచుండెను.

క్షీరార్ణవనికేతనుండగు లక్ష్మీభర్త నాగపర్యంకమునువీడి,
మధురాపురమున దేవకీ వసుదేవులకు ఆత్మజుండై జన్మించి, గోకులము
నందు నందయశోదలచే వర్ధిష్ణుండై కంస సంహారార్థము మరల మధురా
నగరికేతెంచి, సుదాముని ధామమునకేగి, ఆతడు నిర్మించిన పుష్ప
మాలలు అలంకరించుకొని, ఆతనికి మహైశ్వర్యము నొసంగి, తద్వంశస్థు
లకు దీర్ఘాయురారోగ్యభాగ్యము లొసంగి బ్రోచిన విషయ మాయనకు
జ్ఞప్తికివచ్చెను. తానును కుసుమకైంకర్య నిరతుండై తరింపవచ్చునని
భావించెను. 'వడపెరుంగోయిలుడయా'నను హరికి సుమదామకైంకర్య
మొనర్ప నెంచి, తిరునందనవనంబువేసి, దానియందున్న అనేక విధము
లగు పుష్పములుదెచ్చి మాలలుగట్టి ప్రతిదినమును, వటపత్రశయాను
నకు సమర్పించుచుండెను. వనమును తీర్చిదిద్దుట, అభివృద్ధిపరచుట,
నీరుకట్టి దానిని పోషించుట, పుష్పములుకోసి మాలలుగ్రుచ్చి స్వామికి
కైంకర్యముచేయుట యను కార్యములు తప్ప నితరలోక వ్యవహారంబు
లెఱుంగక తదాయత్తచిత్తుండై నిత్యకైంకర్య మొనర్చుచుండెను.

ఆతడు నివసించు దేశమునకు రాజధాని మధుర. అందుండి
ఆదేశమును వల్లభరాయలను రాజు పరిపాలించుచుండెను. అతం
డొకదినమున రాత్రియందు తన పాలనమునుగూర్చి ప్రజలెట్లు భావించు
చున్నారో యెఱుంగుటకై మారువేషమున పట్టణమునందు సంచరించు

చుండెను. ఒక సత్రము పట్టణమధ్యమందుగలదు. ఆరేయి చాలమంది యాత్రికులందు గుమిగూడి యుండిరి. అందొక పండితుండు వేదాంతో పన్యాసము నొసంగుచుండ, మిగిలిన ప్రజ లాసక్తితో వినుచుండిరి. రాజాసత్రమును సమీపించుసరికి ఆ ఉపన్యాసకుం డీ క్రింది శ్లోకమును పఠించి, అర్థమును వివరించుచుండెను.

"వర్షార్థమష్టౌప్రయతేతమాసాన్। నిశార్థమర్థందివసేయతేత
వార్థక్యహేతోర్వయసానవేన। పరత్రహేతోరిహజన్మనాచ॥"

మానవుడు వర్షాకాలమునకు కావలసిన ధాన్యము- కాష్ఠములు- మొదలైన సాధనసామగ్రిని, మిగిలిన ఎనిమిది మాసముల యందు సంపాదించుకొనవలయును. రాత్రి సమయమునకు కావలసిన దీపాదులను పగటిపూట సాధించుకొనవలెను. ముసలితనమునకు కావలసిన ధనాదులను వయస్సునందే సముపార్జింపవలయును. అట్లే పరలోకమునకు కావలసిన పుణ్యము నీ జన్మమునందే ఆర్జించవలయును. అట్లు చేయని వాడు "ప్రాప్యేమాం కర్మభూమిం నభజతి మనుజోయ స్తపోమంద భాగ్యః" పుణ్యభూమియగు భారత దేశమునం దుద్భవించియు పుణ్యము నార్జింపక, భగవద్భజన మొనర్పక యూరకచచ్చి వ్యర్థుడగును. వాడు పరలోకమున తీరని దుఃఖముల ననుభవించును.

నృపాలున కావాక్యములు విన్పించెను. ఆతనికి మనస్సున ననేకోహాలు ప్రబలెను. "ఈతడు వచింపుచున్నవి సత్యబద్ధవాక్యములు. వయస్సున సంపాదింపకపోయినచో వృద్ధునెవ్వరును గణింపరు. అట్లే పరలోకమునకు కావలసినది, యిహలోకమున సంపాదింపవలయు ననుటయు నిక్కవమే. ఇంతదనుక నేను రాజభోగాసక్తుండనై, విషయ సుఖలోలుండనై రాజ్యమును పాలించితినేగాని, పరలోక ప్రయత్న మేదియు చేయనైతిని. ఎంతకాలము వ్యర్థమయ్యెను!" అని నిర్వేదించెను

వెంటనే నృపాలుడు ఉపన్యాసకుని సమీపించి "ఓ తత్త్వదర్శీ! నీవిపుడు వక్కాణించిన వాక్యములు సత్యయుక్తములు. శాస్త్ర సమ్మతములు. శిష్యగ్రాహ్యములు. మానవుడు పరలోకప్రాప్తికై ఏమి ప్రయత్నము చేయవలయునో ఉపదేశింపుడు" అని వేడుకొనెను. ఆ వాక్యములకలరి, ఆ పాంథుడు "మహాత్మా! నాకేమియు తెలియదు. నేనింతదాక చెప్పిన వాక్యములు పెద్దలు సాయింపగా వినియున్నాడను. అవియే యిపుడు వీరికి చెప్పుచుంటిని. అదియు కాలక్షేపమునకు మాత్రమే. మీరు తెలిసికొనవలయునన్న లోకమున జ్ఞానవృద్ధు లెందరో గలరు. వారిని దర్శించినచో మీ సమస్త సందేహములును తీర్చి వారు మీకు జ్ఞానమార్గమును చూపింతురు." అని వినయమున విన్నవించెను.

నరపాలుడు గృహమ్మునకు మరలివచ్చి ఎట్లో ఆ రేయిగడిపెను. మరునాడుదయమున తన పురోహితుని బిలిపించి గతరాత్రమున జరిగిన విషయమంతయు వినిపించి, ఆతనితో "విప్రోత్తమా! నేను చెప్పిన విషయ మామూలాగ్రము వింటివికదా! పరలోకలబ్ధికై ఎట్టి ప్రయత్న మాచరింపవలె? అసలీజగత్తున కధీశ్వరుండెవ్వరు? ఆతని నెట్లారాధింప వలయు? దానికి మార్గములేవి?" అని ప్రశ్నించెను.

ఆ మాటలకు పురోహితుడు "రాజసత్తమా! ఈలోకము బహుమతములకు నిలయము. ఎవరికివారు తమ మతమే గొప్పదనియు, తన్మతము నవలంబించి తరింపవచ్చుననియు, సోదాహరణముగా వివరింతురు. అక్షపాదుడు పదియారు పదార్థముల వివేచనచేతనే మానవుడు తరింపవచ్చుననెను. కణాదుడు దానికి కించిద్భేధముగా వచించెను. కపిలుడు ప్రకృతియందు వికృతిజెందుచున్న జీవుడు, దీని కతీతుడగుటయే మోక్షమని పలికెను. పతంజలియోగము మోక్షమునకు మార్గమనియె. జైమినిశ్రుతి విహితమైన కర్మచేతనే జీవుడు సిద్ధి నొందగలడని నిర్ణయించెను. బాదరి మొదలగువారు జ్ఞానకర్మ సిద్ధాంతముల రెండింటి

నంగీకరించిరి. అద్వైతులు జ్ఞానమే పరబ్రహ్మైక్యసాధనమనిరి. విశిష్టాద్వైతులు ప్రపత్తియే ముఖ్యమనిరి. ద్వైతులు భక్తినే నొక్కి-వక్కణించిరి. ఇంకను, శైవ, శాక్తేయ, గాణాపత, సౌర, బార్హాస్పత్య కాపాలిక, బౌద్ధ, జైనాది మతము లనేకములున్నవి. వీరి నందఱను ఆహ్వానముఖముగా పిలిపింతము. వారిచ్చటికివచ్చి, తమ మతము నెవరు స్థిరీకరింపగలరో, వారిమతమును నీ వవలంబింప వచ్చును.'' అని వచించెను.

ఆ పలుకులకు నృపాలుడు సంతసించి, పత్రికలు వ్రాయించి, పలు దేశములందున్న ఆ యా మతవిద్వాంసులకు పంపించెను. తమతమ మతముల నిర్ధరించుట కొఱకు ఎత్తైన వేదిక నమరించెను. దానియందొక స్తంభమును నాటించి, దాని పైభాగమున పదివేల వరహాలమూటను కట్టించెను. ఎవ్వడివేదిక నధిరోహించి, సమస్త మతముల నోడించి, తన మతమును నిర్ధారించునో, అట్టివాని కీ ధనము నొసంగి శిష్యుండ నయ్యెద నని ప్రకటించెను.

ఆ వార్తలువిని సకల మతంబులవారు, తమతమ, శిష్యప్రశిష్య గణంబులతో అడియాలంబు బిరుదంబులతో దక్షిణ మధురకు రా దొడంగిరి. అట్టి సమయమున శ్రీవిల్లి పుత్తూరునందు విష్ణుచిత్తులు తన గృహమున నిద్రించుచుండెను. ఆయన స్వప్నంబున నీలమేఘ శ్యామసుందర సుశరీరుండును, హారకిరీటాది దివ్యభూషణ భూషితుండును, కౌస్తుభాలంకారుండును, పీతాంబరధరుండును, లక్ష్మీవిరాజమానవక్షస్థలుండును నగు సర్వేశ్వరుండు గోచరించెను. ఆతనిని పరివేష్టించి, విధిశివేంద్రాది దేవతలు, అంజలి బంధంబుతో సేవించుచుండిరి. అపుడా విష్ణుచిత్తుండు సర్వేశ్వరుని పదాంబుజంబులకు ప్రణమిల్లి లేచి, చేతులు జోడించి, యిట్లనియె. ''దేవాదిదేవా! ఏమీ నీ యీ అవ్యాజకరుణ. దాసునితో నేమిపనికలదు? ఏమిఆజ్ఞ ? ఏల యిట్లవధరించితిరి ?

అపుడు రమారమణుడు "విష్ణుచిత్తా! దక్షిణ మధురయందు వల్లభరాయ నృపాలుడు వేదాంతసభ నొకదాని నేర్పాటుచేసి యున్నాడు. సమస్త మతాధిపతులును వెడలుచున్నారు. నీవిప్పు డచ్చటకుపోయి, వివిధమత విద్వాంసుల నందఱి నోడించి, మత్పరాత్ప రత్వమును స్థాపించిరమ్ము" అని ఆజ్ఞాపించెను. ఆ మాటలకు విష్ణు చిత్తుడు చిరునవ్వునవ్వి స్వామితో "జగత్ప్రభూ! మీరు నాతో నిట్లానతిచ్చుటతగునా? నేను నిరక్షరకుక్షిని. నీదివ్య భవనమును శుభ్ర మొనరించుటయో, ఒక బిందెతీర్థమును తెచ్చుటయో, వింజామరలు వీచుటయో, నీ శృంగారపల్యంకిక వహించుటయో, గరుడధ్వజమును పూనుటయో తగునుగాని, వేదాంతసభకు పొమ్మనుట పాడియా? మీరు తప్పదుపొమ్ము; అని ఆజ్ఞాపించి రేని గడ్డపారతో మీసుమదామ కైంకర్యమునకై పూలతోట త్రవ్వుటచే నాచేతులు కాయలుగాచినవి. వానిని వారికి చూపించెదను. అంతకన్న నేనేమి చేయగలను? అట్లు చేతులు చూపుచున్న నన్నుంగాంచి సభలోని విద్వాంసులందఱును గొల్లున నవ్వుదురు. దానిచే నా కవమానము కలుగును. ఆ పరాభవ దైన్యము నీ గృహదాసుడనైన నాకు కల్గినచో, దేవరవారికి కాదా? నీ లీలాప్రదర్శనమున కెందరు పండితులులేరు? అక్షర శూన్యుండ నగు నాతో నీ కీ పంతమేల?" అని పలికెను.

అందులకు శ్రియఃపతి "నేను నిన్ను పొమ్మని ఆదేశించుచుండ నీ యీ వాదమేల? నీ వీ ప్రభాతమున నాయాజ్ఞానుసారము మధురకు పొమ్ము" అని గట్టిగా శాసించి అంతర్హితుండయ్యెను.

విష్ణుచిత్తుడు మేల్కాంచెను. స్వప్నగత భగవచ్ఛాసనమును స్మరించెను. ఆనందాశ్రు పులకాంకిత దేహుడయ్యెను. "ఏమీ భగవ దాజ్ఞ! నే నెన్ని చెప్పినను వినక అచ్చటి కేగుమని నిర్దేశించి మాయ మయ్యెను. కానిమ్ము అట్లే పోయెద" నని తలంచి, కల్యంబుననే లేచి, కాలకృత్యంబులు తీర్చుకొని మధురకు పయనమై పోయెను.

ఆ సభాప్రదేశమున, సముచితస్థలమున నొక ఉన్నత వేదిక వేయుబడియుండెను. అనేక మతస్థు లావేదికపైకి వేంచేసి, తమ తమ మతసిద్ధాంతముల నుపన్యసించుచుండిరి. ఒకరు వేదికనుండి దిగగనే మరియొక రావేదిక నారోహించి మొదటివారి మత సిద్ధాంతముల పూర్వపక్ష మొనరించి, తమ మతమును నిర్ధరించుచుండిరి. ఇట్లు పూర్వపక్ష సిద్ధాంతములతో నాసభ మారుమ్రోగుచుండెను. ఆసమయమున విష్ణుచిత్తుడు తన మత సిద్ధాంతమును స్థిరీకరించుటకై వేదిననధిరోహించుచుండెను. విష్ణుచిత్తు నెఱింగినవారు కొందరా సభయందుండిరి. వారు విష్ణుచిత్తుంజూచి, "ఏమీ! యీతడు విద్యావిహీనుడు. వేదిక నేల ఎక్కుచున్నాడు? ఈవేది ఏకార్యముకొఱకై నిర్మింపబడినదో యీత డెఱుంగకపోవచ్చును. దీనిపై కెక్కి సభాసదుల నందఱచూడ వాంఛించుచున్నాడుగాబోలు" నని తలంచి, "ఓయీ! విష్ణుచిత్తులూ! యిటురమ్ము. ఆవేదిక వేదాంతోపన్యాసార్థము నియమింపబడినది. దానితో నీకేమి ప్రయోజనము? రమ్ము" అని పిలువజొచ్చిరి.

ఆతడా మాటలనాలించు స్థితిలోలేడు. ఏకాఎకి వేదిక నలంకరించి, ఆసన మధ్యంబున కూర్చుండెను. విష్ణుచిత్తున కంతవఱకే స్పృహయున్నది. ఆపై నేమి జరుగుచున్నదియు నాతనికి తెలియుట లేదు. జగదీశ్వరుడగు నారాయణుం డాతనియం దావేశించెను. విష్ణుచిత్తుని నోటినుండి వేదాంతప్రసంగము, ప్రవహింపసాగెను. శ్రుతిస్మృతేతిహాసపురాణాదులన్నియు ఆతనివాక్కుల నర్తింపజొచ్చెను.

"గురుముఖ మనధీత్యప్రాహ వేదానశేషాన్ ।
నరపతి పరిక్లప్తం శుల్కమాదాతుకామః ।
శ్వశురమమరవంద్యం రంగనాథస్యసాక్షాత్ ।
ద్విజకులతిలకంతం విష్ణుచిత్తం నమామి ॥"

గురువునొద్ద చదువకయే సమస్త వేదములు, రాజుచే నియమింపబడిన ధనమును గ్రహించుటకై వచించినవాడును, రంగేశ్వరునకు సాక్షాత్తు

మాయయు, బ్రాహ్మణ వంశశ్రేష్ఠుడును నైన విష్ణుచిత్తునకు నమస్కార మనుచున్నది తనియ.

ఆవిధముగా ప్రబలతర్కమునంతయు నుపన్యసించుచు యుక్తి యుక్తులచే సమస్త మత సిద్ధాంతములను ఖండించెను. విష్ణుచిత్తుని యెదుట వాయెత్తుటకు సభలో నొకనికిని సమర్థతలేకుండెను. విష్ణుచిత్తుడు సర్వమతధ్వంసం బొనరించి, తనమత మీరీతి స్థిరీకరించెను. "ఎవడీ ప్రళయోదధిమగ్నమైన భూమిని యజ్ఞవరాహరూపమున నెత్తి నిలువబెట్టి నాభీకమలమున చతుర్ముఖ బ్రహ్మనుత్పాదించి, బ్రహ్మ ద్వారా ఈజగత్తు నంతయును సృజింపజేసెనో, అట్టి నారాయణునకన్న మిన్నయగు సర్వేశ్వరుండు వేరొక్కడులేడు. ఆతనిని పొందుటకు ప్రపత్తికిమించిన యుపాయములేదు. ఆదేవు నారాధించుటకు అష్టాక్షరీ మంత్రమునకంటె పరమమంత్రములేదు." అని ధ్రువీకరించెను. ఆసమయమున దైవసంకల్పముచే ధ్వజదండమునకు కట్టబడియున్న ధనపుమూట తనంతటతాను తెగి విష్ణుచిత్తుని ముందుపడెను.

అదిచూచి నరేంద్రుడులేచి, నడుమున నుత్తరీయమును బిగించుకొని, విష్ణుచిత్తుని పాదారవిందములపై బడి, నమస్కరించి "స్వామీ! దైవం మానుషరూపేణ" అని చెప్పినట్లు మమ్ము తరింపజేయుటకై రంగేశ్వరుడే అనుగ్రహముతో మీరూపమున వచ్చినట్లు తలంచుచుంటిమి. మీకు శిష్యుడనయ్యెద స్వీకరింపుడు" అని పలికి, పట్టపు టేనుగును రప్పించి, దానిపై విష్ణుచిత్తుల నారోహింపజేసి, గ్రామోత్సవము చేయించెను. కొందరీర్ష్యాళువు లిదియంతయుజూచి. "ఈ రాజు వేదాంతసభ యని చాటింపించి, మహాపండితుల నందరి నాహ్వానించి, వారలందర నవమానించి, అంతమున అక్షరజ్ఞానశూన్యుడైన యీవిష్ణుచిత్తునకు సర్వస్వమును కట్టపెట్టినాడు. దీని కెవరు సంతోషించిరి. ఈ వైష్ణవుని సన్మానింప నిచ్ఛయున్నచో ఈ పండిత ప్రకాండుల నెవ్వరిని పిలిపించక, యీతనినే పూజించి యుండవచ్చును." అని ప్రల్లదములాడుచుండిరి.

ఆ సమయమున వారి నోరులు నొక్కవడ, కుమారుని ఘనత కానందమ్మునందు తండ్రివలె జగదీశ్వరుండు అనంతగరుడ విష్వక్సేనాది నిత్యసూరులతో, శ్రీభూనీళాది దివ్యమహిషులతో, కోటిసూర్య ప్రభా భాసమానుడై గగనమున అందరకు నొక్కసారి సాక్షాత్కరించెను. జనులందఱును, అనంత జన్మసంఘటిత పాపనిచయంబంతయు భస్మం బగునట్లు, సర్వేశ్వరుని దర్శించి, ఆనందముతో వేదవాక్యముల స్తుతించు చుండిరి. విష్ణుచిత్తులు రమానాథునింజూచి, "ప్రభూ! ఈలోకమున నందరును మహాపాపులు. స్త్రీ, గో, శిశుహత్యలు కావించిన వార లెందరో యున్నారు. అట్టివారికి నీవు గోచరించితివి. నరుని కంటిముంకు నల్లరాళ్లు బ్రద్దలగునని సామెత. కావున నీ దివ్యమంగళవిగ్రహంబున కేమి దృష్టిదోషము సంభవించునో" అని గజఘంటలు మ్రోగించుచు, సర్వేశ్వరు నాశీర్వదించుచు నూరు వత్సరములు, వేయినూరు వత్స రములు, అనేకకోటి సంవత్సరములు నీ దివ్యమంగళ విగ్రహంబునకు అపాయముకలుగకుండునుగాక. నిన్ను దీవించుటకై నేనుకూడ అట్లే యుండుదునుగాక" యని పల్లాండుపాడుచుండెను. అంతనా జగదధీశ్వ రుండు సపరివారుడై అదృశ్యుండయ్యెను. నానాదేశవాసులందఱు నెవరినివాసంబులకువారు వెడలిపోయిరి. వల్లభరాయలు విష్ణుచిత్తులకు శిష్యుడై గురుని అనేక విధంబుల పూజించెను. గురువు, మంత్ర మంత్రార్థాదిహితంబుల నుపదేశించి, శిష్యునిదీవించి, స్వపురంబునకు వచ్చి, తద్విశేషమంతయు వడ పెరుంగోయిలుడయానను హరికి నివే దించి, తన గృహంబున సుఖంబుండెను. పరబ్రహ్మమునకు మంగళా శాసనము చేసినకతమున నాయనకు 'పెరియాళ్వారు' అను పేరువచ్చెను.

ఇట్లుండ నా భాగవతోత్తముం డొకనాడు ఖనిత్రపాణియై తోట యందు త్రవ్వుచుండెను. ఆచెంతగల తులసీవనమున నొక పసిపాప ఆయనకు లభించెను. ఆపసిపాప లోకోత్తర తేజోవతియై యుండెను. పూర్వము మిథిలాధిపుడు భూకర్షణము చేయుచుండ నాగేటిచాలున

శిశువు లభింపగా, సీతయను నామకరణ మొనర్చి ఆకన్నియను పెంచిన విధంబుగా, విష్ణుచిత్తుండును మిక్కిలి ఆనందపడి, యింటికి తీసికొని పోయి తనభార్య కొసంగెను. ఆమెయు నపరిమితానందమునంది, ఆమె నల్లారు ముద్దుగా పెంచెను. ఆమెకు (శూడికొడుత) గోదాదేవియని నామకరణము చేసిరి. ఆమె దిన దిన ప్రవృద్ధమానయై, అయోనిజ కావున కొలది కాలముననే యుక్తవయస్కురాలయ్యెను. ఆమె అతి లోకోత్తర సౌందర్యమునుగాంచి, పిల్ల నెవ్వనికిచ్చి వివాహము చేయ వలయునాయని యోజించుచుండిరి.

ఇట్లుండ విష్ణుచిత్తులు సుమదామములు సిద్ధపరచి, పుటికల యందుంచి, తోట పనికిపోగా, గోదాదేవి ఆ మాలలన్నింటిని బయటకు తీసి, వానిని కొన్నింటిని మెడలో ధరించి, కొన్నింటిని తలకుచుట్టి, సమీపకూపవారియందు తన ప్రతిబింబమును చూచుకొని, ఏమియు నెఱుగనియట్లు, వానిని మరల గూడబుట్టలయందుంచుచుండెను. అది యెఱుంగని విష్ణుచిత్తులా దండలను స్వామికి సమర్పించుచుండెను. కాని మాలలు కొలదిగా నలుగుచుండెను. అది గమనించిన ఆలయార్చకులు మాలలు నలుగుటకు హేతువేమైయుండునాయని సునిశితముగ నాలోచింపసాగిరి. ఒకనాడు విష్ణుచిత్తుడు సమర్పించిన మాలలలో నొక పొడవైన వెంట్రుక చిక్కుకొనియుండెను. అది చూచి అర్చకులు విష్ణుచిత్తునితో "ఆర్యా! ప్రతి దినము తాము తెచ్చి స్వామికి సమర్పించుకొనుచున్న కుసుమమాలలు మిక్కిలి నలుగుచున్నవి. ఇట్లేల జరుగుచున్నదాయని పెద్దలైన మీకీ విషయమును తెలుపజాలక సందేహించుచుంటిమి. ఇదిగో యీ దినమున పూలమాలలలో వెండ్రుక యున్నది. చూడుడు ఇది ఎవరిదో చాల దీర్ఘముగనున్నది." అని వచించి చూపించిరి.

విష్ణుచిత్తుడచ్చెరువొందెను. అర్చకులచూచి "స్వాములారా! ఇయ్యది నా కుమార్తె వెంట్రుకయే కావచ్చును. తరువాత తెలియ

జేసెద" నని యింటికి తిరిగివచ్చి కుమార్తెంజూచి అమ్మా! నేను స్వామి కర్పించు పూల దండలనేమైన ధరించుచుంటివా? అట్లు చేయుట భగవదపచారము. నీవు ధరింపవలయునన్న మనయింట నెన్ని పుష్పములు లేవు!" అని సూటిగా ప్రశ్నించెను. అందులకు గోదాదేవి "నాయనా! నాకు తెలియదా! భగవదర్థము నిర్మించిన మాలలు నేనేల ధరింతును. స్వామికి మీరు సమర్పించుట నేను కనులార కాంచుటలేదా? తెలిసియు తప్పుచేయుదునా!" అని ప్రత్యుత్తరమిచ్చెను.

విష్ణుచిత్తునకు సందియము తీరలేదు. ఒకానొకనాడు పూసరులు గ్రుచ్చి గంపలకెత్తి తోటపనికి పోవుచున్నట్లుపోయి వెంటనే తిరిగివచ్చి యింటివెనుక యొకచో రహస్యముగ దాగియుండెను. అపుడా బాల తండ్రి యింటికడ లేడుగదాయనియెంచి, గంపలలోని పూదండలనెల్ల ధరించి, కూపవారిలో తన సౌందర్యమును చూచుకొనుచుండెను. ఆ సమయమున తండ్రి ముందునకు వచ్చి 'తల్లీ' నేనడిగినపుడబద్ధమును చెప్పితివి. ఇట్లు చేయుట తగునా? యని మందలించెను. కుమార్తెనంత కంటె మందలించుటకు నోరురాకయూరకుండి, ఆ మాలలనన్నింటిని పరిహరించెను. రెండవదినమున మాలలుకట్టి వటపత్రశాయికి తీసికొని పోయెను. అపుడర్చకులు "స్వామీ! నిన్నటి దినమున మాలలేలతేరైతిరి? అని ప్రశ్నింప విష్ణుచిత్తులు జరిగినదంతయు వారికి వివరించెను. ఆ మాటలకా అర్చకులు ఆశ్చర్యపడి యూరకుండిరి.

ఆ రాత్రి వటపత్రశాయి అర్చకుల స్వప్నములందును, విష్ణుచిత్తుని స్వప్నమునందును గోచరించి, 'నిన్నటి పూలమాలలు నాకు భోగ్యములుగాలేవు. విష్ణుచిత్తుని ఆత్మజ ధరించి విడిచిన పూలదండలే మాకతిభోగ్యములు ప్రతిదినము మాలలు తొలుత నామె అనుభవింపవలె తదుపరి మాత్రమే వానిని కొనిరండు నాకలంకరింపుడు' అని వచించి అంతర్హితుండయ్యెను. వారందరును అపరిమిత విస్మయాంభోధి మగ్నులైరి. ఈమె ధరించి విడచిన మాలలను సర్వేశ్వరుడు కోరు

చున్నాడనగా, నామె నీళయో నీరధికన్యయో భూదేవియో కావచ్చును. లేనిచో నీ పిల్ల విషయమున సర్వేశ్వరుడిట్లేల కోరును? అని చింతించి, అప్పటినుండి ఆమె ధరించి విడిచిన మాలలను స్వామికి నలంకరించుచుండిరి. అందువలన నామెకు 'శూడికొడుత' అను నామమేర్పడెను.

అదియంతయు గమనించి, తల్లిదండ్రులిట్టి దివ్యకన్యనే విధి మానవమాత్రునకిచ్చి వివాహము చేయదగునాయని విచారించుచుండ నా బాల తల్లిదండ్రులజూచి, "జననీ జనకులారా! నన్నిచ్చుటకుగాని, నన్ను పరిగ్రహించుటకుగాని మానవులలో సమర్థులు లేరు. మలమూత్రలాలా భాజనులగు మానవులను నేను ప్రాణిగ్రహణంబు చేయనొల్లను. నాకు తగిన వరుడు లక్ష్మీశ్వరుండే. ఆతనిని తప్ప మరియొకరిని నేను చెట్ట వట్టను" అని చెప్పెను.

ఆ మాటలకు విష్ణుచిత్తుడు తనయంజూచి 'అమ్మా! నీకు సర్వేశ్వరుండెట్లు వరుండగును? అతనినెట్లు వశీకరించుకొనగలవు? పూర్వము కృష్ణాది విభవావతార సమయములందు రాధా, గోపికాది స్త్రీ జనమ్ములకు వశుండయ్యె ఇప్పుడు కేవలము అర్చారూపమున మాత్రమున్నాడు అదియు నూటఎనిమిది దివ్యదేశములయందు దర్శనమొసంగుచున్న వాడు. అట్టి వానిలో నేరూపముననున్నవానిని కోరెదవు?' అని అడిగి నూటయెనిమిది దివ్యదేశములయందున్న సర్వేశ్వరనామములను, గ్రామములను, వైభవములను వర్ణించి చెప్పెను. అవియన్నియు విని, రంగేశ్వరుని వైభవము మిక్కుటముగానున్నదని తలంచి, రంగనాథుని వరించెను. విష్ణుచిత్తుల కుమార్తె అభిప్రాయము నెఱింగి యామెతో 'తల్లీ' నీ కోరిక గొప్పదియే కాని సర్వజగదీశ్వరునల్లునిగానెట్లు బడయగలను?' అని బాధనందెను. అపుడు గోదాదేవి 'తండ్రీ నీవు బాధనందవలదు. రంగేశ్వరుని భర్తగా నేనే సాధించెద నీ కల్లుడతడేగాని అన్యుడు కాడు అని తండ్రిని సమ్మతింప జేసి, మార్గశిమాసమున సర్వేశ్వరునింగూర్చి దినమున కొక్కటి చొప్పున ముప్పది దినములు ముప్పది పాశురములు

పాడెను. ఆమె వ్రతమనుష్ఠించిన కాలమే ధనుర్మాసము ఇప్పటికిని ప్రతి వైష్ణవాలయమునందును, ఆ మాసమున దినమునకొక్క పాశురము చొప్పున పాడుచున్నారు. అదియే 'తిరుప్పావై' అనుపేర వైష్ణవులకు పరమపవిత్రమై యొప్పుచున్నది.

వ్రతాంతమయ్యెను. శ్రీరంగమునందు రంగనాథుడు దేవాలయాధికారికి స్వప్నమున సాక్షాత్కరించి 'ఓయీ! నీవు సమస్త సపరివారుడవై, సకలవాద్య బృందములతో శ్రీ విల్లిపుత్తూరునకుబోయి, విష్ణుచిత్తుని కుమార్తె గోదాదేవిని పల్లకిలో నెక్కించుకొని యిచ్చటకు తీసికొనిరమ్ము. నే నామెను వలచియున్నాడను. ఆమె భూదేవి. ఈ రూపమున విష్ణుచిత్తునకు కొమరితయై లభించెను.' అని ఆనతిచ్చెను. దేవాలయాధికారి నిద్రమేలుకని, 'అద్యమేసఫలంజన్మసుప్రభాతాచమేనిశా' అని భావించి, అర్చకపరిచారిక సర్వజనంబులకు చెప్పి సర్వవాద్యములతో సపరివారుడై శ్రీవిల్లిపుత్తూరునకు వచ్చెను.

ఆ వృత్తాంతమునంతయువిని విష్ణుచిత్తుం డమందానందమొంది స్వీయశిష్యుండగు వల్లభరాయనికి కబురుపెట్టెను. ఆతడు రథ గజ తురగపదాతి బలంబులగూడుకొని శ్రీవిల్లిపుత్తూనకు వచ్చి చేరెను. ఆ పురమందలి బ్రాహ్మణపురంధ్రులరుగుదెంచి, గోదాదేవిచే తిరుమంజనము చేయించి, దివ్య వస్త్రంబులు కట్టించి, దివ్యాభరణములామెకలంకరించి, ఆమెను రంగధాముని దివ్యాందోళికనెక్కించి, సన్నని మేలికౌశేయచేలమునుకప్పి, పెక్కురు ముత్తైదువులు వెంటరా పల్యంకికను వాహకులెత్తుకొని నడుచుచుండిరి. ఆందోళికకొక వైపున విష్ణుచిత్తులును మఱియొకప్రక్క వల్లభనృపాలుడును దానిని పట్టుకొని నడచుచుండిరి. వెనుక రథములు, గజములు, తురంగములు, పదాతిబలములును నడుచుచుండెను. దివ్యపటహకాహళ భేరీ మృదంగ వీణావేణు, శంఖాది వాద్యములు భూనభోమధ్య భాగమున నిండిపోయెను. ఈ విధమగు

వైభవము పరిఢవిల్ల శ్రీరంగమునకు బయలుదేరిన వారింగాంచుటకు జనులు తండోపతండములుగా వచ్చి సంతోషపడుచుండిరి. మార్గమధ్యమున ప్రతిగ్రామమందును, పల్యంకమునాపి, ఐదువరాండ్రు పూవులు-పసుపుకుంకుములు-వస్త్రములు తీసికొనివచ్చి గోదాదేవి కొసంగుచుండిరి వారందరును ఆమె సౌందర్యమున కక్కజంపడుచు, 'నీకన్య రంగేశునిం గూర్చి వ్రతం బొనరించి, ఆతని వరించుటకు రంగధామమున కేగుచున్నదట. ఏమి యీ భాగ్యము. ఐనను, ఈ రూపరేఖావిలాస విభ్రమ సౌందర్యములు మానవదుర్లభములు. శ్రీభూనీళలందెవ్వరో యీ రూపమున నవతరించియుండనోపు' నని, యనేకరీతులు కొనియాడుచు ఆమెను మనసార దీవించుచు, మిక్కిలి ఆనందముతో వెడలిపోవుచుండిరి.

ఈ విధముగా గోదాదేవి సమస్త వైభవముతో శ్రీరంగము సమీపించి, కావేరికి జోహారులొనరించి, భవ్యగోపురమున కంజలించి, సప్తప్రాకారవేష్టితంబగు రంగనాథుని దివ్య భవనంబునకు ప్రవేశించి గరుడునకు నమస్కరించి, అనేక మంటపంబులుదాటి, బలిపీఠమునొద్ద విమానమునవతరించి, ధ్వజదండంబునకు తలయొగ్గి తండ్రియు, వల్లభరాయలును వెంటరా, మెలమెల్ల రంగేశ్వరుని గర్భాలయంబున ప్రవేశించెను. దేవాలయద్వారమున కిరువైపుల నిలచియున్న జయవిజయులకు జోతలిడి లోపల ప్రవేశించెను. కుడిభుజము శిరస్సు క్రిందను పథానముగానుంచి, రెండుపాదములుచాచి; ఎడమచేయి ఎడమపాదము పయిచాచి పశ్చిమ శిరస్కుండై దక్షిణాభిముఖంబుగా విభీషణుని దేశమును కటాక్షించుచు ఫణాసహస్ర మండితుండగు భోగి భోగపర్యంకమున యుగపదుదిత సహస్ర సహస్రకర విరాజమానుండై హార, కేయూర, కిరీటశ్రీవత్సశ్రీవేయక కటిసూత్రదామోదరబంధన పీతాంబరాది దివ్యభూషణ భూషితుండై, చేతనుల ఆభిముఖ్యము నిరీక్షించుచు శయనించియున్న దేవాదిదేవుని రంగేశ్వరుని కన్నులకరవు దీర

వీక్షించి, పెన్నిధింగన్న పేదచందంబున, శీతాంశుని దర్శించిన పాల కడలి వడుపున ఆనందామృతాబ్ధినోలలాడుచు 'సర్వదివ్యమంగళశాలి విగ్రహాయ, సమస్త పరివారాయ శ్రీమతేనారాయణాయనమః' అని ఉచ్చరించుచు, నమస్కారపూర్వకంబుగా గోదాదేవి అనంతశయనంబా రోహించి, రంగవిభుని పాదసన్నిధికూర్చుండి పాదసంవాహనంబొన ర్చుచు, నొక్కసారి అదృశ్యమయ్యెను.

అంత విష్ణుచిత్తుండాత్మజంగానక బోగున దుఃఖించెను. అపుడు రంగేశ్వరుడు ఆవేశముఖమ్మున విష్ణుచిత్తునూరార్చి, 'దుగ్ధాబ్ధివలె నీవును మాకు మామవైతివి. నీ వెప్పుడు తలంచినసప్పుడు నీ కొమరితతోగూడ నేను గోచరింతును. నీ కుమార్తెతోగూడ అర్చారూపంబున శ్రీవిల్లి పుత్తూగునందు సన్నిహితంబైయుండెద కావున నీవు దుఃఖింపపనిలేదు' అని చెప్పి దివ్యవస్త్రంబులు, తీర్థశఠకోపప్రసాదాదులొసంగి భూషణ సత్కారమొనర్చి వీడుకొల్పెను. విష్ణుచిత్తుండును స్వకీయతనూజనేచిం తించుచు గృహంబున కరిగిరి. వల్లభరాయలు స్వీయపరివారముతో గురుని ఆనతిగొని రాజధానీనగరమ్ము మధురకరిగెను. ఈ విధముగా పెరియాళ్వారు కొంతకాలము గడిపి వైభవమును చాలించిరి.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

## తొండరడిప్పొడి యాళ్వార్ల వైభవము

శ్లో॥ కోదండేజ్యేష్ఠ నక్షత్రే ! మండంగుడిపురోద్భవమ్
చోళోర్వ్యాం వనమాలాంశం ? భక్తపద్రేణుమాశ్రయే.

చోళదేశమునందు మండంగుడియను పురంబొండుగలదు. అందు పురశ్చూడ బ్రాహ్మణకులంబునందు, వేదవేదాంగాది, దివ్య విద్యా శోభితుండను, వినయాదిసద్గుణ విరాజితుండును అచార సంపన్నుండగు వాడు జనించెను. ఆతనికి తల్లిదండ్రులు విప్రనారాయణుండని నామ కరణంబు గావించిరి. అతనికి పదునైదు సంవత్సరములు వచ్చినవి.

ఆతను సంసారమసారమనియు, దేహములు అనిత్యములనియు, ధనాదులు క్షణికమ్ములనియు భావించి, ఆజవంజవమును వాసనామూలకముగా త్యజించి అనేక దివ్యదేశములు సేవించుచు శ్రీరంగమును చేరెను.

ఆ పట్టణము మరుద్వృధాన దీపపరివృతంబై, సప్తప్రాకార శోభితంబై, అనేక ఘంటపాలంకృతంబై, విపణివీధికాగణ్యాంబై, చాతుర్వర్ణ విరాజిత వీధీ విశాలంబై, శుకపికకలరవ ప్రతిధ్వనితంబై, చూత కేతకీ పున్నాగ నారికేళాశోక కదంబకర్ణికారాద్యనేకోకహవాటికాచ్ఛాయానిలయంబై, ఉద్యానవనాంతర్విరాజమాన పద్మాకర విహార రాజహంస, మత్తమధుకర, సారసాద్యనేక జలపక్షీ లక్షితంబై యుండెను. ఆ సుందర పట్టణమును విలోకించి, విస్మయాధికుడై నగరంబును ప్రవేశించి వరుసగా ప్రాకార సప్తకంబును దాటెను. నిత్యసూరియగు గరుడునకు నమస్కరించెను. బలిపీఠము కడతల యొగ్గెను. ధ్వజదండంబునకు దండంబులర్పించెను. అంతరాలయము ప్రవేశించి గర్భాలయమున, ప్రణవ విమానమధ్యంబున, యుగపదుదిత రాకాని శాకర ప్రతిమాన భాసురుండై అనంతునియందు నీలమేఘశ్యాముండై శ్రీ భూనీళాది దివ్యమహిషీసమేతుడై, శంఖచక్ర శార్ఙ్గాదిదివ్యాయుధ ధరుండై, సర్వజననయనాభిరాముండై, సర్వ దేవతాలలాముండై కలికల్మషాంధకార నిర్వారణ భాస్కరాయమానుండై కరుణాధాముండై ప్రకాశించు రంగధాముని దర్శించి 'ఇందిరా సుందరా! నీకు మంగళమగుగాక, ఈ జగత్కుటుంబమునకు నీవు నియంతవు. ఉత్పత్తిస్థితి లయములకు నీవే కర్తవు. జగద్భర్తవు. ఒక్కొక్కతరి నీవీలోకములనెల్ల నాహరించి, ఉదరగోళమునునుంచి, రక్షించి, మరల వెడలగక్కుచుందువు. నీవు తక్క మరియొకండు హేతుభూతుండు లేడు. అందుచే నీకీ విశ్వమంతయు శేషభూతమైనది. ఈ జగద్రూపుండవు నీవే. ఐతదాత్మ్యమిదంసర్వం - తత్త్వమసి - అహంబ్రహ్మాస్మి-ఇత్యాది వాక్యములన్నియు నీ శేషిత్వమునే ప్రకటించుచున్నవి. కణచరచర

ణాతులు పరమాణువులీ జగత్తునకు కారణంబని అనంత కారణత్వమును కల్పించిరి. నీ వొక్కడవే జగత్తున కుపాదాన కారణమని చెప్పినచో నీ యనంత ప్రాగభావ ప్రధ్వంసా భావములన్నియు నశించిపోవును. గోచరించుచున్న నిన్ను వీడి వారు తర్క వాక్యములుపన్యసించి జగద్భిన్న మొనర్చిరి. సర్వాతిశాయివగు నీకు నమస్కారములు' అని స్తుతించి తీర్థప్రసాదములు స్వీకరించి దేవళము విడిచి బయటకు వచ్చెను.

ఆతడు శ్రీరంగనాథునకు నిత్యకైంకర్య మొనర్పనెంచి శ్రీరంగమునే స్థిర నివాసస్థలముగా నిర్ణయించుకొనెను. తదుపరి నాతడు ఏమి కైంకైర్యమును శ్రీ రంగేశునకు చేయనొప్పునాయని తన మనంబున విచారించుచు 'వెనుక సుదామాదులు సర్వేశ్వరునకు పుష్పకైంకర్య మొనర్చి తనర్చి తరించిరి. అట్లే నేనును రంగధామునకు సుమకైంకర్యమొనర్తుగాక' అని నిశ్చయించి కావేరీ మధ్యభాగమున గల లంకయందు పూలతోటను వేసెను, అందుచూతనింబదాడిమజంబు జంబీర నారికేళాది ఫలవృక్షములును, కాంచనాశోక కరవీరకదంబ మల్లికాపున్నాగ కేతక్యాది పుష్పవృక్షములును కలవు. అందలి జలాశయంబులు ఇందీవరకల్హార పుండరీకాది దివ్యపుష్పోపేతంబులై దివ్య గంధోపేత నీర నివాసంబులై యొప్పుచుండెను. వానియందు రాజహంస సారసాది జలవిహంగములు మనోహర విహారములు నెరపుచుండెను. చైత్రరథనందనోద్యానవనముల తిరస్కరించుచు నది చూపరులకు మిక్కిలి ఆనందమును కల్గించుచుండెను. అందొక చిన్న పర్ణశాలను నిర్మించుకొని, అందు నివసించుచు, విప్రనారాయణుడు నిత్యము బహు జాగరూకతతో తద్వనమును పోషించుచు, తత్ఫల పుష్పములు రంగ భర్త కర్పించుచు, నివారితాన్యవ్యాసంగుడై సర్వేశ్వరన్యస్తభరుండై యుండెను.

ఇట్లు కొంతకాలము గడచెను. ఒకానొక దినమున నిచుళాపుర నివాసినియు, దేవాంశసంభూతయునగు దేవదేవియను వేశ్య తన అగ్ర

జయగు మధురవాణితోఁగూడి చోళరాజు సభ కేగెను. ఆసభలోనామె తన హావభావ విలాసములన్నింటిని ప్రదర్శించెను. రాజు మెచ్చి అనేక విధములగు కానుకలను బహూకరించెను. వానిని గ్రహించి తన గ్రామమునకు మరలిపోవుచు మార్గమధ్యమున విప్రనారాయణుని వనమును సందర్శించెను. వేసవి విజృంభించియుండుటచే, మార్గశ్రమాపనార్థము ఆమె సోదరితోఁగూడ నావనములోనికి ప్రవేశించెను. ఆ వనమునందలి సుమకుంజపుంజంబుల కొంతతడవు విశ్రమించి, దాని రామణీయకమున కచ్చెరువందుచు, వనమునందందందు విహరించుచుండెను. అపుడు ధౌతవస్త్రధారియై, పాణికీలితఖనిత్రుడై, దీర్ఘశ్మశ్రులాంఛిత ముఖుండై, బద్ధదీర్ఘ శిరోజుండై, నిబిడసిత రోమ దేహుండై, ద్వాదశోర్ధ్వపుండ్ర ధారుండై, తులసీపద్మాక్షమాలికా భూషితవక్షస్థలుండై తోటపని చేయుచున్న విప్రనారాయణుడు దృగ్గోచరుండయ్యెను. ఈతడెవరో మహాభాగుండని భావించి, దేవదేవి విప్రనారాయణుని చెంతకరిగి చేతులెత్తి నమస్కరించెను. కాని విప్రనారాయణుడు కనీసము కన్నెత్తి ఆమె మోమును తిలకింపక, వృక్షపోషణ కార్యనిమగ్నుండై, ఉపేక్షామాత్రుడై యుండెను.

అంత నా దేవదేవి తన అక్కనుజూచి 'అక్కా! ఈతడు భ్రాంతుడా? లేక షండుడా? నేను నమస్కరించినను, మోమెత్తక తన పనిజూచుకొనుచున్నాడు. నా ముఖ సౌందర్యము నీక్షించిన మగవాడు ముందునకడుగిడజాలడు. నా సౌందర్యమగ్న మానసుడైనవాడు నా యింటివాకిట నిరంతరము వేచియుండును కాని అన్య కార్యనిర్వాహకుడు కాజాలడు. కాని ఈతడు నా సొగసుందనమును తృణీకరించినాడు' అని పలికెను.

ఆమాటలాలకించి, ఆమె సోదరి "చెల్లీ! నివిట్లు పలుకదగునా? ఈతడు మహావిరాగి. ప్రపంచ, విషయభోగముల తిరస్కరించినవాడు.

శ్రీరంగేశ్వర కైంకర్యనిరతుడు. ఈతని సర్వేంద్రియములు సర్వేశ్వరాధీనములు. అట్టివానిని నీవు వెంగలియనియు, యూబయనియు పలుక వచ్చునా? నారాయణ పదపంక జన్యస్తభరులగు మహాపురుషులకు కాంతాకనకములు రెండును లోష్టప్రాయములు." అని పలికెను.

అందులకు నవ్వి దేవదేవి మధురవాణితో "అక్కా! విను ఈతడు మహాపూరుషుడే కావచ్చును. ఇంతకన్న గొప్పవారు లోలాక్షుల కనుసైగలకు దాసులై వారి యిండ్ల బందీలుగ పడియుండలేదా? స్త్రీలోలురు కానివారు జగత్తునందుగా? జీర్ణపర్ణాశనులై, యినుప కచ్చడాలుగట్టుకొన్నముని పుంగవులేమైరి? విశ్వామిత్రుడు మేనకంగూడి అనేక వర్షంబులు సంచరించి, తపశ్శక్తిని సర్వమును కోలుపోయెను. పరాశరుడు దాశకన్యా సంగమ సుఖలీలకు అఱ్ఱులు సాచెను. మాందకర్ణి వేశ్యలగూడి జలాశయాంతర్భాగమున గృహానిర్మాణమొనర్చి వారితో నిరంతర సుఖకేళీ తేలియాడె. మహాభారత, భాగవత, సమస్త పురాణకర్త వ్యాసుడప్సరసల పొందుబడసెను. అట్టి మహర్షులకైన, నీతడు వారికంటె ఘనుడా?" అని వివరించెను.

అప్పుడగ్రజ "భగినీ నీవు చెప్పినవారందఱును అట్లైన మాట సత్యమే. అయినను నీతడట్టివాడు కాడు. విరాగ్యగ్రేసరుండుసుమా!' అని వచించెను. అందులకు దేవదేవి ఉక్రోషమును పట్టజాలక 'అక్కా! నీవీతని తరఫున నింతగట్టిగా వాదించుచుంటివి. నేనీతని నారు మాసములలో స్మరశరవిద్ధమానసుని జేసి, నా కొంగున ముడివైచుకొని, సమస్త జనులు చూచుచుండ, రాజవీధుల వెంబడి మన గృహంబునకు తీసుకొని వచ్చెద, విటశ్రేష్ఠుని చేసెద, నా ప్రజ్ఞ చూచెదవా?" యని పన్నిద మొడ్డినట్లు భాషించెను.

ఆమాటల కగ్రజ రోషించి, "అనుజా! ఎంత చెప్పినను నీ మూర్ఖపు పట్టుదల వీడకుంటివి. నీ వాతని నారుమాసములలో విటా

గ్రణి నొనర్తువేని, నేను నీకారుమాసము లూడిగముచేసెద. నీవు చేయ లేక పోయినచో నంతేకాలము నాకు దాసివిగమ్ము" అని పందె మొడ్డెను. దేవదేవి వల్లెయని యంగీకరించెను.

మరునాడు దేవదేవి తన దివ్యవేషము నంతయు నుజ్జగించి, సాత్త్విక వేషధారిణియై, మోమున విన్నదనంబు దెచ్చుకొని, విప్రనారాయణునిం జేరి నమస్కరించి, పెద్దగా దుఃఖించెను. విప్రనారాయణుని హృదయము కరిగి "తన్వీ! యేల విచారించుచుంటివి?" యని ప్రశ్నించెను. అపుడు దేవదేవి పునఃపునర్వందనము లొనరించి, "మౌని పుంగవా! నేను పూర్వజన్మకృత మహాపాతకంబున వేశ్యనై జన్మించితిని. ఈ జన్మమునందును కులవృత్తి నవలంబించి, అనేకాఘము లాచరించితిని. ఇప్పటికి పెద్దల యనుగ్రహముచే జ్ఞానోదయమైనది. పూర్వ జీవితము హేయముగతోచినది. ఈ శరీరముపై రోతజనించినది. కావున నా వృత్తిని విడనాడి, మీవంటి దివ్యహంసల పాదారవిందము లాశ్రయించి తరింపవలయునని నామనస్సువ్విళులూరుచున్నది. కావున మీ తిరువడిఘళు లాశ్రయించితి. మీ దయ నా ప్రాప్తము" అని పాదారవిందములపైబడి కన్నీటితో నాయన పదవనజంబులు ప్రక్షాళించెను.

ఆ సాత్త్వికాగ్రేసరుం డదియంతయు సత్యమని విశ్వసించి "సుందరీ! వైరాగ్యము చాల భయంకరమైనది. నీవు మంచి యౌవనమున నుంటివి. తదుపరి పశ్చాత్తాపమునందినను, ప్రయోజనముండదు. సుఖలాలసమైన నీ శరీర మీ దుర్భరపరిశ్రమల కోర్వజాలదు. మరల నాలోచించుకొమ్మని చెప్పెను. ఆమెయందు మెత్తబాటు కన్పింప లేదు. అపుడాతడు "సరియే. నీకట్టి వైరాగ్య ముదయించినచో నిన్ను శిష్యురాలిగా నంగీకరించెదను. నాకు సహాయమొనర్చుచు, రంగేశ్వర కైంకర్యమొనర్చుటకు, రంగేశుడే నిన్ను సహాయముగా నాకు చూపించి నాడు. కావున నీవును తోటపనిచేయుచు, రంగనాథ కైంకర్య మొన

ర్పుము" అని ఆదేశించెను. మహాత్ముల మనస్సులు కరుణా ప్రపూర్ణములు కదా !

విప్రనారాయణుడు ఖనిత్రముతో చెట్లపాదులు త్రవ్వుచుండ నా వేశ్య చక్కగా కట్టలు కట్టుచుండెను. గురుండు నీరుతోడుచుండ నామె మళ్ళు తీర్చుచుండెను. అతండు పుష్పములు గంపలతో తెచ్చి పర్ణశాలాభ్యంతరమున నుంచగా నామె చక్కగా పలురకములహారాలు కట్టుచుండెను. ఆమె పర్ణశాలయంతయు నలికి ముగ్గులు పెట్టుచుండెను. విప్రనారాయణుడు భిక్షాటనచే తెచ్చిన అన్నమును, తాను కొంత వినియోగించి, మిగిలిన అన్నమును వేశ్యకీయగా దానినామె భుజించుచు, రాత్రులందు చెట్లకునమర్చిన వితర్దికలపై శయనించుచు కొంత కాలము గడిపెను.

రెండుదినములు తక్కువ ఆరుమాసము లయ్యెను. దేవదేవి తన మనస్సున "నేను మా అక్కతో పన్నిదము వేసిన దినములు కడచను చున్నవి. నా కార్యము సిద్ధించునట్లు కానరాదు. ఇన్ని దినముల నుండియు తరుతలశయనము కరతలపానమే తప్ప మరియొకటి యెఱుంగ. నేనెంత శ్రమించినను ఈ బ్రాహ్మణ బ్రహ్మచారి రవ్వంతయైన కరగు నట్లు లేడు. నేనెన్ని నర్మవాక్యములు పల్కినను ఒక్కమాటకైన సమాధానమీయడు. చేపఱ్ఱొవ్వి యొడ్డున బడినయట్లు నేను మా అక్కతో పందెముకాచి యిట్లులైతిని. రాజసభనుండి పోవుదాన నట్లే పోక యీ తోటకేలవచ్చితి ? వచ్చినదాన నూరకుండక యీపన్నిదం బేలవైచితి ? సమస్త భోగభాగ్యములు విడనాడి కుసుమసుకుమార శరీరము కృశించుచుండ నేనేల యీ తోటపనికి చేరితి ? వచ్చితిబో సరియగు నాహారములేదు, హంసతూలికా తల్పంబులు లేవు. కంటి నిండ నిద్రలేదు. నాకీ దుర్దశయేల ? విధికృత మిట్లుండ తప్పించువా రెవరు ?" అని నిర్వేదించి, తుదకు అశరణ్య శరణ్యుండను, దేవాది

దేవుండును, భక్తాభీష్ట ప్రదుండును, భుజంగశయానుండును, రథాంగ హస్తుండగు రంగేశ్వరుని చిత్తమున నిల్పి యిట్లు వేడుకొనెను.

"దేవాదిదేవా ! అఘటన ఘటనాసమర్థుండవు భక్తరక్షణ దీక్షాదక్షుండవు నిన్నే నమ్ముకొనియుంటి, అకించనురాల నన్ననుగ్రహించి యీ విప్రనారాయణుని నావశము చేయుము."

సూర్యాస్తమయమైనది. ఆమె ప్రపత్తిని రంగేశ్వడనుగ్రహించెనా యనునట్లు కారుమేఘములు గగలతలమ్మును గ్రమ్మెను. చుట్టు కైనువుభాతి గట్టిగా మెరయుచు, పాంచజన్యమువలె ఘోషించుచు, శార్ఙ్గకోదండంబురీతి జడిగా వాన కురియజొచ్చెను. ఆ సమయమున విప్రనారాయణుండు తన పర్ణశాలయందు కూరుచుండెను. వాన అధికమగుచుండెను. అపుడు విప్రనారాయణుడు తన కుటీరము తలుపు తెఱచి, బయటకు తొంగిచూచెను. కుటీరమున కెదురుగానున్న రావి చెట్టుక్రింద నున్న అరుగుపై దేవదేవి జోరునతడియుచు చలికి గడగడ వణకుచుండెను. అంతలో ఒక్కసారి దేదీప్యమానముగా మెరసెను. ఆ మెరుపులో వానకు తడియుచున్న దేవదేవి. అపరశంపాలతవలె మానికిదృగ్గోచరమయ్యెను. ముని జాలివడి "యువతీ ! లోనికిరమ్ము. వర్షము వెలయుదనుక నీ పర్ణశాలలో నీ వితర్దికపై కూరుచుండుము. చలికి బాధపడనేల" అని సాదరముగా ఆహ్వానించెను.

సమయము చిక్కెగదాయని సంతసించి, దేవదేవి పర్ణశాల లోనికి ప్రవేశించెను. ఆమె వస్త్రము తడిసియుండుటచే వస్త్రపుకొనలు నీరోడుచుండెను. ఆమె ప్రత్యంగమును స్పష్టముగా గోచరించి, గురుని మానసమున కొంత తొందరపాటు హెచ్చెను. దాని నడంచుకొని, యా విరాగి, కరుణార్ద్రమనస్కుండు గావున "ఓ పంకజముఖి ! నీ కట్టుపుట్టంబు తడిసినది. దానిని విడిచి నాశాటి నొసంగెద ధరింపు" మని యొసంగెను. ఆ వస్త్రమునువీడి పొడివసనంబును ధరించు నెపంబున

నా మాయావి, విప్రనారాయణుని ముందు తన శరీర సౌందర్యము సమస్తము ప్రత్యక్షమగునట్లు వర్తించెను. గురుండొక చిత్రాస్తరణంబున శయనించి తదేకదీక్షతో దేవదేవి చేష్టల గమనించుచుండెను. ఆమె తడిసిన వెంట్రుకలు జారవిడిచి; విలాసముగా వానిని పిండుచు, గురుని సమీపించి, "వైరాగ్యభాసురా! ఈదాసి దేవరవారికి పరిచర్య చేయవలయునని ఎంతయో కాలంబునుండి ఎదురుచూచుచున్నది. ఆ సేవాభాగ్యము ననుగ్రహింపుడు, కొలదిసేపు తమ పాదపద్మములొత్తెద' నని, గురుడు కన్నుసన్నలచేముదలనీయ, నాతని పాదమ్ముల తన యొడియందుంచుకొని మృదువుగా నొత్తుచు, కలకంఠమ్మున శ్రీకృష్ణుని రాసక్రీడావిలాస భాసురంబులగు శృంగార కీర్తనలాలపింప దొడంగెను. అదనుకై వేచియున్న అనంగుడు ప్రత్యాలీఢపాదస్థుడై, తన పంచబాణములను బయటివానజడికన్నమిన్నగా, పుంఖానుపుంఖములుగా విప్రనారాయణునిపై ప్రయోగించెను. ఆజన్మబ్రహ్మచర్యుండును, తృణీకృతోత్తమ భుక్తిచిత్తుండును, సమలోష్టాశ్మకాంచనుండునగు నా విష్ణుకైంకర్య రతుండు రతిక్రీడా సముత్సుకుండయ్యెను. దేవదేవి కరస్పర్శంబున చలించి ఆతని సర్వేంద్రియములు కరగి, ధైర్యంబుసడలి, ఆమె మోమునే చూచుచుండెను.

"అంగారసదృశీ నారీఘృతకుంభసమః పుమాన్" అని గదా శాస్త్రము. వనిత అగ్నిహోత్రము. పురుషుడు నేతికుండ. అగ్నిసన్నిధిని నేతికుండలోని నేయి యెట్లు కరుగునో అట్లే స్త్రీ సన్నిధి నొంటరిగా నున్న పురుషుండును అట్లు కరగిపోవును అని శాస్త్రమే వక్కాణించుచున్నది.

"తావదేవహిపాండిత్యం తావదేవవివేకితా
యావజ్జ్వలతి నాంగేషుహతః పంచేషుపావకః"

దుష్టుండగు మన్మథుడు తన ప్రభావము చూప నంతవఱకే మానవుని పాండిత్యవివేకములు. ఆతడు మండెనా అన్నియు సున్నయే.

అంత వృత్తిమర్మము నెఱింగిన ఆ వేశ్యాంగన విప్రనారాయణుని మనోధైర్యము సడలుట గమనించి, తన శృంగార చేష్టలతో నాతని లాలించి, కౌగిలించి, రతిక్రీడ దేలించి క్షణములో భ్రష్టునొనర్చెను. ఈ విధముగా వారిరువురు నవ్యవధాన మనోజవిలాసముల దేలుచుండ తెల్లవారెను. తన పూనిక నెరవేరెగదాయని సంతసించి, దేవదేవి తన గృహంబునకేగి, మజ్జనం బొనరించి, దివ్యవస్త్రభూషణంబులుకైసేసి, కన్నుగవ కాటుక రేఖదిద్ది తీర్చి, కేశపాశంబునకుసువాసనా ధూపంబులువైచి, లలాటమున కస్తూరీ తిలకము నలంకరించి, మన్మథుని కలుకుటమ్మువోలె విప్రనారాయణుని యెదుట గోచరించెను. విప్రనారాయణుడామె దివ్యసౌందర్యమును రెప్పలార్పకచూచి, నేత్రపాత్రముల తత్సౌందర్యమును గ్రోలుచు, ఆమెనుగూడి, ఆలింగనచుంబనాది రతిక్రీడల సంతసించుచుండెను.

అదనుగ్రహించి దేవదేవి, విప్రనారాయణునితో "స్వామీ! శృంగార విహారంబులకీ పూదోట లనుకూలములుగావు. ఇచ్చట హంస తూలికాతల్పములు లేవు. మన్మథోద్దీపన హేతువులగు చిత్రపటంబులు లేవు. ధూపదీపాది సువాసనలుండవు. అనులేపనములు లభింపవు. కావున మాయింటికి పోవుదము దయచేయుడు. విలాసముగా యథేచ్ఛగా వాంఛిత భోగంబు లందవచ్చును." అని ఆతని నొప్పించి, తన గృహంబునకు తోకొనివచ్చెను. అదిచూచి మధురవాణి చెల్లెలింజూచి "చెల్లీ! నీవే జయించితివి. నేను నీ కారుమాసంబులు దాస్యంబొనరించెదను." అని దాస్యవృత్తి నవలంబించెను.

దేవదేవి శ్మశ్రువర్థకుని పిలిపించి, విప్రనారాయణున కాయషట్కర్మము గావింపజేసి, మజ్జనంబుచేయించి, సన్నని కౌశేయవసనమును ధరింపజేసి, చందనాదులలంది, పుష్పమాలికాలంకృతునొనరించి, కాముకాగ్రేసరుని గావించెను. ఆ విప్రుంబును రంగేశ్వర కైంకర్యంబునకు

స్వస్తి చెప్పి, ఆ వనమువంక కన్నెత్తిచూడక, భగవచ్ఛాసనంబులకు తిలోదకంబులిచ్చి, నిత్యవిధులకు చరమకైంకర్యంబొనరించి, దేవదేవిం గూడి యిష్టసుఖంబులందుచు, నామెను విడనాడి క్షణకాలము జీవింప నొల్లక, రేయింబవళ్ళామెతోకూడి యుండెను.

ఇట్లు వారిరువురు సుఖమొందుచుండ, అంతకుముందు దేవదేవి గడించిన ఐశ్వర్యమంతయు, నిదాఘావసర కూపనీరమ్ము భాతిక్రమముగా తరగిపోజొచ్చెను. ధనహీనుండగు విప్రనారాయణుంజూచి, ఒకానొక దినంబున దేవదేవితల్లి ఆగ్రహోదగ్రయై రామకార్య ధురంధరుండై సముద్రమును తరించు వాయుసూను నడ్డగించి, మ్రింగ గమకించు నాగమాతకరణి రామునివలచి సీతామాతం గబళింపవచ్చు శూర్పణఖవోలె తెల్లని జనపనార పీచువలె వెంట్రుకలు వ్రేలాడ, చెవులకుపెట్టిన పెద్ద పెద్ద దుద్దులుఱ్ఱూతలూగ, అంబరీషమువలె మోముజేగురింప, కటి కట్టిన జీర్ణవస్త్రము నేలజారుచుండ, తుంబీఫలసదృశలంబి మానస్తనద్వంద్వంబు నొండొంటింతాకియాడ గర్జించుచు, పదములుతొట్రుపడ, దక్షిణభుజంబెత్తి హుంకరించుచు "ఓయీ! దాసరిబాపడా! నీవు ఖ్యాతిలాభార్థంబు సాత్త్వికవేషంబువైచికొని, గొప్పదైవభక్తునివలె నటించుచు, పుష్పమాలలవలన లాభంబార్జించుచు, తోటలోనుంటివి. ఒకనాడు నాతనయ శ్రమాపనోదార్థము నీ తోటలోనికి వచ్చినది. నీవు భయంకర పిశాచమువలె, నాక్రమించి, ద్రవిడ మంత్రములచే వశీకరించి, దాని మనస్సునంతయు పాడుజేసి ఆక్రమించి, వదలకున్నావు, నాచపేట ప్రహారంబునగాని యిల్లువీడి పోవునట్లులేవు" అని విప్రనారాయణుని చేయివట్టిలాగి, యింటినుండి వెడలద్రోసి, వీధిలోనికి నెట్టి తలుపులు బిగించుకొనెను. అడ్డువచ్చిన దేవదేవింజూచి "ఓసీ! వెఱ్ఱిబాగులదానా! ఈ దాసరిబాపడు నీవైభవమునకు; నీ అంతస్థునకును, నీ సౌందర్యమునకు తగినవాడా! రాజాధిరాజు లెందరో నీ పొందుగోరి కాన్కలంపుచుండ నీదరిద్రునితో నీకేల? వయస్సుండగనే

వేశ్య సమస్తసంపద లార్జింపవలయును. పరువముపీడిన పూవునువలె, వయస్సుమళ్ళిన వేశ్యవంక నెవ్వరు కన్నెత్తిచూడరు. ఇరుగు పొరుగు నీయాడువారిని జూచియైన బుద్ధితెచ్చుకొమ్ము. అతనిని మరల లోనికి తెచ్చితివా, నేనిక సహింప" నని కోపగించెను.

విప్రనారాయణుండు వియోగదైన్యంబున కోర్వక, చేయునది లేక వీధియరుగుపై వస్త్రము ముసుంగువైచుకొని పరుండి మనస్సునందు నిరుపాధిక బంధుండును, ఆర్తజన శరణ్యుండును, ఆశ్రితకల్పకంబునునగు శ్రీరంగనాథునితలంచుచుండెను.

ఆ సమయమున రంగేశ్వరుడు దివ్యవిమానారూఢుడై, రంగనాయకింగూడి రంగవీధుల విహరించుచు, విప్రనారాయణుండున్న స్థలంబునకు వేంచేసెను. శ్రీదేవి విప్రనారాయణుంజూచి భర్తతో "జగదీశ్వరా! యీతడెవ్వడు? వీధిఅరుగుపై ముసుంగిడి పరుండియున్నాడు" అని అడిగెను. అందులకా సర్వవేది "దేవీ! యీతడు మనకు మిక్కిలి ప్రియతముడు. విప్రనారాయణుండను పేరుగలవాడు, మనకనునిత్యము పుష్పకైంకర్యబు నొనరించు చుండువాడు. ప్రారబ్ధకర్మవలన వేశ్యా సంగమున దగుల్కొని, తద్వేశ్యచే తర్జింపబడి యిట్లు విచారించుచున్నవాడు" అని బదులుపలికెను. రంగనాయకి మిక్కిలి నిర్వేదించి "దేవా! ఎంతపని చేసినారు? మనకు ప్రతిదినము పుష్పకైంకర్యము చేయువానిని, నీ లీలావిధేయునిగా జేయవచ్చునా? ఆతనికి మీరీయదగిన బహుమతి యియ్యదియా? మీరు నిరంకుశులుగదా! మీరా ప్రారబ్ధకర్మమును తొలగింపగూడదా? ఎట్లు చేసినను, మిమ్మొకాదను వారెవ్వరు? మీకసాధ్యమున్నదా? వలదు వలదు. వానికీ ప్రారబ్ధానుభవముువలదు. తొలగింపుడు" అని వేడుకొనెను. అందులకా జగద్గురుండునవ్వి "అట్లే యొనర్తు" నని పల్కి తన దేవాలయంబు ప్రవేశించి, శేషపర్యంకమున పవ్వళించెను.

ఒక బాలకుండా అర్ధరాత్రి సమయమున, మహానర్ఘ రత్నమయ స్వర్ణపాత్రము నొకదానిని తీసికొనిపోయి దేవదేవి యింటి తలుపు తట్టెను.

వేశ్యతలుపు తెఱచెను. వాకిట నొక కైతవ బ్రహ్మచారి నిలిచి యుండెను. ఇంద్రనీలములను తిరస్కరించు వెంట్రుకలతో, ముద్దు లొలుకు మోము దమ్మితో, పాలాశదండమును ధరించి, మోమున కస్తూరీ తిలకము విరాజిల్లుచుండ, తెల్లని వస్త్రమును ధరించియుండెను. అతడు దేవదేవిని జూచి ఆకైతవ బ్రహ్మచారి "మహిళామణీ ! మా గురుండు విప్రనారాయణుండు. అతనికి విశ్వాసపాత్రుండనగు శిష్యుండను నన్ను అళహియమళవాళదాసుడని పిలుతురు. నాచే మాగురుండొక అమూల్య వస్తువును నీ కంపించెను. గ్రహింపుము" అని అనర్ఘ రత్న ఖచిత హిరణ్మయ పాత్రను, అసురనాయకుండగు బలిని యాచించిన దేదో, ఏది ముజ్జగములందలి జీవసంతతికి కొలబత్తెములు ప్రసాదించు చున్నదో ఏది జగదీశ్వరి లక్ష్మీశరీరమున సూత్న మర్యాదలు చెందు చున్నదో ఏది భక్తబృందముల కనవరతాభయప్రదానము చేయుచు న్నదో అట్టి లోకరక్షణ ప్రశస్తమగు దక్షిణ హస్తము చాచి, దేవ దేవి కందించెను.

ఆ పాత్రను గైకొని దేవదేవి గృహములోనికిపోయి తల్లిని లేపి పాత్రనుచూపి, జరిగినదంతయును వివరించెను. ఆ జరఠి సంతసించి, కుమార్తెం జూచి, "అమ్మా ! ఆ దాసరి బాపడు సామాన్యుడుకాడు. పెద్ద ధనవంతుడు. మన జీవితాంతమును సంపాదించినను, ఈ గిన్నె విలువగల ధనము నార్జింపజాలము" అని చెప్పి వీధి అరుగుమీద పరుండి యున్న విప్రనారాయణుని సమీపించి చేతితో తట్టుచు, "స్వామీ ! అల్లుడుగారూ ! లోపలికి దయచేయుడు. మీరులేక మీ ప్రేయసికి నిద్ర పట్టుటలేదు. మీ మీద వలపుచే మిక్కిలి వగపుచెందియున్నది.

ఏదో పెద్దముండ నొక్క-మాట యంటినని మీకింత కోపమా ?" అని లోనికితీసికొనిపోయి దేవదేవి తల్పముపై పరుండబెట్టి తనగదికిపోయెను.

దేవదేవి విప్రనారాయణుంజూచి "తమరాగ్రహింపవలదు. నా తల్లి పోరుబడజాలక మీ వియోగమును సైచితినిగాని నా యిచ్ఛానుసారము కాదు." అని అనేకవిధముల వచించి ఆతనితోకూడి రమించుచుండెను. అంతలో తెల్లవారెను. సూర్యభగవాను డుదయాద్రిపై తోచెను. రంగనాథస్వామివారి అర్చకులు, పరిచారకులు సమస్త వాద్యఘోషములతో సుప్రభాతముతో వచ్చి ప్రణవ విమానంబున కుపక్రమంబొనరించి, కోవెలయొక్క- దివ్యకవాటములు తెఱచి, లోపలికి ప్రవేశించి చూచిరి. పూర్వము విభీషణుడు స్వామికి సమర్పించిన పంచదివ్యపాత్రలలో శుద్ధోదకపాత్ర కన్పింపకపోయెను. అంత అర్చకులు భయపడి దేవాలయాధికారికి తెలియజేసిరి. ఆతడు చోళప్రభువునకు నివేదించెను. ప్రభుడు దేవాలయాధికారిని బిలిచి, అర్చకపరివారముల దండించినచో ఆ పాత్ర వెలికివచ్చునని చెప్పెను. అపుడు దేవాలయాధికారి భటబృందముతో వచ్చి రంగేశ్వరుని అర్చకులను, పరిచారకులనుబంధించి, తీవ్రముగా వారిని శిక్షింపసాగెను. వారు, కుయ్యో ! మొఱ్ఱో మేమెఱుంగమని నెత్తియు నోరును బాదుకొనజొచ్చిరి. వారు ఎంత చెప్పినను వినక "మీరుగాక దేవాలయ గర్భగృహమును ప్రవేశింప నెవ్వరికివచ్చు ? ఆ పాత్రను దొంగిలించుటకు మీకుగాక వేరెవ్వరికవకాశమున్నది ? త్వరగా నాపాత్రను తెచ్చి యొప్పగింపుడు. లేదా మీకుకారాగారప్రాప్తి తప్పదు" అని దండించుచుండిరి.

అట్టి సమయమున దేవదేవి యింటియొద్ద పనిచేయు నొక వనిత జలాహరణార్థ మచ్చటి కేతెంచెను. అచ్చట దండింపబడుచున్న అర్చక బృందమునుజూచి, యందు తన విటుండగు నొకానొక తరుణ వయస్కు-నిజూచి "మీకీ రాజదండన మేవిధి సంప్రాప్తించెను ?" అని

ప్రశ్నించెను. ఆతడామెతో "నెచ్చెలీ! ఈ దండన అకారణముకాదు. రంగేశ్వరుని స్వర్ణపాత్రము లందొక్కదాని నెవ్వరో అపహరించిరి. కావున మాకీ దండనమనివార్యమైనది." అని బదులు చెప్పెను. ఆమె "చెలికాడా! గడచిన అర్థరాత్రమున నొకానొక బ్రాహ్మణయువకుడు సువర్ణపాత్రమునొండు తెచ్చి దేవదేవికిచ్చె, నేను చూచితిని. ఇప్పు డాపాత్రమా మెయింట నేయున్నది. దేవదేవిశయనించు హేమఖట్వములో తలక్రిందనున్న పేటికయందది భద్రపఱుపబడియున్నది. నీవీ యధికారికి చెప్పి భటులతో పోయి ఆమెయింటిని శోధించినచో నది లభింపగలదు" అని చెప్పి వెడలిపోయెను.

దేవాలయాధికారి యీ విషయమును విని భటవర్గముతో పోయి దేవదేవియిల్లు సోదాచేయగా పాత్ర దొరికెను. అతడు దండనాథుడు దేవదేవినిజూచి, "ఈ దివ్యపాత్రము నీ కెక్కడినుండి వచ్చినది? ఎవ్వరు తెచ్చియిచ్చిరో తెలుపు" మని గద్దించి యడిగెను. అందుల కామె "అయ్యా! నా కీపాత్రను, గతరాత్రి విప్రనారాయణుని శిష్యు డగు అళహియ మళవాళదాసుడు తెచ్చి యిచ్చినాడు". అని పలుక నాతడు విప్రనారాయణుని పిలిచి అట్లే యడిగెను. అందులకా భక్తాగ్రణి, దండనాథునితో 'నాకొక శిష్యుడుగాని, దాసుడుగాని, యొక్కండును లేడు. నే నంపలేదు. స్వయముగా నే నీయలేదు. అది యెట్లువచ్చినదో నాకు తెలియదు." అని సమాధానమిచ్చెను.

దండనాథుండు విప్రనారాయణుని స్వర్ణస్తేయి యని నిర్ణయించి యాతనిని, దేవదేవిని బంధించి, కారాగార బంధితులచేసి, ఆ వృత్తాంత మంతయు ప్రభువునకు నివేదించెను. క్షితీశ్వరుండు దేవదేవి ఐశ్వర్య మునంతయు ప్రభుత్వము పాలొనరించి, స్వర్ణస్తేయికి నేశిక్ష విధింప వలయునో విచారింపుడని న్యాయనిర్ణేతల నియమించి, విప్రనారాయణు నొప్పగించెను.

ఆ రేయి క్షితినాథుని స్వప్నమునందు రంగేశ్వరుడు గోచరించి "రాజా ! విప్రనారాయణుడు దొంగగాడు. ఆత డాపాత్రను తస్కరింప లేదు. ఆపాత్రను నేనే తీసికొనిపోయి దేవదేవి కొసంగితిని. ప్రారబ్ధవశమున విప్రనారాయణున కట్టివేశ్యాసంగమును సంభవించినది. కాని ఆతడు జగన్మాన్యుడు. తెల్లవారినతోడనే విప్రనారాయణుని బంధవిముక్తుని కావింపుము. దేవదేవి కారణజన్మ. ఆమె ధనము నామెకిచ్చివేయుము. నేనే యొసంగి మరల తీసికొనజాలను కావున నా స్వర్ణపాత్రమునుగూడ నామెకే యిచ్చివేయుము". అని తెల్పి అదృశ్యుండయ్యెను.

తెల్లవారిన వెంటనే క్షితినాథుడు స్వప్నవృత్తాంతమును భావించుచు, విప్రనారాయణు బంధవిముక్తునింజేసి, అర్ఘ్యపాద్యాది విధుల పూజించి. క్షమింపుమని పాదములపై బడెను. దేవదేవిని రావించి ఆ బంగరు గిన్నెతోకూడ నామెకిచ్చివేసెను.

విప్రనారాయణుండు తానొనర్చిన పనికి నిర్వేదించి, తన పుష్పవనమునకుపోయి తానుచేసిన పాపమునకు పరిహార మెట్లా యని యోజించి, పరమభాగవతుల పాదోదకము సర్వపాపహరణమని శాస్త్రములు వచించుచున్నవని యెఱింగి, మహాభక్తుల పాదోదకములను గ్రోలెను. తన పేరును భక్తపాదధూళి, లేక భక్తాంఘ్రిరేణువు అని మార్చుకొనెను. దానికి ద్రావిడమున తొండరడిప్పొడి యాళ్వార్ అనునది సమాన నామము. ఇట్లు తన పాపపరిహారము చేసికొన్నవాడై, సర్వేశ్వరున కనంత పుష్పకైంకర్యము చేయుచు కాలముగడపి, తన వైభవమును చాలించి దివ్యలోకమునకు వేంచేసెను. దేవదేవికి పరమభాగవతోత్తముని సంపర్కముచే సర్వపాపములు నశించెను. జ్ఞానోదయమాయెను. ఆమెయు సర్వసంగములు వదలి రంగేశ్వరునారాధించి, ప్రారబ్ధానంతరము నిత్యపదవికి వేంచేసెను.

ఓం శాంతి శాంతి శాంతిః

# తిరుప్పాణి ఆళ్వారుల వైభవము

కార్తికే రోహిణీజాతం శ్రీపాణిం నిచుళాపురే
శ్రీ వత్సాంకం గాయకేంద్రం, మునివాహనమాశ్రయే॥

శ్రీరంగమునకు దక్షిణమున నిచుళాపురంబను గ్రామం బొండు గలదు. అందు పంచమకులంబున నొక మహాపురుషుం డవతరించెను. ఆయనకే తిరుప్పాణి ఆళ్వారను ప్రఖ్యాత నామంబు కలిగెను. ఆతడు ప్రహ్లాదునివలె నాజన్మ వైష్ణవుండు నారదునివలె మహాదైవ సంకీర్తన పరుడు, గాయకుడు. ఆతనికి సమస్త విద్యలును జన్మతః సంక్రమించెను. మహాపురుషులకు సమస్తమును స్వయంప్రాప్తములయి యుండునుగదా! మల్లెపూవునకు పరిమళ మెట్లు వచ్చె ? అది దానికి స్వభావము. మండూకమునకు జలతాడనం బెవరు నేర్పిరి ? కోకిలకా అవ్యక్తమృదు మధుర కంఠ మెట్లు లభించెను ? ఇవియన్నియు సహజ సిద్ధంబులేకదా!

తిరుప్పాణి ఆళ్వారు తాను పంచమకులజుండగుటచే కలియుగ వైకుంఠమగు శ్రీరంగమును తన పదన్యాసముచే నపవిత్రము చేయ రాదని భావించెను. కావేరీ దక్షిణ భాగంబుననుండి, రంగేశ్వరాలయ మున కెదురుగా నిలిచి, తంబురా ధరించి, రెండవ చేతితో తాళమును వైచుచు అహోరాత్రములు సర్వేశ్వర సంకీర్తనాలోలుడై యుండెను.

ఒకనాడు తిరుప్పాణి ఆళ్వారు కావేరీనదీ నీరంబునందవగాహన మాచరించుచు, భగవత్పదమగ్న మానసుండై మైమరచి, నదీప్రవాహమున కొట్టుకొనివచ్చి శ్రీరంగమువైపు చేరెను. అట్టి సమయమున కొందరు దురహంకారులు చూచి, "వీడు పంచముడు శ్రీరంగమునకు వచ్చుచున్నాడు." అని అరచుచు రాళ్ళు తీసికొని ఆతనిపై విసరిరి. ఆతనికి స్పృహ వచ్చెను. కావేరీనది నీదుకొనుచు, తన యూరిప్రక్కకు పోయి చూచుకొనగా రాళ్ళు తగిలిన గాయములు కన్పించుచుండెను. అది చూచి అమ్మహాపురుషుండు తన మనంబున "ఆహా ! ప్రత్యక్ష

పరమపదవాసులగు నిత్యసూరులు రాళ్ళలోనైన నన్ను స్పృశించిరి. నా శరీరము పవిత్రమైనది. జీవితము ధన్యమైనది.'' అని ఆనందపడుచు తన గేహమునకు చేరెను.

"ఇచ్ఛామోహిమహాబాహుం - రఘువీరం మహాబలం
గజేన మహతాయాంతం-రామం ఛత్రా వృతాననం"

దివ్యసుందర విగ్రహుండును, మహాబలుండును, ఆజానుబాహుండునగు రామచంద్రుండు శత్రుంజయమను నేనుగుమీదనెక్కి-ముత్యాల కుచ్చుల తెల్లగొడుగు ముఖమున కడ్డముగా పట్టగా, దివ్యాలంకోపేతమై తిరస్కృత పద్మంబైయున్న రాముని దివ్యముఖారవిందమును జూడగోరుచున్నాము అను భావము గలవాడై ఇతర చింతలు లేక దేవదేవుండగు సర్వేశ్వరు నారాధించుచు నిరంతరము శ్రీరంగ దివ్యగోపురమును దర్శించుచు, తంబుర శ్రుతిచేసి మీటుచు, భ్రాంతునివలె, నున్మత్తునివలె గంతులు వేయుచు తాళమును వైచుచు శ్రీరంగేశునిగూర్చి పాడుచు కాలము గడపుచుండెను. కొందరు ప్రజ లాతనిని పిచ్చివాడని తలంచిరి. కొందరు మహాపురుషులు మాత్రము "హసంతికారవిందమువలె నీతడీ పంచమకులంబున నుద్భవించెను. రాళ్ళయందే రత్న ముద్భవించుగాదె. ఎచ్చట జన్మించినను, మహాపురుషులు విశ విఖ్యాతినొందుదురు. ఈత డట్టివాడు" అని తలంచు చుండిరి.

ఒకనాడు రంగేశ్వరి భర్తంజూచి "దేవా ! మనకెదురుగా నిచుళాపురమునందుండి మన గోపురమును రేపవల్వక దర్శించుచు నిత్యము గాన మొనర్చుచున్న మహాపురుషుండెవ్వరు? ఆతని పేరేమి ? అట్టి వాడిచ్చటకువచ్చి మనల దర్శింపడేల ? ఆతనిని చూడవలయునను కోరిక పొడము చున్నది. ఆత నొక్కసారి యిచ్చటకు రప్పింపుడు" అని అడిగెను.

జగదీశ్వరుండు భార్యం జూచి "ఇందిరా ! అతడు 'తిరుప్పాణి' యను మన భక్తుడు. పంచమ కులస్థుండు. తాను హీనజాతి గనుక శ్రీరంగమును త్రొక్కరాదని నిర్ణయించుకొన్న కతమున నిచ్చటికి రాడు. అతని తెప్పించెద" ననిపలికి తనకు నిత్యమును తిరుమంజనము సమర్పించు లోకసారంగముని యను మహాభాగవతోత్తముని, బ్రాహ్మణ శ్రేష్ఠుని స్వప్నంబున దివ్య తేజముతో గోచరించి "భక్తా ! నీ వుదయమున నిచుళాపురమున కేగి, అందున్న శ్రీపాణి యోగీంద్రుని నిటకు తోడ్కొనిరమ్ము అతండు తన జాతి స్వభావంబును తలంచి రంగధామమును పాదములతో స్పృశింపడు. నీ వతనిని భుజములమీద నెక్కించుకొని రమ్ము అతండు పంచముండని భావింపవలదు. అతండు నా అంతరంగికభక్తుండు భగవద్భక్తుల కులగోత్రంబులెన్నరాదు. వాడు మహానుభావుండు' అని ఆదేశించి, అంతర్హితుండయ్యెను.

భక్తుల విషయమున కులప్రసక్తిని తెచ్చినవాడు భగవంతుని దూషించినవాడే. కులగోత్రములు వ్యవహార కల్పితములు. అవి సంబంధ బాంధవ్యములవఱకే పరిమితములు. అవి పూజ్యతకు గీటురాళ్ళు కావు. కులములు హైన్యములు, గుణములే పూజ్యములనియు, అసలు కులములేదనియు వ్యాసభగవానుడు పంచమవేదంబగు భారతమున ననేక ప్రదేశముల నొక్కివక్కాణించెను. గీతాచార్యులును "చాతుర్వర్ణ్యం మాయాసృష్టం గుణకర్మవిభాగశః" నాలుగు వర్ణములను, వారివారి గుణకర్మములనుబట్టి నేనే సృష్టించితిని. అనగా నివి వారివారి వృత్తులనుబట్టి విభజింపదగినవే, అని స్పష్టమొనర్చెను. కాని యీవాక్యమును రెండువిధములుగా నన్వయింపవచ్చును. నేను కులములను సృజించి, వానికి తగిన గుణములను వృత్తులను కల్పించితినని యొక యర్థము. నేను గుణములు, వృత్తులు సృష్టించి వానిలో ఎవ్వడు దేని నాశ్రయించిన, వాడా కులమువాడగునని రెండవ అర్థము.

ఇందు రెండవయర్థమే ప్రధానము. జాతులను సృజించి, గుణములచే కులముల సృజించితినని చెప్పినచో, ఆ చెప్పిన గుణకర్మములుగల వారాయా కులములలో నెంతమందిగలరు? వేయింటికొక్కండును లేడు. గుణములు కర్మములనుబట్టి కులమును నిర్ధరించినచో అందరికిని సరిపోవును. కొందఱు కొలములే ప్రధానములనియు, ఆయాకులముల కేయే గుణకర్మములున్నవో వానినే ఆశ్రయింపవలయునని శాసించుచున్నారు వారు పండితమ్మన్యులనియు, లౌకికజ్ఞానశూన్యులనియు. సదా ఘూకములనియు చెప్పబడుదురు. శ్రుతియను శబ్దమును వ్రాయుట నెఱుంగని వారు మోవరాని బరువుగల గ్రంథములు వ్రాయుచున్నారు. పాపము వారు కోశములనైన చూచియుండరుగాబోలు. ఈ దుష్టశాసనముల భరింపలేనికొందరు, బ్రహ్మద్వేషపరులై నిరీశ్వరవాదమును లేవనెత్తిరి. ఈశ్వరుడున్నాడని యంగీకరించినచో, నవీనులు వ్రాయుచున్న "కులము గొప్ప గుణముకాదు, పూర్వజన్మకర్మచే నాయా ఉచ్చనీచకులమందు జనించుచున్నారు. శూద్రాదులు విద్య కనర్హులు. వారు ఉత్తమ కార్యాధికారులుకారు" అను నీచ విషయముల నంగీకరింపవలసి వచ్చును. కావున ఈశ్వరాస్తిత్వమును తిరస్కరించిన పైవాదము లన్నియు పరాస్తములగునని కొందరు భావించుచున్నారు.

ఈశ్వరోపాసనచేయుచున్నారు కావున మూఢ విశ్వాసములకు తావీయమందురా, అది కానిపని. ఎవ్వరైనను ఏదో యొకరూపమున ఈశ్వరోపాసనను చేయుచున్నవారే, కొందరు ప్రత్యక్షముగా, మరికొందరు పరోక్షముగా చుట్టుదిరిగి చేయుచున్నారు. బుద్ధుడు నిరీశ్వరవాది. ఆతడు సర్వేశ్వరుని సూటిగా నారాధింపకపోయినను గుణములచే నారాధించినవాడేకదా? ఆతడెట్లు నిరీశ్వరవాదియగును?

"యస్యజ్ఞానదయాసింధో రగాధస్యానఘాగుణాః
సేవ్యతామక్షయోధీరాః సశ్రియైచామృతాయచ"

"జ్ఞానమునకును, దయకు సముద్రుఁడగు సర్వేశ్వరుని గుణములు ఐశ్వర్యముకొఱకు మోక్షము కొఱకు నారాధింపుడు" అనిగదా బౌద్ధులు వచించినది. "సత్యంవద-ధర్మంచర-అహింసాపరమోధర్మః" అనిబుద్ధుని ప్రబోధము. పైని చెప్పినవన్నియు సర్వేశ్వరుని గుణములే. కొందరు మాతృభూమియగు స్వదేశమును స్తుతించుచున్నారు. కొందరు ప్రకృతి రూపముల ధ్యానించుచున్నారు. ప్రకృతియనగా, ప్రకౢప్తముగా చేయ బడినది-లేక గొప్ప ప్రయత్నము. అనిగదా అర్థము. ఆప్రయత్నమునకు కర్త యొకడున్నాడని, ఆతడే జగదీశ్వరుడని కొందరుస్తుతించుచు న్నారు. ఈశ్వరుడున్నాడని చెప్పినంతమాత్రమున దేశమునకు ముప్పు సంభవింపదు. కావున మూఢవిశ్వాసములకు తావీయరాదు. వేదముల యందున్నదంతయును ప్రమాణభూతముకాదు. వేదములు మూడు విధములు. "త్రైగుణ్యవిషయావేదాః" వేదములు సాత్త్విక, రాజస, తామసాత్మకములు. రాజసతామసంబులనువదలి సాత్త్వికము నే గ్రహింపవలయునుగాని, వేదములు చెప్పినని మూఢముగానన్నింటిని విశ్వసింపరాదు.

అశ్వమేదాది యజ్ఞములు కల్పములందు చెప్పబడియున్నవి. అవి ఆ కాలమునకు తగిపోయిన తగిపోవచ్చును. కాని యజ్ఞముల యందు అత్యధికమగు హింసగలదు. దానియందు చేయునన్నదానము గొప్పది. ఐనను, యజ్ఞములు హింసాపూర్ణములు కావున, పెద్దలు వానిని నిరసించినారు.

"యూపంకృత్వా పశూన్ హత్వా కృత్వారుధిరకర్దమమ్
యద్యయంత్రిదివంగచ్ఛేత్ నరకో కేనగమ్యతే?"

అనిధనపాలక వియజ్ఞములను నిరసించెను. "యూపస్తంభములు పాతి, వానికి జంతువులను బంధించి, వాని రక్తముతో భూమిని బురద బురదగా చేసినవాడు స్వర్గమును పొందినచో, నికనరకమునకేగువా డెవడు?" అని ఆతని ప్రశ్న.

సర్వమతములయందును సుగుణదోషములున్నవి. కేవల శుభములేగాని, కేవల దుర్గణములేగాని, యే మతమునను నుండవు. కులములుగూడనంతియే. అన్ని కులములయందును దివ్యపురుషులున్నారు. అన్నింటియందును దుర్మార్గులున్నారు. వీరిలో కొందరు ప్రకృత్యారాధకులు. కొందరు మాధవభక్తియుక్తులు కొందరు మానవసేవాపరాయణులు. ఏది చేసినను, వారు లోకోపద్రవకారకులు కాకయుండుట మేలు. దేవుడులేడు, పుణ్యపాపములునాస్తి, ధర్మాధర్మములు హుళక్కియని వాదించువారు జాబాలివలె నిరసింపబడుదురు. వారి బోధలచే లోకము చెడును.

గీతాచార్యుల బోధను వినుడు.

"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషిదదాసియత్
యత్తపస్యసి కౌంతేయ-తత్కుర్వమదర్పణమ్"

"జీవుడే కర్మమొనరించినను, దేనిని భుజించినను, దేనిని దానమొనర్చినను, దేనిని తపస్సు చేసినను, అదంతయు మదర్పణము సేయుము" అని సెలవిచ్చిరి. అనగా మానవుడు చేయు ప్రతికార్యమును భగవదర్పణ మొనర్చుటయే.

"విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని
శునిచైవశ్వపాకేచ పండితాస్సమదర్శినః"

విద్యయు, వినయమునుగల బ్రాహ్మణుడు, గోవు, ఏనుగు, కుక్క, కుక్క మాంసమును తినువాడు, వీరందరు ఎవరి దృష్టిలో సమానులో వారు స్థితప్రజ్ఞులు. అనగా గోవును చూచినట్లు కుక్కను చూడమనియా? ఆవు పాలు త్రావినట్లు కుక్కపాలు త్రాగుమనియా? దాని కర్థమదికాదు. సమస్తదేహులయందున్న ఆత్మ ఒకే రూపమైనది. దానికి హెచ్చుతగ్గులులేవు. అని దాని అభిప్రాయము. లోకమునందలి

సమస్తమానవులను సమానులని యెవ్వరు భావింతురో అట్టి వారే పండితులు.

అంతియేకాని కులములయందెచ్చు తచ్చులు కల్పించి, వీడు నీచుడు, వీడున్నతుడు, అని లోకమును వేధించువారు, షట్ఛాస్త్ర పారంగతులైనను, వేదవేదాంగపారగులైనను, వారందరును మూఢులే. కులమత సముద్రమున మునింగినవాడందులోనే గతింపగలడు. మానవుడుగా జన్మించిన తనుపరి తోడివారలకు సాయపడవలయు. మంచిని చెప్పవలె. మంచిని విని బోధింపవలె. భగవదారాధనరూపకర్మచే తరింపవలయును. ఇదియే సర్వమతసారము. దీనికి తప్పినదంతయు నసారము.

ఈ విధముగా సర్వేశ్వరుండానతిచ్చి అంతర్హితుండైన, లోకసారంగముని లేచి స్వప్నవృత్తాంతమునంతయు తలంచి, "అద్యమేస ఫలంజన్మ సుప్రభాతాచ మేనిశా" అని భావించెను. ఉదయముననేలేచి, కాలకృత్యములు తీర్చి, కావేరియందవగాహనంబుచేసి, ద్వాదశోర్ధ్వ పుండ్రములు ధరించి, తులసీనలినాక్ష మాలలు కంఠసీమ నలంకరించుకొని, భగవచ్ఛాసనంబులు నిర్వర్తించి, నిచుళాపురంబునకు బయలుదేరెను. అక్రూరుడు నందగోకులమున కేగుచు నానందపడురీతి, నానందించుచు "నావంటి భక్తులు లోకమున నెందరు లేరు? రంగేశ్వరుడు తన ఆంతరంగిక భక్తుని తీసికొనిరమ్మని నన్నాజ్ఞాపించెను. నా జన్మమే జన్మము" అని పరవశించుచు నిచుళాపురంబునకు పోయెను.

తిరుప్పాణి ఆళ్వారు దేహేంద్రియ ప్రపంచంబులు విస్మరించి శ్రుతిమీటుచు రంగనాథ భజన మొనర్చుచుండెను. లోకసారంగముని, దూరమున నుండియే తిరుప్పాణికి సాష్టాంగము లాచరించి ఆతనితో "స్వామీ! శ్రీరంగనాథుండు మిమ్ము తన సన్నిధికి తోడ్కొని రమ్మని నన్ను పంపించినారు. దయచేయుడు" అని ప్రార్థించెను. అందులకాతడా లోక సారంగునింజూచి "మహాత్మా! దేవాలయ ప్రవేశాధి

కారముగల నాల్గు కోలములలో జన్మించినవాడను కాను. పంచముడను అట్టి నేను ప్రత్యక్ష పరమపదమగు శ్రీరంగమును, నా పాదు పాదములతో త్రొక్క నేరను. కావున నేను రాలేను క్షమింపుడు. నన్ననుగ్రహించి దయచేయుడు’ అని సాదరముగా విన్నవించెను. అందులకాతడు తిరుప్పాణింజూచి “స్వామీ! మీ కట్టి భావమున్నచో నా భుజముల నధిరోహింపుడు. గరుడుడు సర్వేశ్వరుని వహించునట్లు, మిమ్ము నా భుజస్కంధముల వహించి మోసికొని పోయెద’’నని ఆతనిని సమీపించుచుండెను.

అది చూచి, తిరుప్పాణి “అయ్యో! పరమభాగవతులు విప్రవర్యులు అట్టి మీమీదనే నెక్కుటయా? అంతకన్న మహాపాతకము వేరొకటున్నదా? వద్దు వద్దు’ అని పలుకుచు వెనుదిరిగిపోవుచుండెను. ఇక వదలినచో నితడు లభింపడని మునివాహనుడు ముందునకు పరువెత్తి తిరుప్పాణిఆళ్వారిని, రెండు చేతులతో బలవంతముగా బిగించి పట్టుకొని, ఆతడు గోలచేయుచున్నను వినక తన భుజములమీది కెక్కించుకొనెను అట్లెక్కించుకొని ఆతివాహకులు ముక్తపురుషు నెత్తుకొని పోవుచందంబున శ్రీరంగమునకువచ్చి గోపురప్రాకారమంటపంబుదాటి, ప్రణవ విమాన మధ్యగతుండగు రంగేశ్వరుని ముందు దించెను. తిరుప్పాణి ఆళ్వారు, శంఖచక్ర ధరుండును, దివ్యపీతాంబర శోభితుండును, వనమాలావిరాజితుండును, హారకేయూర కిరీటముక్తాదామోదర బంధన శింజానమంజు మంజీరాది దివ్యభూషణ భూషితుండును, శ్రీ భూనీళాది దివ్యసీమంతినీ సేవితుండును, సహస్రభానుసంకాశ తేజోవిశాలుండును శేషతల్పుండునునగు దేవాదిదేవు నాపాదమస్తకము ననుభవించెను. తదుపరి స్వామివారి పాదములపై దృష్టినిల్పి, స్తనంధయుండగు బాలుడు తన తల్లి స్తనములపై దృష్టినుంచి స్తన్యమును గ్రోలినట్లు తత్పాదములను తన కనుదోయి చూపుచే ద్రావెను. ఆ పాదములే సమస్త జగత్తునకు రక్షకములని మెంచి ఆనందించి, యాయమందానంద

పరవశముతో "అమలనాథఫిరాన్" అను నొక గ్రంథరూపముగా కీర్తనలనుపాడి తన దివ్య వైభవము నచ్చటనే చాలించెను. రాజపుత్రుడు కురువేరుతోగూడ దానియందున్న మృత్తికను గ్రహించినట్లు అమ్మహాపురుషుని ప్రాకృత శరీరమును రంగేశ్వరుడు తలక్రిందుగా మ్రింగివైచెను. తిరుప్పాణి ఆళ్వారుల కళేబరమెవ్వరికిని గోచరింపదయ్యె. ఆ సన్నివేశమును చూచినవారందరును ఆశ్చర్యనిమగ్నులై తిరుప్పాణి ఆళ్వారుల మహత్త్వము నెఱింగి కొనియాడిరి.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః

## తిరుమంగై ఆళ్వార్ల వైభవము

"కార్తికేకృత్తికాజాతం చతుష్కవిశిఖామణిం
షట్ప్రబంధకృతం శార్ఙ్గమూర్తిం కలిహమాశ్రయే"

చోళదేశమునందు ఆవినాడను గ్రామముండెను. అందు నాల్గవ కొలమునందు ఒక మహాపురుషుడు జనించెను. అతడు శివభక్తిపరాయణుడై దేవబ్రాహ్మణ భక్తి కలిగియుండెను. ఆయనకు కార్తికమాసమున, కృత్తికా నక్షత్రమున శ్రీమన్నారాయణుని, శార్ఙ్గకోదండాంశమున నొక శిశువుద్భవించెను. అతనికి జాతకర్మాదులొనరించి, తల్లిదండ్రులాతనికి నీలుండను నామకరణము చేసిరి, ఆ శిశువునకు పరకాలుడను నామాంతరముగూడ గలదు. ఆ బిడ్డడు దినదిన ప్రవర్ధమానుడై, యౌవనము వచ్చునప్పటికి స్త్రీలోలుండై జారచోర కృత్యంబులయందారి తేరియుండెను. కోదండాంశజనితుడగుటచే నాతడు మహాదేహబలయుతుడై యుండెను. అతనిని చూచినవారందరు భయపడుచుండిరి. చేతియందు కత్తియున్నవాడేదో యొకటి నరకునట్లు, దేహబల సమన్వితుండుగాన అనేక దౌష్ట్యములొనర్చుచు, తద్విధ ప్రఖ్యాతినందియుండెను.

అతడొక సమయమున చోళరాజ సభకేగెను. వలలుని గాంచిన విరటునివలె, అతని దేహబల, ముఖతేజంబులగాంచి, రాజు ఆశ్చర్యము నొంది "అయ్యా! నీ యూరేమి? పేరేమి? ఏమి పనికై యిచ్చట కరుదెంచితివి?" అని ప్రశ్నించెను. అందులకు పరకాలుడు నవ్వి రాజుతో "ప్రభూ! నేను నీతో పనియుండివచ్చినవాడనుకాను. నీవు సద్గుణసంపన్నుండవని విని దర్శింపవచ్చితి. మాది ఆవినాడనుగ్రామము. నన్ను నీలుడందురు. నాలవ కులమున పుట్టినవాడను" అని సమాధాన మొసంగెను.

చోళభూపతి సంతసించి "వత్సా! నిన్ను చూచినప్పటినుండియు నదేమో, నీపై నాకపారప్రేమ యుద్భవించుచున్నది. నా దేశమున కొంత భాగమునకు నిన్ను ప్రతినిధినిగావింతు, నాకు మారుగా నారాజ్య భాగమును పాలించుచు, నాకు సామంతుడవై, విశ్వాస పాత్రుడవై యుండుము." అని వచించి కొంత రాజ్యము నాతని కొసంగెను. నీలుడు చోళభూపతికి నమస్కరించి. ఆతడొసంగిన అనర్ఘరత్నాభరణాంబరా దుల గ్రహించి, తద్రాజ్యంబునకు పట్టాభిషేకము కావించుకొని, దానిని పాలించుచు సుఖంబుండెను.

చోళదేశమునందొక గ్రామాంతరమున నొక దివ్య కాసారము కలదు. దేవతాస్త్రీలనేకులువచ్చి ఆమహాహ్రదమున జలక్రీడలాడి, తమతమలోకముల కేగుచుందురు. ఇట్లుండనొక నాడప్సరసలు కొందరు వచ్చి ఆ సరస్సున జలవిహార మొనర్చి తిరిగిపోయిరి. వారిలో నొక దివ్యకన్య వారితో వెడలిపోక తత్కాలమున నిలిచియుండెను. ఒక వైద్యుడా త్రోవనేగుచు, నందాలరాశియగు నాకన్నియం జూచి, అమ్మా! నీవెవ్వరు? ఈ కొలను సమీపమున నొంటరిగా నుండుటకు కతంబెద్ది? అని అడిగెను. ఆ వాక్యములాలించి, ఆబాల "అయ్యా! నేనొక దివ్యకన్యను. నాతోవచ్చిన వారెల్లరు నన్ను విడనాడి చనిరి

వారిననుగమింపలేక యొంటరిగా చిక్కిన నాకు, దైవమువలె మీరు కన్పించితిరి. మీ వెంట వచ్చెద ననుగ్రహింపుడు" అని వేడుకొనెను. ఆతడనపత్యుడు. ఆమె ముద్దుమాటలకు, సౌందర్యవిశేషములకు సంత సించి "అహా! బిడ్డలులేని నాకు దైవమే యీ బిడ్డనొసంగె'నని సంత సించి, ఆమెను తీసికొని స్వగృహంబునకేగి, జరిగినదంతయు భార్యకు చెప్పి బిడ్డ నప్పగించెను. ఆ పిల్ల వచ్చునప్పుడామె కుడిచేతియందు కుముదమొండు భాసించుచుండెను. దానికనురూపముగా వారా బిడ్డకు "కుముదవల్లి"యను నామకరణ మొనరించి, అల్లారుముద్దుగా పెంచు చుండిరి. ఆమెకు యుక్తవయస్సు వచ్చెను. ఆమెరూపరేఖా సౌంద ర్యాదులు వీక్షించి "యీ పిల్ల నెవ్వరికిచ్చి పెండ్లిచేయవలయునా" యని తల్లిదండ్రులు విచారించుచుండిరి.

ఆ కుముదవల్లి విశేష సౌందర్యవిలాస విభ్రమ హేలాబిబ్బోక ములు నీలుని చెవినిబడినవి. ఆతడు తన మంత్రి పురోహిత రక్షకభటు లతో నా వైద్యుని యింటికేగెను. వైద్యుడాతని పూజించి సము చితాసనాసీనులగావించెను. అపుడు నీలుడు "భిషగ్వరా! నీకొక కొమ రితయున్నదనివిని ఆమెను వివాహమాడ నిశ్చయించికొనివచ్చితిమి. నీకేమి కావలయునో కోరుకొని, ఆకన్నియనాకిమ్ము. వైద్యుడు సంత సించి, కుమార్తె నలంకరించి, నీలునకు చూపించి, "ఆర్యా! నిన్నీకన్నియ వరించినచో, నామెను నీకిచ్చి కల్యాణమొనరింతు"నని తెల్పెను. అపుడు నీలుడామెతో "నన్ను భర్తగా వరించుటకు నీకేమైన సందే హమా?"యని కుముదవల్లి నడిగెను.

అందులకామె "మహాపురుషా! నన్ను వివాహమాడవలయునన్న నాకున్న నియములు పాటింపవలె" పంచసంస్కారసంపన్నుడై, అర్థపం చక జ్ఞానమున్నవానినిగాని నేను వివాహమాడజాలను, నా భర్త ప్రతిదినము వేయిన్నూటపదియారుమంది భాగవతులకు షడ్రసోపేత

భోజనము పెట్టి వారిని సత్కరింపవలయు. వారి శ్రీపాదతీర్థమును గ్రోలవలయు అట్టివానినే నేను వరింతు''నని వివరించెను.

పరకాలుడన్నింటి కంగీకరించి, యొక్క భాగవతోత్తముని యొద్ద పంచసంస్కారములు పొంది, అర్థపంచకజ్ఞానమును గ్రహించి, వచ్చి ఆమెను వివాహమాడెను. అత్తమామల కపారధన మొసంగి, భార్యతో స్వగ్రామమున కేగెను. శుభలగ్నంబున గృహప్రవేశ మొనర్చి భాగవతారాధన మొనర్చుట కుపక్రమించెను. ఆవార్తనువిని దేశ దేశ ములనుండి వైష్ణవోత్తములు, తండోప తండములుగా పరకాలుని యింటికి వచ్చిచేరుచుండిరి. వచ్చిన భాగవతులనెల్ల పూజించి, వారికి షడ్రసోపేత భోజనములు పెట్టుచుండెను. శాల్యన్నములు, ముద్గసూప ములు, హైయ్యంగవీనంబు, ఊరుగాయలు, కమ్మనికూరలు, దివ్యమై పరిమళోపేతమైనపుళి, జీరమరిచికామిశ్రిత సూపయుక్తచోష్యంబులు దధి, లికుచరసలవణయుక్తతక్రము, అతిరసంబులు లడ్డుకంబులు మోద కములు మొదలగువానితో వచ్చినవారికి తృప్తిగా భోజనములు పెట్టి తదుపరి చందనతాంబూల నూత్నవస్త్రములతో పూజించి, వారి శ్రీపాదతీర్థంబులు గ్రోలుచు ద్వితీయాద్వితీయుండైయుండె.

ఇట్లు కొంతకాలము గడచెను. ఈర్ష్యాళువులగు కొందరు చోళ భూమీశుని యొద్దకుబోయి, "మహారాజా! రాజధనమునంతయును పర కాలుడు భాగవతసమారాధనకై వెచ్చించుచున్నాడు. మీకు చెల్లింప వలసిన ధనమొక్క చిల్లిగవ్వయేని నిపుడాతని యొద్దలేదు. మీరు వెం టనే ప్రతిహారినంపినచో ధనమున్నదియు లేనిదియు మీకే తెల్లము కాగలదు." అని విన్నవించిరి.

ఆ మాటలువిని చోళరాజాగ్రహించెను. వెంటనే సేవకుల బిలి పించి "మీరుపోయి, పరకాలుడు మనకీయవలసిన కప్పమును తీసికొని రండు. ఆతడు చెల్లింపనొల్లక యెదురాడినచో, నాతని వచోధోరణి

మాకు తెలియజేయుడు" అని ఆజ్ఞాపించిపంపించెను. వారు పరకాలుని
యొద్దకేగి రాజు తెల్పిన విషయమును తెలిపిరి. ఆ మాటవిని పరకాలుడు
నవ్వుచు, వారితో "నయ్యలారా! నేను చోళభూపాలుని కప్పమును
సాంతము చెల్లించెద. ప్రస్తుతము వలసినంత ధనము చేతలేదు. నేడో,
రేపో, ధనము రాగానే మీ కొప్పగించెద" నని తెల్పి వారిని త్రిప్పు
చుండెను. వారు తిరిగి తిరిగి పరకాలుని నుండి సుంతయు రాబట్టజాలక,
విసిగివేసారి చోళపాలకునియొద్దకుబోయి జరిగినదంతయు మనవి చేసి
కొనిరి.

ఆ వాక్యములువిని భూమీశుడు "కార్యము మించిపోయినది.
ఈతడు చాల మొండిగా మారినాడు. ఏమి చేయుటయాయని చింతించి
సైన్యాధ్యక్షుని పిలిపించి, "ఓయీ! నీవు మన అఖండ సైన్యములతో
పరకాలుడేలు సీమ కేగుము. ఆతడు మనకీయవలసిన కప్పము నొప్పింపు
మని అడిగి గైకొనిరమ్ము. ఆతడు ధనమిచ్చుటకు నిరాకరించినచో
నిర్బంధించియైన, తీవ్రదండనకు గురిచేసియైన ధనమును రాబట్టుకొని
రమ్ము-పొమ్ము" అని పంపించెను.

ఆ సేనాని చతురంగబల సమేతుడై పరకాలుని పట్టణమును
చుట్టుముట్టెను. "కట్టవలసిన కప్పమును కట్టనిచో నిన్ను బంధించి కొం
పోయి మా రాజుముందు ఖైదీగా నిలిపెద నని పరకాలునకు వర్తమాన
మంపెను. ఆ మాటలువిన్న పరకాలుడు నిజముగా పరకాలుడయ్యెను.
తన సేనానిని సైన్యసమేతముగా చోళరాజ సైన్యము పైకి యుద్ధమునకు
పంపెను. చోళ సైన్యములకును పరకాలుని సైన్యములకును పెద్ద పోరు
సంభవించెను. పరకాలుని సైన్య ధాటికి తాళజాలక చోళరాజ సైన్య
ములు పలాయనము చిత్తగించెను. చోళ సేనాధిపతి చేయునదిలేక
వెనుదిరిగిపోయి జరిగినదంతయును రాజునకు విన్నవించెను. ఆ మాటలు
విన్న చోళభూమీశ్వరుడు దండతాడిత భుజగమై మండిపడెను. ఇక

ఆ రాజ్యమునందు నీలుని కొనసాగనీయరాదని నిశ్చయించుకొనెను. మంత్రులతో చింతించి, మూలబలములతో చతురంగబలములతో స్వయముగా తాను కయ్యమునకు కదలిపోయెను. చోళభూపతి దండయాత్రకు వచ్చుచున్నాడని పరకాలుని వేగులు వార్త తెచ్చిరి. పరకాలుడును సర్వసన్నద్ధుడై చతురంగబలములతో చోళరాజునెదురించెను. ఘోర సంకుల సంగామము చెల్లెను. గజబలము గజబలము రౌతులు రౌతులతోడను, పదాతి సైన్యము పదాతి సైన్యముతోడను తలపడెను. పోరు ఘోరమయ్యెను. రణావనినుండి లేచినధూళి గగనమునుకప్పెను. అంధకారమావరించెను. వీరు పరభటులనియు, వీరు స్వవీరులనియు తెలియుట కష్టమయ్యెను. దేవాసుర సంగ్రామము ధేవ, వీరవానర, రాక్షసయుద్ధము భాతి, భారత సంగరమువోలె కదనరంగ మతి భయంకరముగనుండెను. వీరులనేకులు నేల కొరగుచుండిరి. రక్తప్రవాహములు గోచరించెను. భూతప్రేత పిశాచములు సంచరింపదొడంగెను. కొంతవడికి చోళభూపతి సైన్య మెక్కువగా హతమయ్యెను.

చోళభూపతియు, పరకాలుడును తీవ్రముగా పోరాడుచుండిరి. తన సైన్యమధికముగా హతమగుటను వీక్షించి చోళుడు తన మనంబున "ఈ నీలుడు సామాన్యుడుకాడు. నేనిచ్చిన కొలది రాజ్యముతో నపార సేనాపరివారమును కూర్చికొనినాడు. ఈతని సైన్యమునకు నాల్గురెట్టులున్న నా సైన్యమోటమిని భజంపవలసివచ్చుచున్నది. ఇట్లే యింక కొంతకాలము పోరు కొనసాగించినచో నా సైన్యమంతయు నశించును. పరబలము చెక్కుచెదరకయున్నది. కొలది సేపటిలో జయలక్ష్మి నాతని వరించుట తథ్యము. అపుడాతడు నా రాజ్యమునుగూడ ఆక్రమించుకొనగలడు. దైవకృప పూర్తిగా నాతని వెన్నంటియున్నది. కాలము దురతిక్రమము" అని ఆలోచించి ధర్మధార పట్టించి యుద్ధము నాపించెను. తదుపరి, పరకాలుని పిలిపించి, ఆతనితో "నీలా! నీవు నా సన్నిధికి వచ్చినపుడు, నిన్ను చూచిన మాత్రముననే నీకు కొంతరాజ

మిచ్చితిని. నీ గుణగణములుగాని, కులవంశాదులుగాని విచారించినవాడనుగాను. నేను సత్కరించినదానికి మారుగా నీవు నన్నీవిధి సత్కరించితివి. ఇది కృతజ్ఞతయా? ఇది సజ్జనమార్గమా? నీవు దౌర్జనమునకు రావచ్చునా? యని ప్రశ్నించెను.

అందులకు పరకాలుడు "ప్రభూ! నేను కృతఘ్నుడనుకాను. నీ మేలు మరువజాల. అవ్యాజకరుణచే నాకు రాజ్యప్రదాన మొసర్చితివి. నీ ఋణభారము జన్మజన్మములకైన తీరగలదా? ఐనను మీ ధనముతో ద్యూతాది పాపకృత్యము లాచరించినవాడకాను. మాంసమద్యములతో మత్తెక్కలేదు. దుండగుల పోషింపనైతి. మీ ధనముతో నిరంతర భాగవత కైంకర్య మాచరించితి. భగవద్భాగవతారాధన మెంత ఫలప్రదమో మీ రెరుంగనిదియా? మీ ధనముతో మీ ప్రతినిధినైన నేను చేయుచున్న సత్కార్య ఫలము మిమ్ము చెందదా? మీ సేనాని సైన్య సమేతముగా వచ్చి నన్ను నిర్బంధించిన కతమునను, మీరు మహాబలయుతులై చుట్టుముట్టిన హేతువునను, అన్యమార్గములేక మీతో తలపడితినేగాని, మనస్ఫూర్తిగాకాదు, ఇప్పటికిని మించిపోయినదిలేదు. రెండు మూడు దినములలో మీ ధనమును భద్రముగా మీ సన్నిధికి చేర్తు"నని వాక్రుచ్చెను.

చోళరాజు సంతసించి, ధనము సేకరించి తెచ్చుటకు కొంత సేనతో సేనానినచ్చట నిలిపి, మిగిలిన సైన్యములతో తాను నిజ రాజధానికి వెడలిపోయెను. సేనాపతి నిత్యజాగరూకుడై మా ధనము నెప్పుడిత్తువో తెల్పుమనుచు, పరకాలుని భవనమును వీడక వేచియుండిరి. పరకాలుని యొద్ద ధనములేదు. చేత పైసలేదు. ఏమి చేయవలయునురా వరదా, యని దైవమును తలంచుకొని పరకాలుడా రేయి నిద్రించెను.

అతని స్వప్నమున కాంచీపురాధీశుండగు వరదరాజస్వామి సాక్షాత్కరించి "వత్సా! దిగులుచెందకు. నీవు వెంటనే కంచికి బయలు

దేరమ్ము. అచ్చట వేగవతీ ద్వీపవతీ తీరమొన నొక నిధి యున్నది. దానిని త్రవ్వి తీసి చోళునకీయవలసినదాని నర్పింపవచ్చును.'' అని ఆదేశించి అంతర్హితుండయ్యెను.

పరకాలుడు హరిస్మరణం బాచరించుచు లేచి, చోళ సేనాపతిం బిలిపించి ''మీ కొసంగుటకు ధనమిచ్చట నేమియు లేదు. సత్యవ్రత క్షేత్రమునందు నాకు కొంత ధనమున్నది. నావెంట వచ్చిన మీ ధనమచ్చట నీ కిప్పించెద''నని పలికెను. ఆ మాటలకాతడు సందేహించి, ఆ వార్త చోళరాజునకు తెలియజేసెను. పరకాలుని వెంటపోయిరావలసినదిగా. చోళభూపాలుడాజ్ఞనంపించెను. సైన్యాధిపతి పరకాలుని వెంట బయలుదేరెను. పరకాలుడు కంచికిపోయి దేవరాజస్వామి చెప్పిన ప్రకారము వేగవతీనదీతీరమున త్రవ్వెను. అచ్చట నేమియు గోచరింపలేదు. ''ఏమీ సర్వేశ్వరుడిట్లు చేసెను? మోసగింపవలసిన అవసరము నా తండ్రికేమి కల్గినది? అని విచారించుచు ఆ రేయి నిద్రించెను. స్వప్నమున సర్వేశ్వరుడు గోచరించి ''నాయనా! నేను చెప్పిన గుర్తులను తప్పితివి. అందువలన గోచరింపలేదు. కావున మరల చెప్పుచుంటిని. ఈ గుర్తుల ప్రకారము త్రవ్విచూడుము'' అని గుర్తులను స్పష్టముగా వచించి, అదృశ్యుండయ్యెను.

పరకాలుడు నిద్రలేచి, సర్వేశ్వరనామజపంబు చేయుచు, గుర్తుల ప్రకారము త్రవ్వించెను. అచ్చట అపారమగు హిరణ్మయ నిధి కన్పించెను. పరకాలుడక్కజంపడి, చోళరాజునకీయవలసిన ధనమునంతయునిచ్చి, తత్సేనానిని పంపివైచెను. చోళరాజ సేనాపతి, ఆ ధనమును గ్రహించి, రాజసన్నిధికిపోయి, ధనమునంతయు సమర్పించి, పరకాలుడు ధనమును సంపాదించిన విషయమంతయు విన్నవించెను. ఏతద్వృత్తాంతమునువిని, చోళభూపతి ఆశ్చర్యరసావేశనిమగ్నుండై ''పరకాలుడు సామాన్య మానవుడు కాడు. భగవదంశసంభూతుండు కానిచో

వరదరాజిల్లేల స్వప్నమున గోచరించి నిధి నర్పించును?" అని తలంచి, ఆ ధనమును భద్రపరచి, భాగవతులకై తద్ధనమును వినియోగించు చుండెను.

పరకాలుడు చోళుని ఋణము తీర్చి, యింటికి తిరిగివచ్చి తన సన్నిహితుల పిలిపించి "వత్సలారా! ఇంతదనుక నీ చోళుని ధనముతో భాగవతారాధన మొసరించితిమి. దానివల్ల మిక్కిలి బాధవాటిల్లినది. ఇట్టి పాపిష్ఠుడైన రాజుయొక్క ధనము భాగవతారాధనకుపయోగింప రాదు. మరియొక మార్గము నాలోచించితిని. పశ్యతోహార వృత్తి (దొంగతనము) నవలంబింతము. తద్ద్రవ్యముచే భాగవతపూజసేయుట యుత్తమమని తోచుచున్నది. దొంగతనము మంచికాదని యెంతు రేమో? భగవద్భాగవతాచార్య కైంకర్యములకై ధనమునేవిధముగా నార్జించినను దోషములేదు. భగవదర్చన విశేషధర్మము మిగిలినవి సామాన్యధర్మములు. విశేష సామాన్యములకు విరోధములేనప్పుడు రెండింటిని ఆచరింపవచ్చును. విరోధించినచో సామాన్య ధర్మమునువిడి విశేషధర్మము నాచరింపవలెను. భాగవత కైంకర్యము మానరాదు. దానికైయేమి చేసినను తప్పులేదు. చోళరాజొసంగిన రాజ్యమును మరల వానికే యిచ్చివేసెదను. మనము త్రోవలుకాచి, చౌర్యముచే సంపాదించిన ధనముతో మన కార్యము నిర్వర్తించుకొనవలయును. దీనికి మీరేమందురు?" అని ప్రశ్నించెను

ఆ ఆలోచనమునకందరు నంగీకరించిరి. అంత వారందరు గ్రామములువీడి, అరణ్యములందు నివసించుచు, దొంగతనములు చేయుచు, దానితో భాగవతకైంకర్య మొనర్చుచుండిరి. ఒకానొక రాత్రి యొకానొక గృహస్థునింటిముందుగల కాకర చెట్టుక్రింద పరకాలుడు దాగియుండెను. ఆ గృహస్థు భోజనము చేసెను. ఆతడు భుజించిన వెండి పళ్ళెమున కడుగుటకై ఆ గృహిణి బైటకువచ్చి పాత్ర శోధనము చేయుచుండెను. పరకాలుడాపాత్ర నొడిసిలాగెను. ఆ గృహిణి వెంటనే

"అస్మద్గురుభ్యోనమః" అని వచించి, పాత్రను విడిచి, లోనికిపోయెను. ఆమె వాలకమును చూచి భర్త "దేవీ నీవేదియో భయపడినట్లు న్నావు!" అని ప్రశ్నించెను. అందులకామె "స్వామీ! మీరు భుజించిన పాత్రను బయటకు కొనిపోయి శుద్ధిచేయుచుంటిని. ఎవడో మహా భయంకరుడు నా చేతిలోని పాత్రను లాగుకొనిపోయెను." అని పల్కెను. అందులకా గృహమేధి "దేవీ! ఈనాడెంతటి సుదినము? మనము ధన్యులమైతిమి. తిరుమంగై ఆళ్వారు భాగవతారాధనమునకై కంటికినిద్ర కాలికి సుఖములేక చోరవృత్తితో సంచరించుచున్నాడు. మన గిన్నెనిప్పుడాతడే లాగియుండును. అది యట్టిదే యైన మన ద్రవ్యము భాగవత కైంకర్యమునకై వినియోగింపబడును. మనకా నిత్య విభూతియందు ప్రవేశార్హత లభించును." అని సంతోషపడుచుండెను.

ఆ సంవాదమును వినుచు నిలుచున్న పరకాలుడాపాత్ర నింటిలో పడునట్లు విసరివైచెను. అదిచూచి గృహిణి భర్తతో "ఆర్యా! ఇదిగో ఆతడీ పాత్రను విసరి లోపలవైచినాడు" అని పాత్ర చూపెను. అందులకాతడు "ప్రేయసీ! ఆపాత్రనాతడు గైకొనునప్పుడు నీవేమంటివి?" అని ప్రశ్నింప నామె "స్వామీ! నేనేమియుననలేదు. అలవాటు చొప్పున గురువందనమాచరించితిని" అనెను. అంతనాతడు భార్యను క్రోధతామ్రాక్షులతో చురుకుచురుకునచూచి "చేతికినందిన మహాఫలమును పోగొట్టితివి. నీవట్లుపలుకుటచే మనము వైష్ణవులమని తలంచినాడు. వైష్ణవుల ధనమాతడు పరిగ్రహింపడు. నీవాడిన వాక్యముచే మన మహాభాగ్యమంతయు నశించినది. కావున నిన్ను భార్యగా నంగీకరింపజాల"నని వెలుపలికినెట్టి తలుపులు మూసికొనెను. ఆ గృహిణి మిక్కిలి బాధనందుచు, అరుగుమీద కూర్చుండియుండెను. అదియంతయుచూచి పరకాలుడు వేదికపైకెక్కి తలుపుతట్టుచు గృహస్థును కేకవైచెను. గృహస్థుడు దీపమును చేతధరించి తలుపు తీసెను. ఖడ్గపాణియై ద్వారముకడ పరకాలుడు నిలిచియుండెను. గృహస్థుడాతనింజూచి

పాదములమీదపడిలేచి, "అయ్యా మాకు లభించిన మహాఫలమును నా భార్య చేజేతులపాడుచేసినది. మా ద్రవ్యమును భాగవత కైంకర్యమునకు వినియోగింపరైతిరి" అని వాపోయెను. అంత పరకాలుడాతనిం జూచి "మహాభాగా! నీ భార్య మూలమున నాకొక ప్రమాదము తప్పినది. మీవంటి వైష్ణవుల ద్రవ్యమును దొంగిలింపరాదు. దానికి సర్వేశ్వరుడు సంతోషింపడు. తన పిల్లవాని యొద్దనున్న ద్రవ్యమును తీసికొని తనకిచ్చిన నెవ్వడైన సంతసించునా? అట్లే మీ ద్రవ్యము నుపయోగించిన చక్రి సంతసింపడు. మీరు వైష్ణవులని తెలియక వచ్చితి. నీవు నీ భార్యను నిగ్రహింపక ఓదార్చుము" అని చెప్పగా నామె ఆ పరకాలుని దివ్యపదపద్మములకు సాగిలపడి మ్రొక్కి లేచి భర్తతో గూడి సుఖంబుండెను. పరకాలుడు వారినిద్దరనోదార్చి, పలువిధముల నాదరించి, వారిద్దరంగూర్చి యథేచ్ఛంజనియెను.

ఒక దినమున పరకాలుడు తన శిష్యులతో అరణ్యమధ్యమున దారికాచియుండెను. ఒక్క బాటసారియు నా మార్గమునరాడయ్యెను. అందరు నొకచోట గుమిగూడిరి. గురునింగాంచి శిష్యులు "అయ్యా! ఈ రోజు ఒక్క రాగి రూకయైన లభింపలేదు. రేపటి దినము భాగవత కైంకర్యమెట్లు నిర్వర్తింపబడును? ఏమి చేయుదము?" అని విచారపడ జొచ్చిరి. పరకాలుండును చింతాక్రాంతుండై చేయునదిలేక విచారించు చుండెను. అట్టివేళ రంగేశ్వరుడు వారినుద్ధరింపదలచి, తానే స్వయముగా వారికి ధనము నీయతలంచి, ఒక పెండ్లికుమారుని వేషమును ధరించి, శ్రీదేవిని పెండ్లికూతుంజేసి, నిత్యసూరుల బంధువులుగావించి, విష్వక్సేనుని పురోహితునిజేసి, జయవిజయులు నేత్రహస్తులుగా నొనరించి, విష్ణుపార్షదుల వాద్యకులుగా సంకల్పించి, పంచమహావాద్యములు బ్రహ్మాండభాండమునగలింప, నొక పల్యంకిక నారోహించి, బ్రహ్మరుద్రాదులా పల్లకిని మోయుచుండ ననంత ధనోపేతుండై ఆ బాటవెంటవచ్చుచుండెను. ఆ వాద్య ధ్వనినివిని, పరకాలుని శిష్యులు

గురునితో "స్వామీ! అదిగో ఒక పెండ్లిబృందమిటే వచ్చుచున్నది. వివాహబృందమాయెనా మన భాగ్యముపండినట్లే. వీరు మన విషయము తెలియక ఇటే వచ్చుచున్నారు. రానిండు" అని వారిలోవారు ముచ్చటించు కొనుచు సంతోషించుచుండిరి.

వివాహబృందము సమీపించెను. పరకాలుని శిష్యులెదురేగి "అయ్యలారా! ఈ వనములు పరకాలాధీనములని మీరెరుంగరా? తెలిసిననిటురారుగదా! మా యదృష్టవశమున వచ్చితిరి. మీయొద్దనున్న భూషణాంబర ధనాదులన్నియు నిక్కడపెట్టిపొండు లేనిచో మాయాయుధములు దర్శింపుడు. ఒక్కరినిగూడ ప్రాణములతో పోనీయము" అని ధగ ధగ మెరయు కత్తులు ఝళిపించుచు సమీపించిరి. ఆ పెండ్లివారు భటులనుజూచి నివ్వెరపడియుండిరి. పరకాలుడు భయంకరాసిని ఒరనుండి బయటకుతీసి, ఉగ్రదండధారియగు ప్రళయకాల రుద్రునివలె గోచరించుచు, పెండ్లివారిని సమీపించి "మా శిష్యులు చెప్పినమాటలు మీ చెవిదూరినట్లు కన్పింపదు. ఇప్పుడు మీరు చేసికొనివచ్చుచున్నది పెండ్లికాదు నేను పెద్ద పెండ్లిచేసెద. మీ యొద్దనున్న సమస్తమును నొక గుట్టగా వేయుడు," అని గద్దించి పలికెను. అపుడు పెండ్లికుమారునకును, పరకాలునకును ఈ క్రింది విధముగా సంభాషణ జరిగెను.

పెం. కు :- ఓయీ! దౌర్జన్యముతో నీ విధముగా దొంగిలించిన సొమ్ముతో నీవేమి చేయుచుంటివి?

పర :- నేనీ ధనముతో భాగవత కైంకర్యము చేయుచున్నాను.

పెండ్లి :- భాగవత కైంకర్యమనగానేమి?

పర :- భగవద్భక్తులను భోజనపానాదులచే సంతోషపెట్టుట.

పెండ్లి :- పిచ్చివాడా! వారికి పెట్టినందువల్ల నీకేమి ఫలము?

పర :- జన్మరాహిత్యము.

పెండ్లి :- (నవ్వి) దొంగతనముచే జన్మరాహిత్యమా?

పర :- కాదా! చక్కగా నాలోచించుకొమ్ము. దొంగిలించిన ధనముతో తన భార్యా పుత్రాదులను, తన్ను పోషించుకొన్నచో నరకప్రాప్తి తప్పదు. కాని భాగవత కైంకర్యముచే జన్మరాహిత్యము కల్గును.

పెండ్లి :- దీనికి ప్రమాణమును చూపగలవా?

పర :- ప్రమాణములనేకములున్నవి. ఒక్కదానిని వినుము.

"సిద్ధిర్భవతివానేతి సంశయోఽచ్యుత సేవినాం
న సంశయోస్తితద్భక్త పరిచర్యారతాత్మనామ్"

సర్వేశ్వరుని సేవించిన సిద్ధి కలుగవచ్చును. కలుగకపోవచ్చును. కాని భగవద్భక్తుల సేవజేసిన వారికి సిద్ధి కలుగుటయందు సందియములేదు. ఇది పెద్దల వాక్యముకాదా?

పెండ్లి :- నీ న్యాయార్జితవిత్తమున చేయదగునుగాని, దొంగతనము చేసి చేయనగునా?

పర :- చేయవచ్చును. మేఘుడు సముద్రమునుండి జలమును గ్రహించి భూమిపై వర్షించుచున్నాడు. ఆతనికి పాపము కలిగెనా? సీతాపతి దుర్మార్గులగు వారినందర దునుమాడి ఋషుల రక్షించెను. అది పాతకమందువా? కృషీవలుడు వ్యవసాయ నిమిత్తము తెలిసియో, తెలియకయో ఎన్నో జంతువుల సంహరించును. అది పాపహేతువా?

పెండ్లి :- అట్లైన దొంగతనమేల! గృహస్థులను యాచించి, వారు ఇష్టానుసారముగానిచ్చిన ధనముతో భాగవత కైంకర్యము చేయరాదా?

పర :- సత్కార్యార్థమడిగిన నొక్కడును ఒక్కరాగిరూకయు నీయడు. స్త్రీ, మద్యమాంసాదుల కొఱకెంతయైన వ్యయించును. వ్యవహారములకు, జూదములకు నెంత ధనము నైన పాడుచేయును. రాజప్రీతికి పదవులనందుట కొఱకెంతయేని ధనము నాశము చేయును. కాని భగవద్భాగవతపరముగా నొక్క రాగిపైసయు నీయజాలడు.

పెండ్లి :- ఎట్లైనను దీనివలన పాపములేదందువు. అంతియేనా?

పర - లేదు. లేదు. లేదు. నేను సామాన్యధర్మమునువీడి విశేష ధర్మము నాచరించుచుంటిని.

పెండ్లి :- విశేషధర్మమనగానేమి ? సామాన్య ధర్మమనగానెట్టిది ?

పర :- సావధానచిత్తుడవై వినుము. చెప్పుచుంటిని. భగవద్భాగవతాచార్య కైంకర్యరూపమైనదంతయును విశేష ధర్మము. మిగిలినదంతయును సామాన్యధర్మము.

పెండ్లి :- విశేషధర్మాచరణమున పాపము సంభవింపదా?

పర :- సంభవింపదు. ప్రహ్లాదుడు విశేషధర్మమాదరించి, నృసింహస్వామిచే తన తండ్రినే చంపించెను. సుగ్రీవుడు రామకార్యార్థమై స్వీయ సోదరుడగు వాలిని, రామునిచే వధింపించెను. విశ్వామిత్రుడు లోకరక్షణమునకై స్త్రీయైన తాటకిని హతమార్పించెను. వారికి పాపము సంక్రమించెనా ?

పెండ్లి :- ఇంతవఱకు నీవు చెప్పినవారిలో చంపింపబడినవారెల్లరును దుర్మార్గులు. నీవు సన్మార్గదుర్మార్గ విచక్షణ లేకుండ ప్రజల హింసించుచున్నావు.

పర :- కాదు. ధర్మము-ధర్మసూక్ష్మము అని ధర్మము రెండువిధములు. ధర్మము నెఱింగినవారెందరోగాని, ధర్మసూక్ష్మము నెఱింగిన

వారలరుదు. అది తెలియుటయు దుర్ఘటము. స్త్రీలకు భర్తృపరి చర్య ధర్మము. పర పురుష సంయోగము మహాపాతక హేతువు. ఇది ధర్మము. గోపికలు, తమతమ భర్తలను వదలి, సర్వేశ్వరుని కామించి, రమించి, మోక్షసామ్రాజ్య ప్రాప్తి నందుకొనగలిగిరి. ఇది ధర్మసూక్ష్మము. శిశుపాలాదులు నిత్యము పరమాత్మను దూషించి తరించిరి. ఏ విధముగనైనను దైవకైంకర్యముచేయుచు, భగవంతుని మనస్సునందు నిల్పియుంచుటయే ముక్తికి మార్గము. దానితో మానవులు తరింతురు. ఇదే తెలిసికొనవలసిన ధర్మసూక్ష్మము.

పెండ్లి :- అట్లైన నీవిప్పుడేమందువు?

పర :- దొంగతన మొనర్చియైన భాగవత కైంకర్యము చేయవలసినదే. ప్రసంగవశమున నీవు చాల జాగుచేసితివి. ఎన్నియుపాయములతో మీరు వాదించినను, నానుండి తప్పించుకొని పోజాలరు. త్వరగా మీ యొద్దనున్న సర్వస్వము నచ్చట బెట్టుడు.

వారు తమ యొద్దనున్న భూషణములన్నియు తీసి గుట్టవైచిరి. పరకాలుని శిష్యులా యపరిమిత ద్రవ్యమునుచూచి, సంతసించి వానిని పెట్టెలయందుసర్ది తాళములువైచి వాని నెత్తుకొని పోవుటకుద్యమించిరి. కాని ఎంత ప్రయత్నించినను పెట్టెలు కదలవయ్యెను. అది జూచి పరకాలుని శిష్యులు, పరకాలునితో "అయ్యా! ఈ పెట్టెలెంత ప్రయత్నించినను లేచుటలేదు. ఈ సమూహామునందీ పురోహితుడు మంత్రవాదిగానున్నవాడు. ఈతడేదియో తనలో తాను గొణుగుకొనుచున్నాడు. ఈతని మంత్ర ప్రభావముచే పెట్టెలు కదలుటలేదు." అని తెల్పిరి.

పరకాలుడా పురోహితునిం జేరి "ఓయీ! బ్రాహ్మణుడా! నా సంగతి నీకు బొత్తిగా తెలిసినట్లులేదు. నీ మంత్రములు నాయొద్ద పని

చేయవు. నీ తలనొక్క వ్రేటున ఖండించెద. నీ తల దెబ్బకు గగనమున కెగురగలదు. అప్పుడు నీవు గగనమధ్యమున మంత్రములుచ్చరింతువుగాక" యని కత్తి ఝుళిపించెను. అంత నాపురోహితుడు "అయ్యా! ఏదో పౌరోహిత్యముచే ప్రొద్దులుపుచ్చు మాబోంట్లపై కేల వచ్చెదవు? నేను మంత్రవాదినిగాను. ఈ పెండ్లికొమరుండు మళయాళ మంత్ర తంత్ర విదులలో నగ్రేసరుడు. ఆతని నడుగుముపొమ్ము" అనెను. పరకాలుడు పెండ్లికొమరుని సమీపించి, "మా పెట్టెలు లేవకుండ నీవే మంత్రించితివని మీ పురోహితుడు వచించుచున్నాడు. నిన్నిప్పుడే రూపుమాపెదను." అని పలికెను. పెండ్లికొమరుండు చిరునవ్వునవ్వి "పురోహితుని మాటలు నిజమనియెట్లు విశ్వసించితివి? నాకేమియు తెలియదు" అని పలుక, పెండ్లికొమరిత చిరునవ్వుతో తలవాంచి కూరుచుండెను. అదిచూచి పరకాలుడామెతో "తల్లీ భాగవత కైంకర్యమునకై మీబోటి సాధ్వీమ తల్లుల యొద్దగూడ ధనము గ్రహింపవలసివచ్చుచున్నది. నిజము తెల్పుము. ఈ పెట్టెలు లేవకుండ చేసినదెవ్వరు?" అని వినయముననడిగెను. అందులకామె "సాధుసత్తమా! పురోహితునకేమియు తెలియదు. ఈ పెండ్లికొమరుండు సామాన్యుడు కాడు. అసాధ్యుడు. అబద్ధములకాచార్యుడు. వాయువును బంధింపగలడు. నీటిపైరాలు తేలింపగలడు. పర్వతములమోవగలడు. ఆకాశమునైన బంధింపగలడు. గట్టిగా మందలింపుము. ఆతడే సర్వ విషయములు బయటపెట్టును." అని తెల్పియూరకుండెను.

పరకాలుడు చండప్రచండ తీవ్రాసిని ఝుళిపించుచు, "ఏమీ! నా యెదుటనే మాయలుపన్న సాహసించుచుంటివా?" అని సమీపించెను. అపుడు వరుండు "రమ్ము. నా దగ్గరనొక మంత్రరాజమున్నది. దానిని నీకుపదేశించెద. దాని ప్రభావమున నా పెట్టెలు మీకు సులభముగా పైకిలేవగలవు." అని పలికెను. మంత్రోపదేశమునకై పరకాలుడు పెండ్లికొడుకును సమీపించెను. పెండ్లికొడుకు పరకాలుని రెండు

చేతులను తన కుడిపాదముపై వేయించి, కుడి చెవిలో ద్వయమంత్ర మునుపదేశించుచుండెను. ఆ సమయమున పెండ్లికొమరుని కుడికాలి వ్రేలికిగల బంగరుటుంగర మొకటి పరకాలునకు కన్పించినది. దానిని నోటితోపట్టి పరకాలుడు లాగుచుండెను. ఆ వ్రేలినుండి పరకాలుని నోటిలోని కమృతము స్రవించెను. మహానందముద్భవించెను. ఆతడచ్చెరువందుచుండగా వైవాహిక బృందమంతయు నొక్కసారి యదృశ్యమయ్యెను.

పరకాలుడును, ఆతని శిష్యులును స్తంభించిపోయిరి. నిశ్చేష్టులై భూమిని కౌగిలించుకొనిరి. కొంతవడికి వారికందరకును స్మృతి వచ్చెను. ధనపు పెట్టెలన్నియు నచ్చటనే యుండెను. ఇదియంతయు వారికొక స్వప్నముగా గోచరించెను. పరకాలుడు శిష్యులజూచి "ఆర్యులారా! ఏమి యీ యాశ్చర్యము? సర్వశేషియగు జగదీశ్వరుడు జగన్మాతయగు శ్రీదేవింగూడి నిత్య సూరులతో రాగా మనము ప్రచండ ఖడ్గములతో భయపెట్టితిమి. ఎంతటి మూర్ఖులము. అయ్యో! నేను శ్రీశ్రియఃపతుల సమీపించియు పాదాభివందనము చేయనైతి. మీదుమిక్కిలి ఆదయామయుని పాదమును నానోటితో మైలపరచితి. నావంటి దుష్టుండు వేరొకండుండునా?" యని యనేకవిధముల వాపోవుచు చేయునదిలేక శిష్యులంగూడి ధనమునంతయు తీసికొనిపోయి గృహమునందుంచి, సమగ్రముగా సంవత్సరముపొడవున భాగవతకైంకర్య మొనర్చుచుండెను.

కొంతకాలము పోయిన పిదప, తీర్థయాత్రాపరుండై శిష్యులంగూడి, అనేక దివ్యదేశంబుల దర్శించుచు, ఆయా స్థలములందలి పెరుమాళ్ళకు మంగళాశాసనము చేయుచు, ద్రవిడ భాషయందారు ప్రబంధములు రచించి, లోకోద్ధరణ మొనరించుచు సంచరించుచుండెను ఇట్లు సంచరించుచు, ఒకానొక దినమున కాంచీపురమున కనతిదూర

మునగల యొక యుద్యానవనమున విశ్రమించియుండెను. ఒక వైష్ణవ
బాలకుడు చల్లని తీర్థప్రసాదములు కొనివచ్చి పరకాలునకిచ్చి,
"స్వామీ! చాల అలసియున్నారు. వీనిని స్వీకరింపు"డనియెను.. పర
కాలుడు వానిని గ్రహించి, "స్వామీ మీరెవరు? మీదేయూరు.
మీ నామధేయంబేమి? ఇంత మహోపకారముగావించిన మీకేమి
యొసంగగల'నని వచింపుచుండ నాతడు పరకాలునితో "అయ్యా!
ఈ సమీపస్థమగు కాంచీనగరము మాయూరు. నన్నష్టభుజనృసిం
హుడందురు." అని పలుకుచు నదృశ్యుండయ్యెను. పరకాలుం
డమందానంద కందళిత హృదయారవిందుండగుచు, సర్వేశ్వరకరుణ
కచ్చెరువందుచు కాంచీపురము ప్రవేశించి, అచ్చటనున్న భగవన్మూ
ర్తులకు మంగళా శాసనముచేసి, శ్రీరంగమునకు పోయెను.

తన సవతి గంగానది విష్ణుపాదోద్భవ అది యామె గర్వము.
ఆ గర్వమణగింతునని స్పర్థబూని, విష్ణువునుగూర్చి తపంబాచరించి,
సర్వేశ్వరుని తన గర్భమునందు నిలిపియుంచుకొన్నది కావేరీనది. అట్టి
మరుద్వృధానదిని దర్శించి, దానియం దవగాహనంబాచరించి, ద్వాద
శోర్ధ్వపుండ్రములను, తులసీనళినాక్షమాలికలను ధరించి, రంగధామ
మును పరకాలుడు ప్రవేశించెను. బలిపీఠముకడ తలయొగ్గెను. ధ్వజదం
డమునకు జోహారులర్పించెను. జయవిజయుల కొనియాడెను. గర్భాలయ
మును ప్రవేశించెను. అందు అనర్ఘరత్న ప్రభాభాసమానసహస్ర ఫణా
సహితుడై, కైలాససన్నిభుండై నీలాంబరధారియైయున్న శేష పర్యంక
మున, శ్రీ భూనీళాది దివ్యమహిషీ సమేతుండును, శంఖచక్రాదిదివ్యా
యుధవిరాజితుండును, చతుర్భుజభాసమానుండును, హారకేయూర
కిరీటముక్తాహార దామోదరబంధన. కటిసూత్రశింజాన మంజుమంజీర
పీతాంబరాది దివ్యభూషణ భూషితుండును, కౌస్తుభాలంకార భాసుర
దివ్యకంధరుండును, శ్రీవత్సాంకితవక్షస్స్థలుండును, గంభీరాంభః
సముద్భూత సహస్రకర, వికసిత పుండరీకనయనుండును, కోటిసూర్య

ప్రకాశమానుండును, చేతనాభి ముఖ్య నిరీక్షణుండును నై శయనించి యున్న రంగధాముని కన్నులారఁగాంచెను. రంగేశ్వరుని సర్వావయంబులకు మంగళాచరణము చేసెను. స్వామికి ప్రక్రమం బొనరించెను. భార్యా సహితుండై శిష్యులు తన్ను సేవింప, శ్రీరంగమునే వాసస్థలముగా చేసికొని యందు నివసించియుండెను.

ఒకనాడు శిష్యులనందర కూర్చుండబెట్టుకొని పరకాలుడు వారితో "వత్సలారా! యీ రంగనాథుని చరిత్రము చెప్పెదను వినుఁడు. కృతయుగమున వైవస్వతమనువు కలడు. అతని కుమారు డిక్ష్వాకు మహారాజు. అతడీయఖండ భూమండలము నేకచ్ఛత్రాధిపత్యముగా పరిపాలించెను. అతడొక దినమున బ్రహ్మలోకమున కేగెను. అచ్చట సర్వదేవతాసార్వభౌముండై, దేవర్షిసేవితుండై, సరస్వతీ సావిత్రీ సహితుండై తామరగద్దెపై వేంచేసి బ్రహ్మదేవుండు పెద్ద కొలువుండెను. ఇక్ష్వాకుడనేక విధమ్ముల విథిని పూజించి, సేవించెను. విరించి సంతసించెను. "రాజా నీకేమి వరము కావలెనో కోరుమని యానతిచ్చెను.

అంత నా ఇక్ష్వాకుమహారాజు బ్రహ్మనుజూచి "స్వామీ! నేను నిత్యార్చన మొనరించుకొనుటకై దైవ విగ్రహంబొకటి దయ చేయుఁడు" అని వేడుకొనెను. అంత బ్రహ్మ ఇక్ష్వాకుతో "రాజా! నేను ప్రతిదినము నర్చించుచున్న రంగనాధస్వామిని నీకిచ్చెద తీసికొని పోయి అర్చించి, నాయర్చన సమయమునకు మరల నాకు పంపించుము" అని యొసంగిన అతడమందానందముతో ఆ రంగపీఠమును తీసికొని వచ్చి అయోధ్యా నగరమున ప్రతిష్ఠించి అర్చించుచుండెను. అతని తదనంతర మా వంశీయులగు రాజులందరును క్రమముగా పూజించుచు వచ్చిరి. ఆ ఆచారము శ్రీరామచంద్రుని కాలము వఱకునట్లే కొనసాగెను.

రామావతార సమాప్తి కాలమున, వానరాదుల కందఱకును, మోక్షాధికార మొసంగుచు, రాముడు విభీషణునితో "విభీషణా! నీవు చిరకాలజీవివి కావున నీవు నా వెంటవచ్చుటకు వీలుకాదు. నాకు మారుగా నీ రంగపీఠమును తీసికొనిపోయి భక్తిశ్రద్ధలతో నిత్యమును పూజించుచుండుము. ఈ పీఠమును లంకానగరమునకు పోవువఱకు మధ్యే మార్గమున నెచ్చటను దింపవలదు." అని చెప్పి యొసంగెను.

విభీషణుఁడు రంగపీఠమును శీర్షమున ధరించి, లంకాభిముఖుడై చనుచుండెను. అదే సమయమున కావేరి గంగతో మత్సరించి, శ్రీ మహావిష్ణువుంగూర్చి తపస్సాచరించుచుండెను. విభీషణుడా కావేరీ మధ్యభాగమునకు పోవుసరికి, ఆతడు త్వరగా మూత్ర విసర్జనము చేయ వలసివచ్చెను. పీఠమును క్రిందకు దింపరాదు. శరీరబాధనపనయింపక నిలువరాదు. ఏమి చేయవలయునాయని విచారించుచుండగా నొక వైష్ణవ బాలకుండచ్చోట కానవచ్చెను. విభీషణుండా బాలకునిగాంచి సంతసించి, "అయ్యా! ఇదిగో! యీ పీఠమును కొంచెము సేపు వహించుకొనియుండుము. లఘుశంకకు పోయివచ్చి మరల తీసికొందు" నని యర్థించెను. అందులకా బాలుడు "ఓయీ నీ వెంత సేపటికి వత్తువో నీవు త్వరగా రావలె. నేను మూడు కేకలు వైచెదను. ఆలోగా వచ్చితివా సరియే లేనిచో నీ స్వామినిచ్చట దించిపోవుదు"నని బదులు పల్కి రంగపీఠమును గ్రహించెను. విభీషణుడు మూత్రవిసర్జనము చేయుచుండ తద్బాలకుడు మొదటి కేక వైచెను. మధ్యమందొక కేక వైచెను. లేవబోవుసరికి మూడవ కేక వైచి, స్వామి నచ్చటదింపి వెడలిపోయెను. విభీషణుడు హస్తపాదములు ప్రక్షాళించుకొని ఆచమించి వచ్చి స్వామిని లేపబోయెను. స్వామి కదలలేదు. అపుడు స్వామిని దలంచి, విభీషణుండనేక విధముల విలపింప, స్వామి గోచరించి, "వత్సా! నేనిచ్చటినుండిరాను. శ్రీ రాముడు నీ కొసంగునపుడు వచించినదిదియేకదా! ఇచ్చటనేయుండి నీ లంకను కటా

క్షించుచుండెద. ఇచ్చట నాకొక ఆలయమును నిర్మింపుము” అని ఆదేశించి అంతర్హితుండయ్యెను.

విభీషణుడు చింతాక్రాంతుడై చేయునదిలేక, లంకకేగి, శిల్పులను తీసికొనివచ్చి మనోహరమగునాలయమును నిర్మించెను. అందు రంగనాథుని ప్రతిష్ఠించి వెడలిపోయెను. అప్పటినుండియు నీ ఆలయమిట్లే యున్నది. దీనిని మనము వృద్ధిపరుపవలయు. దీనికొక యుపాయమాలోచింపుడు” అని వర్ణించి చెప్పెను. ఆ మాటలాలకించి వారు గురునితో “ఆర్యా! మీకట్టి సంకల్పమున్నచో యత్నింపుడు. మనకు దైవమొసంగిన ప్రసాదము చౌర్యవృత్తి యున్నదికదా! దానిచేతనే రంగేశ్వరాలయము వృద్ధి చేయుదము.” అని పలికిరి. పరకాలుడు సంతసించి, వారితో “శిష్యులారా! మనము చాలకాలమునుండియు ఊళ్లు కొల్లగొట్టితిమి. గ్రామములు బీదరికము ననుభవించుచున్నవి. ఇప్పుడు గ్రామములను దోచుకొనుట పాడికాదు. గ్రామములలో మనకిప్పుడేమియు లభింపదుకూడ. మన కార్యము మహత్తరమైనది. దీనినెట్లు సాధింతుము?” అని పలికెను.

శిష్యులు పరకాలునితో “మహాత్మా! అవధరింపుడు. నాగపత్తనమునందు బౌద్ధులు వారిగురుని బింబమును బంగారముతో చేయించి, ఆలయమును కట్టించి దానియందు ప్రతిష్ఠించిరి. అది ఆరడుగుల స్వర్ణవిగ్రహము. దానిని తెచ్చితిమా, మన పని పూర్తికాగలదు” అని పలికిరి. వెంటనే బయలుదేరి గురుశిష్యులు నాగపట్టణమునకుపోయి దేవళమును చూచిరి. అది అభేద్యముగా నుండెను. ఆలయమును ప్రవేశించుటకే అవకాశము లేకయుండెను. పై భాగమున పదనుగల రెండు చక్రములు సవ్యాపసవ్యములుగ తిరుగుచుండెను. అవి దేవాలయముపై దగ్గరగాబోవు పక్షులనైన ఆకర్షించి, ముక్కలు ముక్కలుగా నరకుచుండెను. అదిచూచి గురుశిష్యులు విస్మయావిష్టులైరి. దీనిని ఛేదిం

చుటకు సూత్రమెచ్చటనున్నదాయని సూక్ష్మముగ విచారించి కను గొనజాలకపోయిరి.

అపుడు గురుండు శిష్యులంజూచి "ఛాత్రులారా! నేను వచ్చు నందాక పగటిపూట గ్రామములందొంటరిగా సంచరించుచు, రాత్రు లందొకచో జేరుచు, మాధుకరముచే పొట్టనింపుకొనుచుండుడు!" అని పలికి, ఆ బౌద్ధాలయమును నిర్మించిన శిల్పి వేపమాన ద్వీపమున నున్నాడని తెలిసికొని ఆ గ్రామమున కేగెను. తానొక కార్తాంతికుని వేషమును ధరించి, పరకాలుడు "భూత భవిష్యద్వర్తమానములనన్నిం టిని చక్కగా తెలియజేయుచుండెను. జనులు తండోపతండములుగ వచ్చి తమజాతకములను చూపించుకొని, యిట్టి మహనీయుడింతకు ముందీ ప్రాంతములకు రాలేదని, వేనోళ్ళకొనియాడుచుండిరి. నాగపట్ట ణాలయ శిల్పి చనుదెంచి, తన జాతకమును చూడమని పరకాలుని కోరెను. పరకాలుడు సంతోషముతో నాతని జాతకచక్రమును పరిశీ లించి "ఓ శిల్పిచంద్రమా! నీవంటి శిల్పినెందును చూచినవాడగాను. మహా ప్రజ్ఞాశాలివి. శతాధికాలయ నిర్మాణము కావించితివి. నాగపట్ట ణమునందొక బౌద్ధాలయము నిర్మించితివికదా?" యని ప్రశ్నింప, శిల్పి యౌనని సమాధానమొసంగెను. వెంటనే పరకాలుడు "ఆ నాగపట్ట ణమునందలి స్వర్ణ విగ్రహమును దొంగలెత్తుకొని పోయిరట" అని వచించెను. ఆ మాటలకు శిల్పి నివ్వెరపొంది, కొంతసేపు స్తంభించి పోయెను. తదుపరి పరకాలుంజూచి "అయ్యా! ఇచ్చట అరటితోటలు మెండు ఈ భూమి వాని కనుకూలముగానున్నది. నేనా దేవాయతన మునకు చేసిన పని గొప్పది. మానవులాలయమున ప్రవేశించుటకు వీలు గాకుండ చేసితి. పైన రెండు వాడిచక్రములు సవ్యాపసవ్యములుగా భ్రమించునట్లు గావించితిని. అంత యద్భుతముగా రచించినను, దానికి విరుద్ధమొకటున్నది. దాని సమీపమునందరటి తోటలు వేయవలదని చెప్పితిని. వారు ఆ పని చేసిరేమో?" అని విచారించెను. పరకాలు

డందుకొని "అదియేమో నాకు తెలియదు. ప్రజలు గగ్గోలుగా చెప్పుకొనుచున్నారు" అని పలుక శిల్పి విచారగ్రస్తుడై గృహమున కేగెను.

పరకాలుడు కార్యము పూర్తియైనట్లానందించుచు, తిరిగి నాగపట్టణమునకు వచ్చెను. గురుశిష్యులందరు కలిసిరి. గురుడు శిష్యులతో, "నీరాత్రి సమీపమునందలి అరటితోటలను నరికికొనిరండు" అని ఆజ్ఞాపించెను. మైలుదూరము లోపల నరటితోట లెచ్చటనులేవు. వారచ్చటికిపోయి, రంభాస్తంభముల నరికి మోపులు వైచుకొని తెచ్చిపడవైచుచుండిరి. పరకాలుడా అరటి బోదెలను తిరుగుచున్న చక్రముల పైకి విసరుచుండెను. ఆ చక్రములు రెండును అరటిచెట్లను నరికి నరికి, ఆ పీచు చుట్టుకొని ఆగిపోయినవి. వారందఱును ఆలయ పైభాగమునకుపోయి, ఆ చక్రములు రెండింటిని పెకలించివైచిరి. ఆలయపు పైభాగమున క్రంత చాల సన్నముగనుండెను. స్థూలాకాయులందు పట్టలేదు. పరకాలుని భాగినేయుండొకండందుగలడు. వాడు చాలసన్నని వాడు. ఆతడా ద్వారముగుండ లోనికి దిగెను. ఆ విగ్రహము మిక్కిలి వేడిగానుండి సమీపించుటకు వీలుగాక యుండెను. అంతలోపలనుండి ఆతడు తన మేనమామయగు పరకాలునితో "మామా! విగ్రహమును సమీపించుటకు వీలులేకుండ సెగ కొట్టుచున్నది". అని పలికెను.

పరకాలుడు మేనల్లునిగాంచి, "వత్సా! విగ్రహమునకు పునశ్చరణ చేసిరి కాబోలు. అదియే వేడిమికి కారణము. మూత్రము నెడమ చేతిలో పోసికొని విగ్రహమునకు కొట్టుము. ఆ సెగ తగ్గిపోవు" నని చెప్పెను. ఆతడట్లే చేసెను. అపవిత్రదోషకలన విగ్రహము శాంతించెను. విగ్రహమును గండ్రగొడ్డలితో ముక్కలు ముక్కలుగా నరికి, పైకి అందించెను. సమగ్రముగా విగ్రహమునంతయు పైకి నందించి, తాను వచ్చుటకు యత్నించెను. ఇంత ద్రవ్యమును రంగకైంకర్యమునకు కూర్చితిని గదా యను నానందముతో నాతని దేహముబ్బినది.

కావున నా రంధ్రమునందు పట్టకపోయెను. శిష్యులా సువర్ణమును జాగ్రత్తగా పెట్టెలలో భద్రపరచుచుండిరి. పరకాలుడు మేనల్లునిజూచి "వత్సా ! ఇప్పటి కార్యమెట్లు ?" లని ప్రశించెను.

అంపుల కాతడు పరకాలునితో, మాతులా ! నే నీ రంధ్రము నుండి దైవశక్తితో లోనికి దిగితిని. కార్యసాఫల్యమైనది. నేను పైకి రాజాలను. తెల్లవారి నేనీ గ్రామస్థులకు పట్టుబడినచో నీవును చిక్కినట్లే. ఈనగచి నక్కలపాలు గావించినట్లు కార్యమంతయు విఘ్నమగును. రంగేశ్వర కైంకర్యమున కాటంకము కల్గును. కావున బంధుప్రీతిని విడిచి వా కంఠమును ఛేదించుకొని పొమ్ము" అని హితవు చెప్పెను. పరకాలుడు కరాళ ఖడ్గముతో మేనల్లుని తల ఖండించి, దాని నొక పేటికయందు భద్రపరచి, సువర్ణమయమందసముల నన్నింటినింగొని పయనమైరి.

వారిట్లు కొంతదూరము నడచి, యొకగ్రామ సమీపమునకు చేరిరి. ఇంతలో తెల్లవారెను. పరకాలుడా పెట్టెలనన్నింటి నొక చేనిలో పాతిపెట్టించి, శిష్యులంగాంచి, మీరీ పవతెల్ల నచ్చటచ్చట సంచరించి, ప్రొద్దుపోయిన తదుపరి రండు. నే నొక శిష్యునింగూడి యిచ్చట నుండెదనని తెలిపెను.

శిష్యులందరును ఎవరిత్రోవ వారేగిరి. అంతట బాగుగా తెల్ల వారినది. ఆ పొలముకాపు కొంతమంది కూలీలను తీసికొని, కొన్ని నాగేళ్ళను త్రోలుకొని, ఆచేను దున్నుటకు చేనిలో దింపుచుండెను. గట్టుమీద కూర్చుండియున్న పరకాలు డాషేత్రస్వామిని జూచి, "ఓయీ ! తిరిగి పొమ్ము నీ నాగేళ్ళ చేనిలో దిగుటకు వీలులేదు. ఇది నా హెచ్చరిక. నా హెచ్చరికను తిరస్కరించి, చేనిలోనికి దిగితిరా, నీవుగాని, నీకూలీలుగాని, యెద్దులుగాని వెనుతిరిగిపోవుటకల్ల. జాగ్రత్త" యని భయంకర కరవాలమును డాలును ధరించి నిలువబడియుండెను.

వచ్చిన కాలీలాభయంకరమూర్తిని చూచుచు గట్టుపై నిలిచియుండిరి. కొందరు గ్రామములోనికిపోయి గ్రామస్థులను తీసికొనివచ్చిరి. ఆ వచ్చినవారికి పరకాలునకు నీ క్రింది విధముగా సంభాషణ జరిగినది.

గ్రామ :- ఏమయ్యా ! ఏమి నీ యీ బెదిరింపు ? అసలు నీవేయూరు? ఈ చేనితో నీకుగల సంబంధమేమి? నీ వేల దున్ననీయవు ?

పర :- ఇది మీ క్షేత్రమా ? కాదు నాది. కావున దున్ననీయను.

గ్రామ :- ఇది నీ పొలమా ? నీవీయూరనెప్పుడును కన్పింపలేదే ? నీకీ క్షేత్రముపై హక్కులేమైన నున్నవా ?

పర :- పోనిండు. ఇది మీ పొలమైనట్లు గుర్తు లేమైన నున్నవా?

గ్రామ :- లిఖితమున్నది. స్వాధీనమున్నది. పట్టాయున్నది.

పర :- ఎవరు వ్రాసియిచ్చిరి ? ఇది ఎంతకాలమునుండి మీ స్వాధీనమున నున్నది ?

గ్రామ :- అమ్మినవారు వ్రాసియిచ్చిరి. పది సంవత్సరములనుండి యిది మా స్వాధీనమైయున్నది.

పర :- మీరబద్ధములాడుచున్నారు. పూర్వ మీభూమి ప్రళయ సముద్రమునందు నిమగ్నమైయుండగా, సర్వేశ్వరుడాది వరాహరూపమున నుద్ధరించెను. దానిని కశ్యపప్రజాపతి కొసంగెను. అందువలన భూమికి కాశ్యపి యను పేరువచ్చెను. మన మందరమును కశ్యపప్రజాపతి సంతాన మగుటచే మనందఱకు నీ భూమిపై సమానాధికార మున్నది. తరువాత కొంతకాలమునకు దుర్మార్గులీభూమి నపహరించిరి. విశ్వనియంతయగు సర్వేశ్వరుడు పరశురామ రూపమున దుష్టుల సంహరించి, మరల భూమిని సంస్కరించి, కశ్యప ప్రజాపతికిచ్చెను. ఇది కొన్ని లక్షల సంవత్సరముల క్రితము జరిగినది. అప్పటినుండి యీ భూమి ఎందరికి

సొంతముగానున్నదో, మీకుగాని, నాకుగాని తెలియదు. అట్టిది పదిసంవత్సరములనుండి మీకు సంక్రమించినదని చెప్పుచున్నారు. ఇది యీ దినము నాకు సంక్రమించినది. రేపెవరికి సంక్రమించునో తెలియదు. భూమి పుట్టినప్పటినుండియు మీ క్రింద నున్నచో మీదికావచ్చును. అట్లుకాదు కావున నీవేళ ఇది నాచేను. నా ఆక్రమణలో నున్నది. దీనిలో ప్రవేశించితిరా యొక్కరును ప్రాణములతో నింటికిపోరు.

ఈ విధముగా గద్దరించిపలుకుచు ఖడ్గధారియై జనమధ్యమున కురుకుచుండెను.

ఈ కోలాహల మీరీతి కొనసాగుచుండగా సూర్యాస్తమయమైనది. నలుదిశల నంధకార మావరించెను. జనులందరు ఇట్టి సంఘట మున్ను విన్నదికాదు. కన్నదికాదనుచు, విస్మయముగా చెప్పుకొనుచు నిండ్ల కేగిరి. పెద్దలు క్షేత్రాధిపతితో "ఓయీ ! ఇది చిత్రమైన విషయము ఈతడీ చేను, ఈనాడు నాది, రేపెవరిదో యనుచున్నాడు. ఈదినము ప్రొద్దు క్రుంకినది. రేపు ఉదయముననే చూచుకొందము." అని ఆతనిని తీసికొని గ్రామమున కేగిరి.

ప్రొద్దుపోగనే పరకాలుని శిష్యులందఱునువచ్చి చేరిరి. చేనిలో పాతిన బంగారమునంతయు బయటకు తీసి, దానిని మోసికొనుచు శ్రీ రంగనగరాభిముఖులై నడచుచుండిరి.

కరుణామయి రంగనాయకి అమ్మవారు, రంగేశ్వరుని పాదసంవాహన మొనర్చుచు భర్తతో "స్వామీ ! మనకు కైంకర్యము చేయుటకై పరకాలుడు నాగపట్టణమున కేగినాడు. అచ్చట బౌద్ధాలయమున నాతని మేనల్లుడు చంపబడె. అది యెరింగియు మీరలూరకుండుట న్యాయమా ? మన సేవలో మానవుడు మరణింపవచ్చునా ? ఆతనిని బ్రతికింపుడు" అని వేడుకొనెను.

ఆ మాటలు మద్దుసేసి సర్వేశ్వరుడు గరుడిని పిలిచి ఆతనితో "గరుడా ! నీవు నాగపత్తనమునకు పోయి పరకాలుని మేనల్లుని బ్రతికించి రమ్ము" అని ఆజ్ఞాపింప గరుడుడు మహావేగమున పోయి బౌద్ధాలయమునందలి శవమును తీసికొనివచ్చి పరకాలునియొద్దనున్న శిరముతో జోడించి, బ్రతికించి, శ్రీరంగమునకేగి శ్రీ శ్రియఃపతులకు విన్నవించి సుఖంబుండెను. బ్రతికిన భాగినేయుని జూచి పరకాలుడు సంతసించెను. ఎల్లరును ముదంబందిరి. ధనమును తీసికొనివచ్చుచు, మార్గమధ్యమునగల యొకయూరిలోనికి పోయి పరకాలుడు మంచి నీరము నర్థించెను. ఎవ్వరును నీరీయరైరి. పరకాలుడు కోపించి ఈ గ్రామమునందు నీరము లేకుండ పోవుగాకయని శపించెను. అప్పటి నుండి యిప్పటికిని ఆ గ్రామమున నెంతలోతు త్రవ్వినను నీరు పడదట. ఆ గ్రామవాసులు పరకాలుని శాపముచే మాయూర నీరు లేకుండ పోయెనని పల్కుదురు. పరకాలుడధిక దాహపీడితుడై ఊరుదాటిన తదుపరి, సర్వేశ్వరుని ధ్యానించుచు నొకరాతి నెత్తివైచెను. అది తగిలి భూమి బ్రద్దలై పాతాళజలముపైకి వచ్చెను. ఆ నీటితో దాహ శాంతి చేసికొని, పరకాలుడు, శ్రీరంగమునకు పోయెను.

ఈ విధముగా శ్రీరంగమునకువచ్చి అనేకుల శిల్పుల పిలిపించి, ప్రాకారములు- దివ్యగోపురములు- మంటపములు- వంటశాలలు- ధాన్యాగారములు- ఆజ్యకూపములు- అంతరాళికములు- దివ్యాస్థాన మంటపములు- కల్యాణమంటపములు- చిత్రశాలలు మొదలగువాని నన్నింటిని కట్టించెను. ఈ విధముగా శ్రీరంగమున కనుచూపుమేర నన్నియు దివ్యభవనములు వెలసెను.

తెల్లవారినపిదప నాగపట్టణ వాసులగు బౌద్ధులాలయమునకు వచ్చి చూచిరి. విగ్రహము దొంగిలింపబడెనని గ్రహించిరి. చక్రములు విరిగి క్రిందపడియుండెను. వారిది గాంచి విభ్రాంతి చిత్తులై యింతపని నెవరు చేసిరా యని విచారింప దొడగిరి.

చివరకు పరకాలుడు తీసికొనిపోయినట్లు జాడలులాగిరి. వారందరును శ్రీరంగమునకు వచ్చి పరకాలుని దర్శించిరి. పరకాలుడు వారినందరను మిక్కిలి గౌరవించి వచ్చినపని యేమని ప్రశ్నించెను. వారు పరకాలునిం జూచి "అయ్యా! మేము బుద్ధభగవానుని స్వర్ణప్రతిమను దేవాలయమున ప్రతిష్టించి పూజించుకొనుచుంటిమి. నీ వావిగ్రహమును దొంగిలించుకొనివచ్చి మీ దేవుని కైంకర్యమునకు వినియోగించుకొనుచుంటివి. ఇది మెచ్చుటి ధర్మము. పరమత సహనములేని మీ పూజ దైవమెట్లంగీకరించు!"నని యేవేవో; మాటాడిరి.

ఆ మాటలకు పరకాలుడు మందహాస మొనర్చుచు "అయ్యలారా! మీ మాటలు నా కర్థమగుటలేదు. మీ దైవమేమో? నేను తెచ్చుటయేమో? అంతయు విచిత్రముగనున్నది. మీరు నన్ను వేరొకనిగా భ్రాంతిపడలేదుకదా! మీ స్వామిని తెచ్చి మా స్వామికి కైంకర్యమొనర్చుటకు నేను మూర్ఖుడనుకాను," అని మెత్త మెత్తగా నేమియు నెరుగనివానివలె సమాధాన మొసంగెను.

అంత నాబౌద్ధులు గ్రామమునందలి పెద్దలనందరిని ప్రోగుచేసిరి. పరకాలుని పిలిపించి, వారి అభియోగమును కొన్ని నిదర్శనముల ద్వారా నిరూపించిరి. పరకాలుడే తెచ్చినట్లు న్యాయనిర్ణేతలు తీర్మానించి, తెచ్చిన సొమ్ము బౌద్ధులకిమ్మని ప్రతిబంధించిరి. అందులకు పరకాలుడు నిజమునకు నాకు తెలియదు. మీరందరును నేనే తెచ్చితినని నిర్ణయించితిరి. కావున నేను తేకపోయినను తెచ్చినట్లంగీకరింపవలసి వచ్చుచున్నది. ఇప్పుడు మీ కొసంగుటకు నా యొద్ద చిల్లుపడిన రాగి పైసయులేదు. పత్రమును వ్రాసియిచ్చెద. తరువాత మీ ధనమ్ము నొసంగెద"నని చెప్పెను. పత్రమును వ్రాసియిమ్మనిరి. "మీ విగ్రహము చిటికెన వ్రేలికి తగ్గకుండ, మూడు సంవత్సరములలోగా నిచ్చెద"నని పత్రమును వ్రాసియిచ్చెను. ఆ పత్రమును తీసికొని బౌద్ధులు మరలిపోయిరి.

పరకాలుడు గోపురమంటపాదులన్నియు కట్టించి సంప్రోక్షణా దులు చేయవలెనని తలంచెను. కాని ధనమించుకయు లేకపోయెను. గ్రామములలో ధనములేని కారణమున చౌర్యము సాగుటలేదు. దీని వలన ప్రయోజనములేదని తలంచి, కొంతమంది శిష్యులను వెంటబెట్టు కొని, యాచకవృత్తి కారంభించెను. ధనికులగు వారి యిండ్లకుపోయి వారితో "అయ్యా! శ్రీరంగదేవాలయాభివృద్ధి జరుగుట మీ రందరెరుగుదురుగద. అన్నియు కట్టించితినిగాని, సంప్రోక్షణాదులకు ధనము లేదయ్యెను. మీరు పెద్ద ధనవంతులు. మీ ధనమంతయు మాకవసరములేదు. ఆ యిచ్చునదైనను, మాకు దానధర్మమువలదు. మీకు పత్రములు వ్రాసియిచ్చెద. పదివేలొసంగుడు" అని పత్రములు వ్రాసి ధనమును గ్రహించుచుండెను. ఇయ్యకున్నచో మొత్తమీతడు దొంగిలించుకొని పోగలడని విచారించి, యిచ్చిన ధనమెట్లును తిరిగిరాదని భావించి, ఆతడు పత్రమును వ్రాసియిచ్చిన దానిలో సగమిచ్చుచుండిరి.

ఈ విధముగా పరకాలుడు మిక్కిలి ధనమును సేకరించి, ఆ ధనముచే సంప్రోక్షణాదులన్నియు పూర్తిచేసెను. భాగవత సమారాధనముచేసి విరివిగానన్నదాన మొనర్చి కృతకృత్యుడయ్యెను. శిష్యులతో గూడి వెల్లగోపురముపైకెక్కి నలుమూలలు పారజూచెను. కను చూపుమేర కెటుచూచినను, ప్రాకార మంటప గోపురాదు లన్నివైపుల విరాజిల్లుచుండెను. పరకాలుని శిష్యులు పరవశించి, "స్వామీ! యింత దేవాలయము ప్రపంచమునందెచ్చటను గోచరింపదు. ఇంత మహత్తర కైంకర్య మొనరించినవారు మీరుగాక, వేరొకరు జగత్తునలేరు" అని కొనియాడ దొడంగిరి.

ఆ వాక్యశ్రవణమున పరకాలుడు శిష్యులంజూచి "నాయనలారా! మీరు నన్నేల యీవిధినగ్గింతురు? ఈ కైంకర్యమంతయు బంగారముతో నిర్వర్తింపవలయునని, తొలుదొల్త నా మనస్సున

పొడమియుండరాదా ! ఈ రాళ్లతో కట్టవలయునని యెందులకు సంకల్పించితిని ? నావంతు తలంచుటయే కాని, నెరవేర్చువాడు రంగేశ్వరుడేకదా ! ఇదంతయు నా శక్తిచే నిర్మించితినా ? అట్లే ఇవన్నియు స్వర్ణముతో కట్టవలయునని యూహించినచో సర్వేశ్వరుడట్లే నా పూనిక పూర్తిచేసి యుండును. దౌర్భాగ్యున కుత్తమవాంఛ లెట్లుద్భవించు ? నే నల్పుండను. కావుననే అల్పసంతోషినైతిని.” అని విచారించుచు క్రిందికి దిగివచ్చెను. మహాపురుషుల హృదయౌన్నత్యము లిట్టివికదా !

వాంఛించిన కార్యములన్నియు పూర్తికాగా పరకాలుడు శ్రీభూనీళాది దివ్యమహిషీ సమేతుండగు రంగేశ్వరుని దర్శించి, “శ్రియఃపతీ! జగదాధారా! దయామయా! దేవరవారి యనుగ్రహమున యథాశక్తి తమ కైంకర్యము గావించితిని. జగన్నియంతలు, విశ్వాధికులునగు మీకు నేచేయు కైంకర్య మెంతటిది. జగద్భాసకుండగు సూర్యునకు దీపారాధనమువలె, జగత్పవిత్రయగు భాగీరథికి దోసెడు జల మర్ఘ్యమిచ్చినట్లు నా యీ కైంకర్యమతి స్వల్పము. ఐనను చిన్న పిల్లవాడుచేయు స్వల్పకార్యమునకు తల్లిదండ్రులానందించునట్లు అనుగ్రహింపవలె”నని వేడుకొనెను. అందులకు రంగేశ్వరుడు “వత్సా! నీవు చేసిన కైంకర్య మత్యధికము. ఇంతెగా చేసినవారు త్రికాలములందు లేరు. సందియములేదు. నీ వొనర్చిన యీ పనికి నీ తల్లియును, నేనును మిక్కిలి సంతసించితిమి. నీకు భయవిభూతులు ప్రసాదించినను, నేనే ఋణపడియుందును” అనిచెప్పి తీర్థప్రసాదము, తిరువాలవట్టము, తిరుత్తుళాయి మొదలగు బహుమతుల నిప్పించి పంపించెను.

కొంతకాలమునకు నాగపట్టణవాసులగు బౌద్ధులు వ్రాసియిచ్చిన ప్రకారము స్వర్ణవిగ్రహము నొసంగుమని పరకాలుని యొద్దకు

వచ్చిరి. బౌద్ధ విగ్రహమును కరగించునపుడు పరకాలుడు ఆ విగ్రహపు చిటికెన వ్రేలి నొకదానిని కరిగించక తీసి దాచియుంచెను. అత్తూ వ్రేలిని తెచ్చి బౌద్ధులకిచ్చి నేను వ్రాసియిచ్చిన ప్రకారము మీ ధనము మీ కొప్పగించితిని. ఇక నాకును మీకును నెట్టి సంబంధమును లేదు అని ఖండితముగ చెప్పెను. వారాగ్రహోదగ్రులై ఆ పత్రమును కొనిపోయి న్యాయాధికారి ముందుంచి, విషయమంతయు నివేదించిరి. న్యాయాధిపతి పరకాలుడు వ్రాసియిచ్చిన పత్రము నామూలాగ్రముగ, తీక్ష్ణముగ పఠించి, బౌద్ధులతో "నేమయ్యా! మీకు వ్రాసియిచ్చిన పత్రమునందేమున్నది? చిటికెన వ్రేలికి తగ్గకుండనిచ్చెద నని వ్రాసియున్నది. ఆ విధముగనే యిచ్చినాడు. పూర్తి విగ్రహము నిత్తునని వ్రాసియుండలేదు. మీ యభియోగము చెల్లదు." అని తీర్పు చెప్పెను. వారు చేయునదిలేక తిరిగిపోయిరి.

సంప్రోక్షణాదులకు ధనమొసంగిన వారందరును, తమకు వ్రాసియిచ్చిన పత్రముల తీసికొని పరకాలుని సమీపించి, మా ధనమెప్పుడిత్తువో చెప్పుమని వేధింపసాగిరి. అపుడు పరకాలుడు వారితో "నార్యులారా! నేను చేసిన సమస్త కార్యములు గోచరించుచునేయున్నవి. భగవద్విషయముగా ఖర్చు చేసితినేగాని, దుష్కార్యములకు వ్యయించ లేదు. మీ ధనమును పూర్తిగానిచ్చుటకు నాయొద్దనేమియు లేదు. దక్షిణకావేరీ దక్షిణభాగమునందు కొంత భూమిని కొంటిని. అది సర్వేశ్వరార్పణము చేయవలయునని యెంచితిని. కాని మీ బాధపడ జాలకున్నాను. నేను పత్రములు వ్రాసియిచ్చిన వారందరును, ఒక్కసారిరండు. ఆ భూమిని మీరిచ్చిన ధనమునుబట్టి ఎవరి కెంతవచ్చునో అట్లు పంచుకొనుడు. ఇదిగో, ఈవచ్చు భాద్రపదశుద్ధైకాదశీ పుణ్యవాసరము మంచిది. ఆ దినము మీరందరునురండు'' అని చెప్పి పంపించెను.

ఆ దినమున వారందరును, తమ తమ పత్రములతో చనుదెంచిరి. వచ్చిన వారినందరను గౌరవించి, పరకాలుడు వారికి షడ్రసోపేత భోజనములు పెట్టించెను. దివ్యవస్త్రములుకట్టించి, చందనతాంబూలాదులొసంగెను. అందరిని తీసికొనిపోయి, కావేరీనదియందొక్క పడవపై నెక్కించెను. వర్షాకాలమగుటచే కావేరీనది మహాప్రవాహముతో నొడ్డులొరసుకొని భయంకరముగ ప్రవహించుచుండెను. వారినందర పడవ నెక్కించి, తానుకూడ పడవనెక్కి నదీ మధ్యమునకు పోనిచ్చెను. ప్రవాహ వేగమున పడవ అటునిటు కంపింపజొచ్చెను. ఆ సమయమున మహాబల సంపన్నుండగు పరకాలుడు ఆ పడవ నటునిటు త్రొక్కి యూపుచుండెను. అదిచూచి పడవలోనివారు "ఇదేమయ్యా! నీవు మమ్ము కావేరిపాలు చేయుటకై యీ యెత్తు నెత్తితివా? మమ్ము వదలిపెట్టుము. ఇక నెన్నడును మా డబ్బునుగూర్చి నిన్నడుగము. ఇవిగో పత్రములు తీసికొమ్ము. మమ్ము చంపవలదు" అని గగ్గోలుగా నరువ దొడగిరి.

ఆ మాటలకు పరకాలుడు "ఏమయ్యా! మీరిచ్చిన ద్రవ్యము నేనేమి చేసినదియు మీకు కన్పించుటలేదా? మీ ధనమును తీసికొని నేనేమైన అనుభవించితినా? మీయొద్దనున్న ధనమంతయు నేను తీసికొనిరాలేదే? మీకడయున్న ధనము మీకు చాలదా? మిమ్ములను వదలినచో మీరు మరల నన్ను నిర్బంధించెదరు. నన్ను అన్నము తిన నిచ్చితిరా? నిద్రపోనిచ్చితిరా? మీరిక భూమిపైనుండరాదు" అని పడవనటునిటు త్రొక్కి కావేరిలో ముంచివైచెను. వారందరొక్కసారి కావేరి పాలైరి. పరకాలుడీదుకొని యొడ్డునకు వచ్చి రంగేశ్వరుని గూర్చి "ఓస్వామీ! ఈ కావేరిలో నుసురులు వీడిన వీరందరును నీ కైంకర్యమునందుపయోగపడినవారే. వీరినందరిని నీ సన్నిధికి చేర్చుకొనుము" అని రెండు చేతులు జోడించి శరణాగతి చేసెను.

వెంటనే రంగేశ్వరానుగ్రహమున పుణ్యకోటి విమానములు గగనమున గోచరించెను. కావేరీనదినుండి యనేక జీవులు జ్యోతిర్మయాకారములతో లేచి, "మేమెంత ధనమును సంపాదించినను, ఏమి ఫలము ? మహాభాగుండగు పరకాలునకు సమర్పించిన స్వల్ప ధనముచే, ఆయన అనుగ్రహమును పొంది మోక్షమునకు పోవుచుంటిమి." అని ఆనందపడుచు మహోత్సాహముతో కేకలువైచుచు, పుణ్యకోటి విమానముల నారోహించి, పరమవ్యోమమునకు వెడలిపోయిరి. ఆ ధ్వని విని జనులందరు మిక్కిలి ఆశ్చర్యమందిరి.

ఈ విధముగా పరకాలుడు తన కార్యమున సహాయపడిన వారికందరకు, మోక్షమొసంగెను. అనేక కుదృష్టివాదుల, పాషండుల రూపుమాపి, కుదృష్టితమోభాస్కర, పాషండమత్త గజేంద్ర కంఠీరవ, చతుష్కవిశిఖామణి, శుష్కవేదాంత సర్ప పక్షీంద్ర, అసమానభగవత్కైంకర్య సార్వభౌమేత్యాది దివ్య బిరుదములు ధరించి, ఐదువందల సంవత్సరములు భూలోకమునుండి, భగవన్మహిమను లోకమున విజృంభింపజేసి, విశ్వవిఖ్యాతమగు కీర్తిప్రతిష్ఠలతో తన స్వీయవైభవమును చాలించి, పరకాలుడు (తిరుమంగైయాళ్వారు) అర్చారూపమును వహించెను.

ఓమ్ శాంతిః - శాంతిః - శాంతిః

# శఠారాతి వైభవము

"యత్పాదాంభోరుహధ్యాన విధ్వస్తాశేష కల్మషః
వస్తుతాముపయాతోఽహం వేంకటాఖ్యమ్ నమామితమ్"

ఆదికావ్యంబగు రామాయణమునందు వర్ణింపబడిన మహా వైభవము కలదియు, సర్వసంపత్సమృద్ధం బైనదియు, నగు పాండ్యదేశము నందు, తామ్రపర్ణీతరంగిణీ తీరమ్మున కురుకాపురంబను నొక దివ్య దేశంబు కలదు. పూర్వమాదేశము కురువను మహా ధర్మప్రభువుచే పాలింపబడెను. కావున దానికానామము ప్రసిద్ధిచెందెను. ఆపురము శిష్ట నిలయము. త్రైవిద్యులకాటపట్టు. అధీతవేదవేదాంగులగు భూసుర నివహంబుతోడను, విక్రమ సంపన్నులగు రాజన్యులతోడను, క్రయ విక్రయాధికారులగు వైశ్యులతోడను, తమ కృషిచే నార్జించిన ధాన్యముచే క్షామాది దుర్భిక్షముల నశింపజేయుచున్న నాల్గవ కులము వారితోడను, విరాజిల్లుచుండెను. సమస్తకల్యాణ గుణనివహుండును, అశరణ్యశరణ్యుండును, దివ్యమహిషీసమేతుండునునైన నారాయణుడు వైద్యనాధస్వామియను పేర, నాదేశవాసుల కటాక్షించుచు తత్పట్టణమున ప్రకాశించుచుండెను.

ఆ పురంబున కారియను నామధేయముగల చతుర్థకులజుం డొక్కఁడు వసించియుండెను. ఆతడు నిత్యసత్యవ్రతుండు. పరమనిష్ఠాగరిష్ఠుండు. దివ్యజ్ఞాన సంపన్నుండు. విష్ణుభక్తిపరాయణుండు. సూరిజన శేఖరుడు. ఆతని భార్య నాధనాయిక. ఆమె సీమంతినీ కులతిలకము. దివ్యగుణోపేత. అతడు భార్యతోగలసి ఒకానొక దినంబున పరిశారం బను గ్రామమునగలశ్వశురగృహంబున కరిగెను. వారిరువురునచటకొన్ని దినములుండిరి. తదుపరి నత్తమామలకు ప్రణమిల్లి వారి ఆదరాశీర్వచనములు గ్రహించి, ఆతడు ధర్మపత్నితో కురుకానగరమునకు చనుదెంచుచుండెను. మార్గమధ్యమునకు రంగనగరంబను నొక పురముగలదు.

ఆ దంపతులాపురమున నొక్కరోజుండి, ఆ పురమున వేంచేసియున్న జగదీశ్వరుని ఆలయంబున కరిగిరి. అచ్చట శ్రీశ్రియఃపతుల దర్శనము గావించి "ఓ దేవాదిదేవా! రమాధవా! విశ్వస్వరూపుండవగు నీకు నమశ్శతములు. నీవు సృష్టిస్థితిలయములకు కర్తవు. విలయమువేళ నీ భువనమ్ములనన్నింటిని నీ యుదరగోళంబున రక్షించి, సృష్టిసమయమున మరలవదలుచున్నావు. ఈ బ్రహ్మాండములును, అండాంతర్గోచర భూతంబులును, దశగుణితోత్తరంబులగు ఆవరణ సప్తకంబును, త్రిగుణములు, ప్రకృతియు, జీవులులును, పరమపదమును, దివ్యమంగళవిగ్రహమును నీ యాస్తి, వీనియందింకెవ్వరికిని అధికారములేదు. ఒక్కొక్కతరి చేతనా చేతనములు శరీరముగాగలిగి సూక్ష్మరూపివైయుండి, ఒక్కొక్కయెడ స్థూలమగు నీ జగద్రూపముగా, భాసింతువు. భూమి నీ పాదములు. ఆకాశము నీ శిరస్సు. వర్షము నీ వీర్యము. సముద్రంబులు నీ కుక్షి. పర్వతంబులు నీ యెముకలు. మేఘంబులు నీ కచంబులు. వృక్షజాలంబు నీ రోమంబులు. వాఙ్మానసాతీతుండవగు నిన్నేమని స్తుతింపగలము? అనంతా! నీ పాదములకు నమశ్శతములు నీ బాహువులకు దండములు. నీ ముందు భాగమునకు నమస్సులు. నీ వెనుక కంజత్ బంధంబులు. అనంతవిభూతివగు నీకు మేమేమి అర్పింపగలము? అకించనులమగు మాయందనుగ్రహముంచి మమ్ము రక్షింపవలయు"నని స్తోత్రముచేసి నిలిచియుండిరి. అంత నాకురంగపురాధినాథుండు, ఆవేశముఖమున "మీరిట్లు స్తోత్రించుటకు హేతువేమి? ఏమి వాంఛించి చేసితిరో తెలుపుడొసంగెద"నని తెలిపెను. ఆ దంపతులు పరమానందభరితులై చేతులు మోడ్చి "ఓ దయామయా! మేమనపత్యులము. నీవంటి కుమారునొక్కరిని దయచేయుము" అని ప్రార్థించిరి. అందులకు సర్వేశ్వరుడు నావంటివాడీ యనంతవిశ్వమున వేరొకరుండు లేదు. నావంటివాడను నేనే. మీరు నావంటి పుత్రకుని గోరితిరి. నిస్సమాభ్యధికుడనగు నేనే మీ గర్భవాసమున జనింపవలసియున్నది. తప్పక మీ గర్భమున

జనింతు''నని తెలిపి, తీర్థము, శఠగోపము, ప్రసాదము, తిరుత్తుళాయి మొదలగు బహుమతుల నిప్పించి పంపించెను. వారును ధన్యులమైతి మని ఆనందించుచు స్వగ్రామమునకు పయనమైరి. ఈ విషయము వార్తాహర విషయముగా కురుకాపురవాసు లెరింగిరి. వారు పట్టణమంతయు చక్కగా నలంకరించిరి. రాజవీథులన్నియు ఊడ్చి కలయంపి జల్లి, రంగవల్లికలు తీర్చిదిద్దిరి. తోరణములు గట్టిరి. దీపస్తంభములు నెలకొల్పిరి. వితానములమరించిరి. 'కారి' ఆ గ్రామమున కధికారి. పైగా కురంగాధీశునిచే వరమంది వచ్చుచున్నాడు, కావున తత్పుర వాసులు మంగళవాద్యధ్వానులతో ఆ పుణ్యదంపతుల కెదురేగిరి.

కారియు, నాథనాయకియు వచ్చి ఆపురవాసుల నుచితరీతి సత్కరించి, వారితో కలిసి ఆనందపడుచువచ్చి స్వనిలయంబునకు వచ్చి చేరెను. వచ్చిన వారిఅర్హతలనుబట్టి వందనాలింగనాది సత్కారములు వారివారి యిండ్లకుపంపిరి. భగవదాజ్ఞచే విష్వక్సేనుండు కారి మనస్సునందు ప్రవేశించి, తద్వారా నాథనాయకి గర్భంబున ప్రవేశించెను: నాథనాయకి గర్భవతి యయ్యెను. తొమ్మిది మాసములు గడచి, పదియవమాసముప్రవేశించెను. ఒక శుభముహూర్తమున, రాకానిశినాడు ప్రాచీదిశ నుద్భవించిన శిశిరకరుని చందంబున నాథనాయికా గర్భము నుండివిష్వక్సేనాంశసంభవుండగు కుమారుడుదయించెను. ఆ సమయమునజగత్తున నొకవికాసముదయించెను. అజ్ఞానాంధకారము పటాపంచలయ్యెను. పాపమ్ములు నశించె. అధర్మమడుగంటె, నాస్తికవాదములు నాస్తియయ్యె. ఆమహాత్ముని జన్మదినంబు ముహూర్తంబును, వర్తమాన కలియుగమునందు, నలువది మూడుదినములు గతింప, ప్రాప్తంబగు బహుధాన్య వత్సర వసంతఋతువునందు, వైశాఖ శుక్లపక్షంబున శుక్రవారము చతుర్దశీ తిథియందు కర్కటక లగ్నమని పెద్దలందురు. కుమారుడు జనింపగనే కారిసూరి మహానందముతో బ్రహ్మ విదులకు సువర్ణాది మహాదానంబులొసంగి, గొప్ప యుత్సవ మాచరించెను.

జాతకర్మాదులు నివర్తించి పెద్దలతోఁగూడి, ఆ పిల్లవానికి 'శఠగోపులు' అని నామకరణ మొనర్చిరి. కాని ఆ పిల్లవాడు జనించినది మొదలు మల మూత్రి విసర్జనాదులు లేక, ఏడువక, కన్నుగవ తెరువక, సర్వేశ్వరన్యస్తభరుండై యుండె. అంత నాయూరి వారందఱును కారిసూరి యింటికివచ్చి దివ్యలక్షణ సమువేతుండగు బాలుని జూచి, తత్తేజో విశేషంబుల కచ్చెరు వందుచు, 'ఈ పిల్లవాడు సర్వేశ్వరాంశసంభవుం డగుట కేమి చోద్యము ? శ్రీవిష్వక్సేన భగవానులే కారిసూరి కాత్మజుండై జనించె. ఈ పురమును, మనమును. ఏమిపున్నెము చేసితిమో ఈ మహాపురుషుండు మన గ్రామమున జనించె' నని పొగిడి తమ తమ గృహముల కేగిరి.

ఆ దంపతులు తమ కుమారుని స్థితికి నచ్చెరువందిరి. ఎంతకాల మైనను పాలుద్రావడు. ఏడ్వడు. మలమూత్ర విసర్జనాదులు చేయడు. కన్నులు తెరువడు. ప్రాకృత శిశులక్షణము లేమియు కానరావు. ఐనను కృశింపడు. బలహీనుడుకాడు. శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడై యుండెను. అది చూచి తల్లిదండ్రులు చింతించి "కురంగ పురీనాథుండు మాకేమి మేలుచేసె ? తనవంటి కుమారు నొసంగెదనని పల్కి యిట్టి కుమారు నొసంగినాడు. ఈబిడ్డ తన బిడ్డయేకాని మన బిడ్డడుకాడు. తన బిడ్డను తనకే యొసంగుదము. ఏమి చేసికొనునో ? మనకీ దుఃఖమెందులకు" అని ఆశిశువు నెత్తుకొనిపోయి తామ్రపర్ణీ నదీ దక్షిణ తటంబున శంఖతీర్థంబున వేంచేసియున్న వైద్యనాథస్వామి సన్నిధికింబోయి, అచ్చట స్వామికెదురుగా నొక బంగారు డోలికవేసి, దానియందు పరుండబెట్టి స్వామికి నమస్కరించి, ఇంటికి తిరిగిపోయిరి. ఆమహాత్ముండ ప్రాకృతుండుగావున మలమూత్రాదులు లేవనియు, భగవదానంద సుధారసము ననుభవించుటచే నేడ్చుటలేదనియు, తాను మాట్లాడుట కధికారి లేడుకావున కన్నులు తెరచుట లేదనియు, మాటాడుట లేదనియు తలంపరైరి.

అంత నాశిశువు కొన్ని దినము లాతోట్టియందే దొగియాడి, వైద్యనాథస్వామి ఆలయమునకు ప్రక్కనగల తింత్రిణీ వృక్షము యొక్క కోటరము లోనికిపోయి, బద్ధపద్మాసనస్థుండై నేత్రములు మూసికొని, దక్షిణ హస్తమునం దభయముద్రను ధరించియుండె. ఈ వార్త దేశదేశంబులు ప్రాకె.

సూర్యోదయమునకు ముందు, అరుణోదయమట్లు శఠారాతిపుట్టుటకుముందు పాండ్యదేశమునం దొకానొక పురమున పురశ్చూడ బ్రాహ్మణ వంశమునందు మధురకవి యను మహాపురుషుండు జనించెను. ఆతడు వేదవేదాంగములు నభ్యసించి పుణ్యక్షేత్రములు దర్శింపనుత్తర దిక్కునకు బయలుదేరి, సింహాచలము, శ్రీకూర్మము, జగన్నాథము, గయ, ప్రయాగ, మధుర. మాయ బృందావనము మొదలగు క్షేత్రములు దర్శించి, బదరికాశ్రమమునకు పోయెను. అచ్చట బదరీనారాయణుని, మహాలక్ష్మినిదర్శించి, తిరిగి అయోధ్యకువచ్చెను. రామజన్మస్థానమున నిత్య నివాసమొనర్చినచో జన్మసార్థక మగునని యెంచి, అచ్చట నొక మఠమునిర్మించుకొని యందు నివసించుచుండెను. ఆతడొకానొక దినమున, రాత్రిసమయమున, సరయూనదికి మంచినీరము నకై వచ్చెను. ఆయనకు దక్షిణపుదిక్కునందు సూర్యమండలము వలె నొక దివ్య తేజస్సు గోచరించెను. "ఇదియేమి తేజము. రాత్రివేళ సూర్య తేజముండదు. చంద్రకాంతి అంతట నొకవిధముగనేయుండును. పైగా దక్షిణ దిక్కుననేల యుండును ? ఇది వైశ్వానరకాంతికాదు" అని ఆలోచించి, కొన్నిదినములు రాత్రివేళలందా తేజము నట్లేచూచి, ఇదియేమో తెలిసికొనవలయునని బయలుదేరెను. రాత్రులు పయనించుచు, పగలు విశ్రాంతి గైకొనుచు, దక్షిణమునకు వచ్చుచుండెను. ఆవిధముగా వచ్చివచ్చి వేంకటాచలమునుచేరి అచ్చట నుండిచూచెను. ఆ తేజమింకను దక్షిణముగా దగ్గరగా గోచరించెను. వేంకటనాథునకు నమస్కరించి, నైమిశారణ్యము, కాంచీపురము, కుంభకోణము దాటి

శ్రీరంగమునకు వచ్చిచూచెను. ఇంకను దక్షిణమునందే ఆ తేజము గోచరించెను. రంగనాథునకు నమస్కరించి బయలుదేరెను. శ్రీనగరాపరనామంబగు కురుకాపురమునకు వచ్చుచుండెను. మార్గమధ్యమున నమ్మాళ్వారి ప్రభావమును జనులనేకవిధముల కొనియాడుచుండిరి.

ఆ వార్తలు వినుచు మధురకవి కురుకాపురముచేరెను. అచ్చట ప్రజలు "ఈశఠారాతి ప్రభావమనూహ్యము. తల్లి చనుబాలు ద్రావక, కనుగవ తెరువక చింత చెట్టు తొఱ్ఱలో అభయముద్రతో బద్ధపద్మాసనస్థుడైయున్నాడు. ఈతడు జగదీశ్వరునవతారమనుటకు సందియములేదు. కానిచో నన్నపానాదులులేక, మలమూత్ర విసర్జనములేక యెవ్వడు జీవింపగలడు ? ఈ మహాపురుషుని పలుకరింపగల మహనీయులు లేరు కదా" యని యనేకవిధముల చెప్పుకొనుచుండిరి.

ఆ రాత్రి మధురకవి తత్పురంబున నిలిచి దక్షిణమునకు దృష్టిసారించెను. ప్రతిదినమును ప్రత్యక్షీభూతమగు తేజస్సు కన్పింపలేదు. ఇక దక్షిణమునలేదు. ఈ గ్రామముననే ఆ తేజస్సు కలదని నిశ్చయించి ప్రాతఃకాలమునలేచి, కాల్యకరణీయంబులు నిర్వర్తించి ద్వాదశోర్ధ్వపుండ్రధారియై వైద్యనాథస్వామి దేవాలయమునకు వెళ్ళి స్వామిని దర్శించి, ప్రక్కనగల తింత్రిణీ వృక్షమును దర్శించెను. ఆ చింతచెట్టు తొఱటలో శఠారాతిగలడు. విష్వక్సేనుడు శఠారాతి రూపమునభూమండలంబున నవతరించుననియు, ఆయనకు వర్షాతపనివారణార్థము, తాను తరురూపమున నుండవలయుననిమెంచి, అనంతుండాతింత్రిణీ వృక్షరూపమున నుండెను. ఇప్పటికిని ఆ చెట్టుకలదు. ఆ చెట్టుకొమ్మలు నరుకరు పుల్లలువిరువరు. ఆకులు చిగుళ్ళుకోయరు. రాలిన ఆకులను గురుప్రసాదమని భక్తితో తీసికొనిపోవుదురు. అట్టి వృక్షంబును దర్శించి తత్కోటరమునందు.

"వకుళాభరణం వందే జగదాభరణం మునిం
యఃశ్రుతేరుత్తరం భాగం చక్రేద్రవిడభాషయా"

ఎవ్వడుపనిషద్భాగమంతయు ద్రావిడభాషయందు రచించెనో, ఎవఁడు జగత్తున కాభరణప్రాయుఁడో, వకుళాభరణుఁడగునట్టి నమ్మాళ్వారిని స్తుతించుచున్నాను.

ఎవఁడు నాల్గువేదములను ద్రవిడభాషయందు నాల్గురూపములుగా రచించెనో, ఎవఁడు సాత్త్వికజనులకాధారభూతుఁడో, ఎవఁడశరణ్య శరణ్యుఁడో ఎవనినామోచ్చారణము విన్నంతనే వైష్ణవు లందరును చేతులు జోడింతురో, అట్టి శఠారాతి బద్ధపద్మాసనస్థుఁడై, అభయముద్రాధారియై, నిమీలితనేత్రుఁడై, అధరీకృత బ్రహ్మాది దేవతాసార్వభౌముండై, శ్రీధరపదారవిందన్యస్తభరుండై, కమనీయదివ్యవిగ్రహుండై యుగపదుదిత సహస్రకర భాసురుండై వేంచేసియుండెను.

అంతనామధురకవి గురుశిఖామణిం దర్శించి, దివ్యతేజమే, షోడశవర్షబాలక రూపంబుననున్నదా, లేక చైతన్య మీరూపమును ధరించెనా, అసలు చైతన్యమున్నదా, యని యనేకవిధముల చింతించి కరతాడనము గావించె. ఆధ్వనివిని శఠగోపులు దివ్యనేత్రోన్మీలితుండై మధురకవిని కటాక్షించెను. ఈతఁడు మహాపురుషుండు, సర్వజ్ఞుండు. తనకు మాటాడదగు వ్యక్తులు లేక యిట్లు నిశ్చలత్వమును వహించినాఁడనియెంచి మధురకవి శఠారాతి పదములపై బడెను. ఆయనను వలగొనెను. పురోభాగంబునకువచ్చి కూర్చుండెను. వకుళాభరణుండును, శిష్యుండగు మధురకవికి అష్టాంగ యోగరహస్యంబులును, మంత్ర, మంత్రార్థంబులును, ఉపదేశించెను. మధురకవియు గురుపుంగవునియొద్ద భగవద్విషయ రహస్యములనన్నింటిని గ్రహించి, వారికిశుశ్రూష చేయుచు శఠారాతి సన్నిధియందే నిత్యనివాస మేర్పరచు కొనియుండెను.

ఒకసమయమున సర్వేశ్వరుఁడు శ్రీభూనీళాది దివ్యమహిషీ సమేతుఁడై కోటిభాస్కర ప్రకాశమానుండై, హారకిరీట కేయూర కటిసూత్ర ముక్తాదామ కౌస్తుభ శింజానురంజిత మంజు మంజీర పీతాంబరాది దివ్యభూషణ భూషితుండై, శంఖ చక్ర నందక కౌమోదకీ శార్ఙ్గాది

దివ్యాయుధోపేతుడై, జ్ఞానశక్తిబలైశ్వర్య వీర్యతేజస్సౌశీల్య వాత్సల్య గాంభీర్యౌదార్య లావణ్య మాధుర్యాది కల్యాణగుణాకరుండై గరుడ వాహనారూఢుండై వకుళాభరణ యోగిపురోభాగంబున సాక్షాత్క రించెను. శ్రియఃపతిని, జగన్మాతను దర్శించి శఠారాతి, ఆనంద ప్రవాహమే వాగ్రూపమున బయలి కురుకుచున్నదో యనునట్లు వారిని గూర్చి స్తోత్రించుచు, కొన్ని పాశురములను పాడెను. ఆపాశురములే మూడు వేదములుగా ప్రసిద్ధికెక్కెను. అవియే తిరువృత్తము, తిరువాశిరియము, తిరువందాదియను నామములతో ప్రకాశించుచున్నవి.

108 ఆసమయమున నూటయెనిమిది దివ్యదేశముల నున్న భగవన్మూర్తులును వచ్చి, తింత్రిణీ వృక్షమునాశ్రయించి మాకు మంగళాశాసనము చేయుమని శఠారాతినికోరిరి. వారందరు నొక్కపర్యాయము చెప్పగా నాధ్వనిఅధికతమమయ్యెను. ఆభగవదర్చామూర్తులను చూచి శఠగోపులు "మీరంద రొక్కసారిగానిట్లు శాసించిన నేనెవ్వారినిగూర్చి పాడుదును? మీరు వరుసగారండు" అనిపలికెను. వారందులకంగీకరించి. వరుసగావచ్చిరి. వచ్చినవారిలో ముప్పదిరెండు దివ్యదేశముల లోనున్న భగవన్మూర్తులకు మంగళాశాసనము కావించెను. వారు, వనాద్రి యందలి సుందరభుజస్వామియు, వృషభాద్రియందలి వేంకటేశ్వర స్వామియు, ఘటికాచల నారసింహుండును, కురుకాపుర వైద్యనాధుండును, కురంగపురాధీశ్వరుండగు రమానాయకస్వామియు, వానమామల దేవనాయకస్వామియు, కుంభకోణమునందలి అపర్యాప్తామృత దేవుండగు శార్ఙ్గపాణియు, దక్షిణ పురమునందలి రమాసఖుండును, భ్రమరస్థలి ఉప్పిలియప్పన్ స్వామి, విల్లిపుత్తూరి వటపత్రశాయియు శ్రీమంగళాపురియందలి దేవనాయక స్వామియు, తేజఃపురీశుండగు ఫణిశాయియు, శ్రీరంగేశుండును, రామనగరమునందలి అపూపరంగ నాయకులును, తిరుపరివారమునందలి రమాసఖుండును, బృహత్తటమునందలి చోరనాట్యస్వామియు, పరిశార పురమునందలి మాయావి

స్వామియు, క్షుద్రనదీతీరవాసి రమాసఖుండును, సారభ పురమునందలి రాజగోపాలుండును, వ్యాఘ్రపురము నందలి అధినాథస్వామియు, చించాకుటవాసి శేషశాయియు, శ్రీ వైకుంఠేశ్వరమునందలి రమానాథుండును, వరగుణమునందలి వైకుంఠనాథుండును, కార్కరము మొదలగు నైదు దివ్య దేశములయందు, ఆయా నామధేయములతో నలరారుచున్న శ్రీమన్నారాయణుడు, కృష్ణ పురమునందలి శౌరిరాజప్పెరుమాళ్లును, మయూరపురాధీశుండగు కాలమేఘుండును అనంత శయనమునందలి పద్మనాభుండును, అనంతపురము నందలి కేశవస్వామియును. ఈ పైనుదహరించిన దివ్య స్థలములందలి భగవన్మూర్తులను స్తుతించెను. దీనినే మంగళా శాసనమనియు చెప్పుదురు.

ఋగ్యజురథర్వరూపములుగా మూడు ప్రబంధములను చెప్పి చివర, సామవేదరూపంబగు 'తిరువాయిమొళి' యను దివ్య ప్రబంధమును చెప్పెను. దానియందు రమాధినాథు ప్రభావ మంతయు కొనియాడెను. అపుడు శ్వేతద్వీపమునందలి ముప్పదిమూడు కోట్ల దేవతలు, అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులునువచ్చి ఆశఠగోపయోగికి గోచరించిరి. వచ్చినవారి నందర శఠగోపులు కొనియాడిరి. వారును నమ్మాళ్వారిని స్తుతించి,ఎవరి నివాసంబునకు వారు వేంచేసిరి.

ఏవంవిధమగు నాల్గు వేదముల సారమును, మధురకవి మొదలగు శిష్యులకు బోధించిరి. స్వస్వరూప, పరస్వరూపాది అర్థపంచక జ్ఞానము నుపదేశించి, మంత్రమంత్రార్థ రహస్యమంతయు నుపదేశించి, వారి నుజ్జీవింపజేసి, లోకమునంతయు నుద్ధరించి, ముప్పదిరెండు సంవత్సరములు ఆహారపానీయాదులు లేక, మలమూత్రాది విసర్జనలేక తింత్రిణీ మూలంబున బద్ధపద్మాసనస్థుండై అర్చారూపమును వహించెను. ఈశఠారాతి ప్రపన్న జనకూటస్థుడనియు, వైష్ణవ మత స్థాపకుడనియు, వైష్ణవంబున కాది పురుషుండనియు చెప్పబడును. ఈ మహాపురుషుని నామమును విన్నమాత్రమున, స్మరించిన మాత్రమున, సమస్త కలి

కల్మషంబులును నశించిపోవును. జగదాచార్యుండగు నావకుళభూషణ యోగి, కురుకాపురమునం దిప్పటికిని సర్వజనులకును దర్శన మిచ్చు చున్నాడు.

మధురకవియు అర్చారూపమును ధరించిన ఆచార్యుని జూచి గురువిశ్లేషమును సహింపలేక, బాధపడి, అర్చారూపుడైన ఆచార్యు నకు, ఆలయమంటపాదులు కట్టించి, అందు ప్రతిష్ఠించెను. సంవత్సరో త్సవ, అయనోత్సవ, మాసోత్సవ, పక్షోత్సవాద్యుత్సవంబులు చేయించుచు, సర్వవిధకైంకర్యంబులు చేయుచు, గురుప్రభావంబం తయు, 'కణిన్ శిరుత్తాంబు' అను నొక గ్రంథ రూపముగా రచించెను. దానిని సాత్త్విక జనుల కుపదేశించి, గురుప్రభావంబు సర్వజనవిదితంబు గావించెను. గురుండగు పరాంకుశముని దివ్యబిరుదములన్నియు కాహళ ముల నూదించుచు సుఖంబుండెను.

మధురయందు కంబుండను మహాకవికలడు. ఆతడుద్రవిడ భాష యందనేక గ్రంథములు రచించెను. ఆతడుమూడు వందలమంది శిష్యు లతోగూడి, యొక ఫలకముమీద కూర్చుండి, ఈదక్షిణాపథమునందు నాతోసమానుండగు కవీశ్వరుండెక్కడనైన కలడేమో పోయి చూచి రండనికొంతమంది శిష్యులను నాలుగుదిక్కులకును పంపించెను. వారిలో కొంతమంది దేశాటన మొనరించుచు కురుకాపురమునకు వచ్చిరి. అచ్చట నూదుచున్న కాహళములయందలి బిరుదములను విని వారు "ఓయీ! ఈ బిరుదులు మా గురువరుండగు కంబ కవీంద్రునకు చెల్లునుగాని, పరులు ధరింపదగవు. కావున మీరిల్లు మ్రోగింపరాదు" అని వారింపజూచిరి. ఆకాహళములు మ్రోగించువారు పోయి మధుర కవికీ విషయమును విన్నవించిరి. ఆతడు కంబుని శిష్యులను పిలిపించి "ఓయీ! మా కాహళములను ప్రతిఘటించిన కారణమేమి ? అని ప్రశ్నించెను. సమాధానముగా వారు, "అయ్యా ! మాగురుండు కంబ కవీంద్రుండు ఆయనకుతప్ప పరులకీ బిరుదంబులు పనికిరావు! మాగురుని

జయించినగాని ఈ బిరుదముల మీారు దింపనర్హులుకారు. అందులకై అడ్డుకొంటిమి" అని పలికిరి.

ఆ మాటలకు మధురకవి, "అయ్యలారా! మాగురుదేవుండాల యంబు విడిచి బయటకు వచ్చువాడుకాడు. ఆచార్యుల విడనాడి నేను వచ్చు వాడనుకాను. మాఆచార్య ప్రోక్తంబగు దివ్య ప్రబంధంబునం దొక పాశురమును వ్రాసియిచ్చెద. దానిం దీసికొనిపోయి మీాగురున కిండు. ఈ పత్రికయే మీాకందరకు సమాధానము చెప్పును" అని పలికి తిరువాయిమొళి యందలి యొకపాశురమును విలిఖించి వారి కొసంగెను. వారు దానినిగైకొని గురుని యొద్దకుంబోయి జరిగిన విషయమంతయు వివరించి, ఆపత్రిక నొసంగిరి. కంబకవీంద్రుడు ఆపాశురమును పఠించి తన్మాధుర్యంబునకు చొక్కి దాని నాఫలకము మీాద పెట్టెను. వెంటనే ఆఫలకము తలక్రిందుగా కంబుని, అతని శిష్యులను పడవైచి, ఆపత్రికను ధరించి నిలువబడి యుండెను. అంత కంబకవియు, నాతని అంతేవాసులును మిక్కిలి అక్కజంబందుచు నిలిచియుండిరి. అపుడు కంబకవి, శఠారాతియున్న దిక్కునకు నమస్కరించి, ఆ మహాయోగి తనకు సన్నిహితుడైనట్లు తల పోసి, "ఓజగదేకగురూ! ఈ లోకమునందున్న కృతిశతములన్నియు దేవరవారి దివ్య ప్రబంధమునందలి ఏకపాశురము విలువచేయజాలవు. నీయెదుట మేముకూడ కవులమని చెప్పుకొనుట, మాణిక్య పుంజాప ణమునందు, గుంజావిక్రయమువంటిది. ఖద్యోతమను నామము తనకును చెల్లునుగావున, మిణుగురుపుర్వు సూర్యునితో నేనును సమానమేయని వాదించినట్లుండును. బాడిదపు చెక్కతో పంచాయుధములు చేయించి వానినిధరించి, పంచాయుధుండగు వెన్నునితో నేను సమానమని పలికి నట్టిది. లోకమున కవీశ్వరశబ్దము మిమ్ముక్కనిచెంది సార్థక్యము నొందు చున్నది. మేము కవిశబ్దమునకు నానార్థములలో వచ్చు నీరుకాకుల వంటి వారము" అని అనేకవిధముల శఠారాతిని కొనియాడి, అపరాధ క్షమాపణము చేసికొనియెను.

తిరువాయిమొళి నొక్కసారి పఠించిన మాత్రమున మానవులు ప్రకృతిబంధంబులువీడి, పరమాకాశమునకు పోవుచుండిరి. ఇట్టిఫలితము కలుగవలెనని, మనస్సున యోజించియే, శఠారాతిఆదివ్యప్రబంధమును రచించెను. దానికి కారణ మేమన ముందుగల మూడుయుగము లందున్న మానవులు బలిష్ఠులు.

బుద్ధిశాలురు, తపశ్శీలురు, ఈ కలియందు స్వల్ప బుద్ధులు, బలహీనులు, అల్పాయుష్కులు, తపస్సానరింప నసమర్థులు, కర్మజ్ఞాన భక్తి ప్రపత్తిదూరులునై యుండిరి. ఇట్టివారు మోక్షము నెట్లు పొంద గలరు. అట్టివారిని మోక్షార్హులు చేయ వాంఛించి, చక్కగా నాలోచించి, శఠారాతి, తిరువాయిమొళి రచించెను. "ఈ దివ్య ప్రబంధము నొక్కసారి పఠించినచో శూద్రులుగాని, స్త్రీలుగాని, పాపయోనులు గాని, మోక్షమునకు పోగలరు" అని వరంబిచ్చి శఠారాతి అవతారమును చాలించెను. మధురకవియు తన యావజ్జీవము నాచార్య కైంకర్య మొనర్చుచు అనేకుల నుద్ధరించి, ఆచార్య పాదములు మనస్సున ధ్యానించుచు నిత్యలోకమునకు వేంచేసెను.

శఠారాతి చరిత్ర మెవ్వరైన చదివినను, విన్నను, వ్రాసినను ఐహికాముష్మిక ఫలంబంద గలరు.

ఓమ్ తచ్ఛాంతిః తచ్ఛాంతిః తచ్ఛాంతిః

---

## నాథమునుల వైభవము

చోళతుండీర మండలముల మధ్యమ దేశమునకు, మధ్యమ దేశ మని పేరు. ఆ మధ్యమ దేశమునందు వీరనారాయణపురంబను పేరుగల పురం బొండుగలదు. ఆపుర మధ్యమమున, పంచప్రాకార శోభితమును; అనేకాంతరాళికమంటపాద్యలంకృతంబునగు దివ్యాలయంబు గలదు. అందు రుక్మిణీ సత్యభామా సమేతుండై, సుదర్శన పాంచజన్య శోభిత

హస్తుండై, మనోహర మురళీరంజిత దివ్య పాణిపద్మయుగళుండై, దివ్య భూషణ భూషితుండై మన్నారు రాజగోపాలస్వామి వేంచేసియుండెను.

ఆయూర విప్రకులాలంకారుండగు సాత్త్వికాగ్రేసరుండొకరుండు నివసించుచుండెను. ఆయన పేరు ఈశ్వరభట్టు. ఆతనికి నాథముని యను కుమారుండుండెను. నాథమునికి ఈశ్వరముని యను పుత్త్రుండుగలడు. ఆనాథముని మన్నారురాజగోపాలస్వామికి సర్వవిధ కైంకర్యము లొనరించుచుండెను.

ఒకనాడు నాథముని దేవాలయంబునకేగి రాజగోపాలమూర్తికి, రుక్మిణీ సత్యభామలకు సాష్టాంగము లాచరించి "జగన్నాయకా! శుభప్రదాయకా! నా విన్నపంబొండు ఆలకింపుము. దేవరవారు రామకృష్ణాద్యవతారంబు లనేకంబులెత్తి తమ పదన్యాసంబులచే కొన్ని ప్రదేశములను పరమ పవిత్రములుగావించిరి". "అయోధ్యా మధురామాయా కాశీ కాంచీహ్యవంతికా, పురీద్వారవతీ చైవసప్తైతే మోక్షదాయకాః" అయోధ్యయు, మథురయు, హరిద్వారమును, కాశియు, కాంచీపురమును, అవంతియు, ద్వారకాపురియు, ఈయేడు దివ్య దేశములును మోక్షప్రదములని చెప్పబడియున్నది. బాల్యపౌగండాద్యవస్థలయందు దేవరవారు విలాసముగా విహరించిన ఆయాప్రదేశములు చూడవలయునని, కౌతూహలము కలిగినది. అనుగ్రహించి అనుమతించినచో పోయివచ్చెద నని ప్రార్థించెను.

రాజగోపాలస్వామి నాథమునిని వీక్షించి "వత్సా! అట్లే పోయిరమ్ము." అని ఆనతిచ్చి తీర్థప్రసాదములు, శఠగోపము నిప్పించి పంపించెను. నాథముని తండ్రియగు ఈశ్వరభట్టుతో, కుమారుని, భార్యను వెంటబెట్టుకొని, ప్రయాణమై మంగళప్రదములగు శుభశకునంబులు కలయజూచుచు, భారతదేశమునకు ప్రదక్షిణముగా బయలుదేరెను. ముందుగా నహోబిలము జేరి నారసింహస్వామికి మంగళాశాసనముచేసి,

అచ్చటనుండి బయలుదేరెను. ఏపురంబున భగవత్సంకీర్తనం బొక యామంబులేక నిలిచిపోవునో. అప్పుడే జగత్తు నశించిపోవునను ప్రసిద్ధి కలిగి అఖండ భగవన్నామ సంకీర్తనాదులతో ఏపురంబు ప్రతిధ్వనించుచున్నదో, అట్టి పండరిపురంబును జేరెను. ఆ పురాన భీమతటినీ కూలస్థుండై, ఇటికరాతిపై కటిన్యస్తహస్తారవిందుడై, శ్యామసుందర దివ్య విగ్రహుండై చేతనుల అభిముఖ్యము నిరీక్షించుచు, బద్ధచేతనుల నుద్ధరించుచు, పతితపావన బిరుదంబు గలిగి భవ్యగోపుర ప్రాకార భాసురంబగు దివ్యాలయాన రుక్మిణీ భగవతీ ద్వితీయుండై వేంచేసి యున్న పండరినాథు దర్శించెను. పురాకృత పాపసంచయంబంతయు నశించెనని సంతసించెను. సర్వేశ్వరుని ఆలింగన వందనాదు లొనరించి, "నమో నమో వాఙ్మనసాతిభూమయే, నమో నమో వాఙ్మన సైక భూమయే నమో నమోఽనంత మహా విభూతయే. నమో నమో నంతదయైక సింధవే" అనిస్తుతించెను. అనగా ఇట్టివాడని స్తుతించుటకు వాఙ్మానసములకు అందనివాడును, వాఙ్మానసముల కందునట్టి వాడును, అంతములేని యైశ్వర్యము కలవాడును. దయాసముద్రుండ పును నైన నీకు నమస్కారమని యర్థము.

ఇట్లు నమస్కరించి "ప్రభూ! మహాప్రళయమునందు మిణుగురు పురువులవలె నున్న జీవుల కీకరణకళేబరంబు లొసంగితివి. వారందరును తరింపవలయునని యెన్నియో శాస్త్రముల నొసంగితివి. అజహాస్వభావంబున ననేక దివ్యావతారంబు లెత్తి యుపదేశించితివి. ఒక్కడును నీవంక కన్నెత్తియైన కనడయ్యెను. ఈ జీవులపాపమేమని చెప్పవచ్చు? శ్రీధరా! నీదివ్యనామంబులనంతంబులై యొకరి అధీనంబులు కాక ప్రకాశించుచున్నవి. ఆనామములు కీర్తించుటకు జిహ్వ అందరికినీ స్వాత్తై యున్నది. అయినను మనసార నొక్కసారియైనను, నీ శ్రీనామమును వచింపనేరక, స్తుతింపజాలక, యీ జీవులు నరకాద్యవస్థలకు పోవుచున్నారు. ఔరా! వీరికి సంసారమే మహాసారముగ గోచరించు

చున్నది. జీవులు నిన్ను పట్టించుకొనకున్నను, నీవు వాత్సల్య జలధివి కావున తల్లిగర్భమందుండి, జ్ఞానహీనుడై యున్నప్పుడును, శిశుప్రాయమునను, అంధకారావృతమగు మార్గమున పయనించు నప్పుడును, సర్వకాల సర్వావస్థలయందు వానినారసి నీవే రక్షించుచుంటివి.

"అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్"

నేను జఠరాగ్ని రూపముగా సర్వదేహులయొక్క శరీరములయందుండి, ప్రాణాఽపానరూపమగు వాయువుచే నాయగ్నిని మండించుచు, భక్ష్య భోజ్య చోష్య లేహ్యరూపమగు ఆహారమును నేనేజీర్ణింప చేయుచుంటిని. అని సెలవిచ్చియున్నారు. "ఆహా! ఈ జీవులయందు మీకున్న దయ యింతయని పలుకవచ్చునా? కారుణ్యైకజలధివి" అని అనేకవిధంబుల ప్రస్తుతించి, పండరినాథుని ఆజ్ఞగ్రహించి, ద్వారకకు వెళ్ళెను.

రుక్మిణీసత్యభామా సంయుతుండగు ద్వారకాధీశ్వరునకు మంగళాశాసన మొనరించి, వారియాజ్ఞా విశేషమును గ్రహించి, ఉత్తరదేశ క్షేత్రములకు బయలు దేరెను. మధ్య ననేక పుణ్యక్షేత్రములు దర్శించుచు, హరిద్వారము - హృషీకేశము - బదరికాశ్రమము మొదలగు ముఖ్య దేశములుగాంచి, అయోధ్యానగరమ్మునకు వచ్చిచేరి. అచ్చట శ్రీరామ చంద్రుడు సీతా లక్ష్మణ సహితుండై దివ్య కోదండధారియై యుండెను.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ"

సంసారసాగరమగ్నుండై, పంచమహాపాతకియైనను, నిరంతర జంతువధానిధాన కూరస్వభావుండైనను, నన్నుగూర్చి ఎవడు ప్రపత్తి చేయునో, అనగా "ఓ ప్రభూ! నేను నీవాడను. నాసమస్తమును విడిచి

నీకు శరణాగతి చేయుచుంటిని'' అని యొక్కసారి, ఎవ్వడు వచించునో, అట్టివానికి సమస్త భూతములవలన భయములేకుండ అభయ ప్రదానము చేయుచుంటిని. అతని సమస్త భూతముల కొఱకు నిచ్చుచున్నాను. "సర్వభూతేభ్యః" అనునది పంచమీ చతుర్థులలో దేనికైన చెప్ప వచ్చును. 'దదామి' అనునది వర్తమానక్రియ 'ఇచ్చెదను' అనివచింప లేదు. 'ఇచ్చు చున్నాను' అని వచించెను. అనగా ఈ యుగముననే కాక, ఏయుగమునందైనను, ఏకల్పము నందైనను, కావచ్చును. వాడు శరణాగతి చేయుటయు నేనభయ మిచ్చుటయు నొక్కసారియే జరిగి పోవుచున్నది. "అని చెప్పిన సీతాపతిని దర్శించి, నాథమునులు'' శరణా గతత్రాణ బిరుదాంకా! సత్యపరాక్రమా! రామా! నీకువందనములు. నీవును, మాతల్లియు మైథిలియు, దివ్యాందోళిక నధిరోహించి సంచరిం చిన స్థలముకదా! మీపాద సరోజరజోవిరాజితమగుటచే నీనగరము మోక్షప్రదములగు సమస్త పురములకును అగ్రగణ్యామైనది. మీతండ్రి యగు దశరథచక్రవర్తియు, కౌసల్యాది మాతృమూర్తులును, మిమ్ము లాలించుచుండగా, దివ్య భార్యా సంయుతంబుగా మీరు విహరించు చుండ నెంత సుందరముగా నున్నదో! ఆహా ఆదృశ్యమును దర్శించిన జనుల అదృష్టమే అదృష్టము. నిత్యమును నీ తిరుముఖ దర్శనము కావించినకతమున కోసలవాసులు నిత్యపదవి నలంకరించిరి.

"త్వాం మామనంతి కవయః కరుణామృతాబ్ధే
జ్ఞానక్రియా భజనలభ్య మలభ్యమన్యైః
ఏతేషు కేన వరదోత్తర కోసలస్థాః
పూర్వం సదూర్వ్యమ భజన్తహిజన్త వస్త్వామ్"

కవీశ్వరులు, మహాయోగులైనను, జ్ఞానయోగ భక్తియోగ ప్రపత్తియోగములాచరించిననేగాని సర్వేశ్వరుడు లభ్యుడుకాడు. ఇతరో పాయముల కాతడసాధ్యుడు. అని చెప్పిరిగాని, ఉత్తర కోసలస్థులీ చెప్పిన వానిలో నొక్కదానిని గూడ చేయలేదుకదా! ఐనను,

మోక్షము వారికి కరతలామలకమైనది. ఏలయన నీవు కరుణా మృతాబ్ధివి. నీదయచేతనే వారు పొందిరి.

పక్షిరాజగు జటాయువునకు "గచ్ఛలోకానను త్తమాన్" అని నీ దివ్యలోకప్రాప్తినొసంగితివి. గుహుని జూచి "పద్భ్యామభిగమాచ్చైవ స్నేహసందర్శనేనచ" ఓగుహుడా ! నన్ను చూచుటకు కాలినడకనే వచ్చితివా" యని గౌరవించితివి. ఏమి నీ వాత్సల్యము కల్యాణ గుణ గ్రామ్ముండవగు నిన్నే విధిస్తోత్రింప గలము ? నిన్ను స్తుతింపవలయుననిన నీయఖండ దివ్యచరిత్రమంతయు పునరావృత్తమగును. నీదివ్య పాదార విందంబులకు మంగళమగుగాక. పీనదీర్ఘంబులగు నీబాహువులకు శుభం బగుగాత. నీదివ్య కార్ముకమునకు జయమగుగాక. నీభవ్య కిరీటమునకు స్వస్తియగుగాక నీవు దండకారణ్యమునకుపోవుతరి నీ తల్లియగు కౌసల్యాదేవి యిచ్చిన శుభంబులన్నియు నీకు కలుగుగాక. "నమోనమః నమోనమః" అని మంగళాశాసన మొనర్చి రామాజ్ఞను గైకొని, మథుర, బృందావనము, గోకులములకు పోయి అచ్చటచ్చట నున్న సర్వేశ్వరునకు మంగిళాశాసనముచేసి గోవర్ధనమునకు చేరెను. అచ్చట బాల గోపాలదేవుని దర్శించి, శ్యామసుందర దివ్య విగ్రహుండగు ఆ స్వామిని పాదమాస్తకమును వర్ణించి, అనుభవించి, తత్పరిసరములన్నియు ప్రశాంత వాతావరణయుతములై యుండుటచే అచ్చట నివాస మేర్ప రచుకొని కొంతకాలము గడపెను.

కొన్ని సంవత్సరములు గడచిపోయెను. ఒకనాటి రేయి శ్రీమన్నారు రాజగోపాలస్వామి స్వప్నమున గోచరించి, "వత్సా ! నాథయోగీ ! నీవిచ్చటనుండి పోయి చాలకాలమైనది. దివ్య దేశ ముల దర్శించి వత్తునని చెప్పి మరల తిరిగి రావైతివి. కారణము తెలియకున్నది. వెంటనే వీరనారాయణపురమ్మున కరుగుదెమ్ము" అని ఆనతిచ్చెను. నాథముని మేలుకాంచి, "అద్యమే సఫలం

జన్మజీవితంచసుజీవితమ్" మ దీ య జన్మసఫలమైనది. ఈ రాత్రి దివ్యరాత్రి. నాజీవితము శుభమైనది. రాజగోపాలమహాళి యిట్టిఅవ్యాజ కరుణ నాపై ప్రసరింపజేయుటకు హేతువేమియో అని ఆనందించెను. తెల్లవారినవెంటనే ఆ గ్రామవాసుల శావృత్తాంతమును వివరించి బాల గోపాలునకు నివేదించి, తదాజ్ఞగైకొని వీరనారాయణపురమున కేగుటకై తిరుగు ముఖము పట్టెను.

మార్గమున కాశియందు బిందు మాధవస్వామిని దర్శించి, గయకేగి గదాధరుని ప్రశంసించి, జగన్నాధమునకు వచ్చెను. అందు సుభద్రా బలరామ సహితుడై బ్రహ్మదారు స్వరూపుడై తన దివ్య భవనముమీదనున్న చక్రదర్శనంబున మహాపాతకులను పునీతుల జేయుచు, పతితపావన బిరుదాంకితుండై వేంచేసియున్న పురుషోత్తమ దేవరకు మంగళా శాసనముచేసి బయలుదేరెను. త్రోవయందు శ్రీకూర్మము సింహాచలము మొదలగు దివ్యదేశములు దర్శించుచు, వేంకటాచలమునకు చేరెను. పుణ్యాపుష్కరిణీతటమ్మున, దివ్యగోపుర మంటపస్థానముల, రత్నస్థగితంబగు స్వర్ణమయు ఆనంద విమాన మధ్య భాగంబున, శంఖచక్ర దివ్యాయుధధరుండై యుగపదుదిత సహస్రకర సమానభాసమానుండై, సర్వజీవ సంతత దర్శనీయ తమ దివ్యవిగ్ర హుండై స్వయం వ్యక్తత్వమును, ప్రకటింప దలంచి అప్పుడప్పుడు చలించుచు, జగత్తునకు శ్రీపతిత్వమును స్పష్టపరచుచు, "కలౌ వేంకట నాయకః" కలియుగ ప్రత్యక్ష దైవంబని ప్రసిద్ధినొంది, ఆళ్వారులందరి మంగళాశాసనములు గ్రహించి, వేంకటాచల, వృషభాచల, వృషాచల, శేషాచల గరుడాచలాది దివ్య పర్వత మధ్యంబున హారకిరీటికేయూ రాది దివ్యభూషణ భూషితుండై వేంచేసియున్న శ్రీనివాసదేవుని దర్శించి,

"స్వాభావికాన వధికాతిశయే శితృత్వం
నారాయణత్వయి నమృష్యతి వైదికఃక.

బ్రహ్మశివశ్శతమఖః పరమ స్వరాట్
ఇత్యేపి యస్య మహిమార్ణవ విప్రుష స్తే"

"ఈ చిదచిద్రూపజగత్తున కాధారంబై, ఆధేయంబై యున్న ఓ సర్వేశ్వరా! స్వభావ సిద్ధమైనదియు, అపరిచ్ఛేద్యమైనదియు, సర్వాధికమైనదియు నగు నీపరాత్పరత్వమును విశ్వసింపని వాడొకడుండునా? బ్రహ్మయు, శంకరుడును, ముక్తపురుషుడును, ఏ సర్వేశ్వరుని మహామహిమార్ణవమునందు శీకరములుగ నున్నారో అట్టి నీకునమస్కారము. ఈ భువనసృష్టి స్థితి లయంబులే నీక్రీడలు. అగాధసముద్రమునుభూమిగా నొనరించి జనపదంబులు గావింతువు. పట్టణంబులనెల్ల సముద్రముచేయుదువు. మూర్ఖుని మహాపండితునిగా, పండితుని బాలిశునిగా, బలవంతు నశక్తుగా, అశక్తుని సర్వసమర్థునిగా నొనరింతువు. అగ్నిని హిమంబుగా, హిమమును దారుణాగ్నిగా చేయగలవు. ఇట్టి అఘటన ఘటనా సమర్థుండవగు నిన్ను నేనేమని స్తుతింపగలను? నీవే ఈజగదాది దేవుండవు. జీవులను సస్యంబులను కారుణ్యామృత ధారలచే తడిపి, వారి కోరికలను ధాన్యంబును పండించుచున్న బృహత్కృషీవలుడవు. నీకు నమోవాకములు"అని స్తుతించి అచటువాసి, వీరరాఘవ క్షేత్రంబున తత్స్వామిని దర్శించి, సేవించి, సత్యవ్రత క్షేత్రమున కేగెను. కరిగిరియందు బ్రహ్మదేవుని హోమకుండమున నవతరించి, చతుర్భుజములతో, పుష్పగుచ్ఛంబులు గల కల్పవృక్షంబు భాతి విలసిల్లుచు, బ్రహ్మాది దేవతలెల్ల నిత్యపూజ లొనర్చిన హేతువున దేవనాయకుండను నామంబును ధరించి, వేగవతీ స్రవంతీ తీరమ్మున, పుణ్యకోటి విమానంబున శ్రీభూదేవు లిరుప్రక్కల సేవించుచుండ, అనిశంబును భక్తులకు వరములిచ్చెడి కారణమున వరదుండను బిరుదమును వహించి, నెంచేసియున్న దేవాది దేవుని, కరిగిరి వరదుని సేవించి, మంగళా శాసనముగావించి, అచ్చటినుండి కదిలెను. విరజా నద్యుత్తర భాగంబున గల శ్రీవైకుంఠమువలే, కావేరీ తీరమ్మునగల ప్రత్యక్ష

పరమ పదంబగు శ్రీరంగమున కరిగెను. సప్తప్రాకార భాసురంబై విచిత్ర రత్నస్థగిత సహస్రస్తంభగుంభితానేకమంటపాద్యలంకృతంబై యున్న దివ్య భవనమునందు ప్రణవవిమాన మధ్యంబున—

"కిరీటం శ్రీరంగేశయి తురుపధానీ కృతభుజో
విధీశాధీశత్వాద్ఘటత ఇతి సంస్పృశ్యవదతి
నిహీ నానాం ముఖ్యం శరణమితి బాహుస్తదితరః
స్ఫుటం బ్రూతే పాదాంబుజ యుగళమాజానుని హితః"

దక్షిణ హస్తముపధానముగా శిరస్సు క్రిందనుంచి, బ్రహ్మ రుద్రాద్యఖిల దేవతాసార్వభౌముండను నేనే యని కిరీటమును స్పృశించి చెప్పుచున్నదాయనునట్లు లొప్పుచుండ, రెండవ దివ్య హస్తమును జానువుల వరకును చాపబడి, సమస్త జీవులకు నాపాదార విందములేగతియని సూచించుచున్నదా యనునట్లు భాసించుచుండ శ్రీభూనీళాది దివ్య సీమంతినీ రత్నంబులు పదారవిందంబులచెంత సేవింపుచుండ, పవ్వళించియున్న రంగేశ్వరు నానందమ్మున దర్శించి, అచ్చట కొన్ని దినంబులుండి, దేవాదిదేవుని యాజ్ఞగైకొని, వీర నారాయణపురమునకు వచ్చెను. వీరనారాయణపుర బాహ్యోద్యానము నందు విడిసి యుండెను. ఆ పురజనులందరు నాథమునీంద్రుండనేక దివ్యదేశములు దర్శించి, ఎంతకాలమునకో మరలి మన గ్రామమునకు వచ్చుచున్నాడని ఎదురేగి స్వాగతించిరి.

దేవాలయార్చక బృందము సర్వేశ్వరాజ్ఞచే శఠగోపము, దివ్య చ్ఛత్రముగైకొని పంచమహావాద్య ఘోషతో నాథమునులకెదురేగిరి. నాథయోగీంద్రుండు సకుటుంబముగా, తమకెదురు వచ్చు పౌరులను, భగవత్పరివారమును దొడవ్వులజూచి, ప్రత్యుత్థాన మాచరించి, సాష్టాంగదండవత్ప్రణామంబు లాచరించెను. శఠగోపంబును శిరసావ హించెను. పురవాసుల యొక్కయు, భగవత్పరివారము యొక్కయు యోగక్షేమములు విచారించెను. భగవదాలయము నందు ప్రవేశించి,

ఆలయంబునకు ప్రదక్షిణించి. బలిపీఠమునకు మ్రొక్కులిడెను. ధ్వజ దండంబునకుదండములు పెట్టెను. వైనతేయునకు వినతులు గావించెను. ద్వారపాలకులగు జయ విజయులకు జయ పెట్టెను. గర్భాలయమును ప్రవేశించి, రుక్మిణీ సత్యభామాసమేతుడై వేంచేసి యున్న మన్నారు రాజగోపాలస్వామికి సాష్టాంగవందన ప్రణామంబులాచరించెను. తాను దర్శించి వచ్చిన పుణ్యక్షేత్రముల విశేషములను రాజగోపాలస్వామికి వినయముతో విన్నవించెను; ఆ విశేషముల నారకించి రాజగోపాలుడు నాథమునింజూచి “వత్సా! దివ్యదేశంబులన్నియు దర్శించి వచ్చితివి. ఇక మాత్రము నను విడనాడి నీ వెచ్చటికిని వెడలవలదు.” అని ఆదేశించి, నాథమానికొక నివాసము నేర్పాటుచేయుమని గ్రామప్రజలను హెచ్చరించెను, గ్రామస్థులొక చక్కని గృహంబు నిర్మించి యిచ్చిరి. నాథముని, సకుటుంబముగా రాజగోపాలుని సేవ చేయుచు నచ్చటనే నివసించియుండెను.

ఒకానొక సమయమున ఇరువురు వైష్ణవులు మేలునాటి నుండి చనుదెంచిరి. వారు నాథమునిందర్శించి, వారితోపాటు రాజగోపాల మాళి దర్శనము చేసికొని నమ్మాళ్వారు రచించిన తిరువాయి మొళి యందలి పాశురములను పదింటిని పాడిరి. ఆ పాశురములను విని నాథ మాని, ఆ వైష్ణవుల జూచి, “అయ్యలారా! ఈ పాశురములను రచించిన మహనీయులెవ్వరు? ఇవి ఏ గ్రంథములోనివి? వీనిలో నొక పాశురమునందు ‘ఓరాయిరం’ అనియున్నది కదా! అనగా ఇట్టి పాశురములు పదివందలుండ వలయును. మిగిలిన తొమ్మిది వందల తొంబది పాశురములు గూడపాడి విన్పింపుడు. చాల సొంపుగా నున్నవి. అర్థగాంభీర్యముగాని, శయ్యగాని, రసముగాని, పాకముగాని సమపాళ్ళలో కలిసి, యింతకంటె నుత్తమ కవిత్వము లేదనిపించు చున్నవి. మీకు కంఠస్థములైయున్నచో మిగిలినవి గాన మొనర్పుడు. మీకు రానియెడల నవి యెచ్చటలభించునో ఆనతిండు, నేనునునేర్చుకొనియెద” నని విన్నవించుకొనెను.

ఆ వైష్ణవులు నాథమునితో "మహాభాగా ! ఈ పాశురములు పది మాత్రమే ప్రపంచమున నున్నవి. ఏతద్గ్రంథ కర్త నమ్మాళ్వారలు. వారిది కురుకాపురము. ఆ గ్రామమునకు పోయినచో, మీ కచ్చట నేమైన లభింపవచ్చునేమో ? మా కింత కంటె నెక్కుడు రాదు" అని చెప్పి నాథముని యొద్ద సెలవు తీసికొని వెడలి పోయిరి. నాథమౌని ఆ దివ్యగ్రంథమును సంపాదింప వలయునని కురు కాపురమున కేగెను. అచ్చట వేంచేసియున్న వైద్యనాథుని దర్శించెను.

నమ్మాళ్వారికి సాష్టాంగవందన ప్రణామంబులాచరించెను. అచ్చటి పెద్దలను దర్శించి తిరువాయి మొళి విషయంబడిగెను. అంత వారు నాథమునింగాంచి, "యోగి సత్తమా, పూర్వము శఠగోప యోగి, తిరువాయి మొళిం జెప్పి ఈ వేయి పాశురములు ఎవ్వడు భక్తితో నొక్కసారి పఠించునో, అట్టివాడు వెంటనే యీ జన్మ బంధమంతయు, త్యజించి, నిత్యవిభూతి కేగ గలడు" అని దానికి వరం బొసంగెను. కావున మోక్షేచ్ఛగల వారును, కుటుంబముతో కలహించిన వారును, జీవితముపై విరక్తి జనించినవారును, ఆ తిరువాయి మొళింజదివి మోక్షమునందు చుండిరి. ఈ విషయముంజూచి, కొంత మంది స్త్రీలు, చదువురాని పురుషులు కొందరు చేరి "యీ తిరువాయి మొళింజదివినవారు మోక్షమున కేగు చున్నారో లేక నరకమున కే పోవుచున్నారో ? ఎవరి కెఱుక, కాని చదివిన వెంటనే శరీరమును విడచు చున్నారు. కావున నీ గ్రంథమిక భూమి మీద నుండరాదు. ఉన్నచో ప్రపంచమే నిర్జనమైపోవును. ఎట్లైనను, దీనిని నశింపజేయ వలె"నని యెంచి ఆగ్రంథ ప్రతులనన్నిటిని సేకరించి, వానిని తామ్రపర్ణీ నదీ గర్భమున బురదలో త్రొక్కివైచిరి. ఆగ్రంథము నశించెను. కాని ఈశ్వర సంకల్పముచే రెండు తాటియాకులు ప్రవాహమున కెదురీది వచ్చు చుండెను. ఆ నదియందు స్నానము చేయుచున్న మహానుభావుండొకఁడా ఆకులను తీసికొని వచ్చి, శఠారాతిచే వచింపబడిన

సహస్ర గీతి యందలి పాశురములను మెఱింగి వానిని భద్రము చేసెను. అప్పటి నుండియు ఆ పది పాశురములే ప్రచారమున నున్నవి. మిగిలిన గ్రంథమంతయు తామ్ర పర్ణీనది పాలైనది” అని వచించిరి.

ఆవాక్కులను నాథమాని విన్నబోయి “అయ్యలారా ఆమహో త్కృష్ట గ్రంథరాజం బెట్లు ప్రాప్తించును? దానికిక మార్గమే లేదా? అట్టి గ్రంథము లేకుండుట, ఈ విశ్వము చేసికొన్న దురదృష్టము. జను లెంత నిర్భాగ్యులు! దీనిని సాధించుట కేదియైన యుపాయమున్నచో నానతిండు. ఎంత దుస్సాధమైనను సాధించి తీరెద”నని పలికెను. వారు నాథమాని దృఢాభిప్రాయమున కలరి “స్వామీ! మీరు మహాపురు షులుగనున్నారు. ఆగ్రంథ సంపాదనమునకు మీరే సమర్థులు. దానిని పొందుట కొక యుపాయమున్నది. నమ్మాళ్వారి ప్రథమ శిష్యులగు మధుర కవి ఆళ్వారు ‘కణ్ణిన్ శిరుత్తాంబు’అను గ్రంథమును గురు విష యముగా చెప్పిరి. ఆ గ్రంథమును శఠారాతియున్న చెట్టుక్రింద కూర్చుండి, అన్నపానాదులు వర్జించి, పన్నెండు వేల పర్యాయములు ఆవృత్తము చేసినచో శఠగోపులు ప్రత్యక్షమగుదురు. ఆగ్రంథమునకట్లు నమ్మాళ్వారు వరమొసంగిరి. అట్లొనర్పగలవేని, వారు ప్రత్యక్షమై దానిని నీకుపదేశింతురు. అంతియకాని, వేరొకయుపాయమున నది సాధ్యముకాదు”అని విన్నవించుకొనిరి.

ఆవాక్యము లాలించి నాథమాని, ధన్యోఽస్మియని, ‘శరీర మొసంగియైన యీ కార్యము నెరవేర్చెద’నని నిశ్చయించుకొని, తామ్రపర్ణియందు నిమజ్జనం బొనరించిరి. ద్వాదశోర్ధ్వపుండ్రములు దాల్చిరి. నమ్మాళ్వారి సన్నిధికింబోయి చింతచెట్టుక్రింద బద్ధ పద్మా సనస్థుండై ‘కణ్ణిన్ శిరుత్తాంబు’ చదువుట కారంభించెను. అహోరాత్ర ములు తిరిగిపోవు చుండెను. నాథమాని అన్నపానీయములు వర్జించెను. మనస్సునేకాగ్రముగానిలిపి చదువుచుండెను. ఆ పరిసర ప్రజలు గుంపులు గుంపులుగావచ్చి నాథమునిని దర్శించి పోవుచుండిరి. కొందరు జ్ఞానులు

"ఆహా ! ఏమి యీ నాథమునిదీక్ష. ఇన్ని దినములు నిరాహారుడై ఏకాగ్ర స్థితుడై పఠించుచున్నాడు. తప్పక శఠగోపులు ప్రత్యక్ష మౌదురు" అని భావించుచుండిరి.

శఠారాతి నాథమునుల భక్తిదీక్షల కానందమంది దివ్య తేజమ్ముతో ప్రత్యక్షమయ్యెను. నాథమౌని శఠారాతికి ప్రణమిల్లి దివ్య వాక్కులతో వినుతించి కృతాంజలియై లేచి నిలువబడెను. వకుళాభరణయోగి, నాథయోగింజూచి "వత్సా ! నీ దీక్షకు, స్తోత్రమునకు, భక్తికి, మిక్కిలి సంతసించితిని. దీనికొఱకు నీవింతటి దృఢదీక్షపూనితివో తెలియజేయుము. దానిని తప్పక నీకొసంగెద" నని మాట యిచ్చెను. నాథమౌని, మరల శఠారాతి పాదములపైబడి లేచి, నిటల తటఘటితాంకలియై "అయ్యా ! తమరు పూర్వమనుగ్రహించిన 'తిరువాయి మొళి' నశించిపోయినది. దానిని మరల నాకు ప్రసాదింపుడు" అని వేడుకొనెను. అంత శఠగోపులా తనితో "వత్సా ! నేనొకయవనిక మాటున నుండి చెప్పుచుండెద, దానిని చక్కగా లిఖింపుము" అని దివ్యజ్ఞానమొసంగెను. నాథముని వ్రాయుచుండగా నమ్మాళ్వారలు 'తిరువాయి మొళి'మరల సమగ్రముగా చెప్పిరి. అష్టాంగ యోగ రహస్యాదులన్నియు వివరించిరి. తరువాత నాథమునితో "వత్సా ! ఈ గ్రంథమునకై మిక్కిలిశ్రమపొందితివి. నీకృషికి ఆనందించితి. ఏదైన ఒక వరముకోరుకొమ్ము. ఇచ్చెద"నని పలికెను.

ఆమాటలకమందానందకందళిత హృదయారవిందుడై నాథముని "జగదాచార్యా ! ఈ సహస్రగీతిక చదువగనే మోక్షము వచ్చునట్లు తమరు పూర్వమనుగ్రహించిరి. దానిని మార్చి ఎవ్వరిద్దానినిచదివినను, వెంటనే మరణింపక, ప్రారబ్ధానంతరము మోక్షము ప్రాప్తించునట్లు వరంబొసంగుము. లేనిచో పూర్వమువలెనే కాగలదు" అని ప్రార్థించెను. శఠగోపులంగుల కంగీకరించి 'అట్లే' అనిపలికి, నాథముని కనేక వరంబులు, ఆశీర్వాదంబులు నొసంగి అంతర్హితులైరి.

నిర్ధనునకు పెన్నిధిలభించినట్లు మోదాబ్ధి వీచికలతేలియాడుచు, నచ్చటి పెద్దలకు చెప్పి, వైద్యనాథస్వామి యొద్ద సెలవుగైకొని తిరిగి వీరనారాయణ పురమునకు వచ్చెను. తాను సంపాదించిన నిధిని లోకోపయోగార్థము వినియోగింపదలచి, తిరువాయిమొళి వేయిపాశురములకు స్వరసంతతి కల్పించి, సామగానముచే పాడునట్లొనర్చి కొందరికి నేర్పించి లోకవ్యాప్తిని చేయించెను.

చోళదేశమునం దొకానొక యూరిలో నిద్దరు వేశ్యలుండిరి. వారిలో నొక్కరితె మనుష్యగాన మొనరించును. వేరొక్కతె దేవగానము చేయును. వారిరువురు కలిసి యొకనాడు చోళరాజ సభకేగిరి. ఆసభయందు వారివారి ప్రావీణ్యము లతిశయింప గానమొనరించిరి. వారి గానముల నాకర్ణించి, సభికులును, రాజును మనుష్యగానము చేసిన వేశ్యను రత్నకాంచనా భరణాదులొసంగి సత్కరించిరి. దేవగానము చేసిన వేశ్యాకాంతను సన్మానింపరైరి. అంత దేవగాన మొనర్చిన వేశ్య రాజును జూచి "ప్రభూ! మానవగానము చేసిన నాతోడి వేశ్యను సత్కరించితిరి. నేను దేవగానమును చేసితిని. మీరు నన్ను సమ్మానింపలేదు. కారణమేమి?" యని ప్రశ్నించెను

అందులకురాజు "తన్వీ! ఆమెగానము మాకందరకును తెలిసినది అందులకై ఆమెకు బహూకృతు లందించితిని. నీవు దేవగానము చేసితి నంటివి. అది దేవగానమో, పిశాచ గానమో మాకు తెలియలేదు. అందువలన నిన్ను గౌరవించలేదు" అని బదులు చెప్పెను. ఆమాటలకు వేశ్యలజ్జించి, నావిద్య యెంత గొప్పదైననేమి? అది తెలియని వారి సమక్షమున ప్రదర్శించి తృణీకరింపబడితిని.

"విద్వానేవవిజానాతి, విద్వజ్జన పరిశ్రమం
నహివంధ్యా విజానాతి గుర్వీం ప్రసవ వేదనాం"

విద్వాంసుడే విద్వాంసుని పరిశ్రమ నెఱుగగలఁడు. మూర్ఖుడు తెలిసికొనజాలడు. ప్రసవించునప్పుడు కలుగు వేదన సంతానవతి యెఱుంగును గాని, గొడ్రాలి కేమి తెలియును ! ఈ కాలమును గొప్ప గొప్ప విద్యయలకు తావులేదు కావుననే దివ్య గ్రంథము లడుగంటినవి. తర్క వ్యాకరణాది శాస్త్రములన్నియు మృగ్యములైనవి. మహారసవత్కావ్యము లీసడింపబడుచున్నవి. నీరసములు-అనుదాత్తములు, పేలవములు నగు పదముల కూర్పులు మహా కవిత్వముగా గౌరవింపబడుచున్నది. "ఉల్లిమల్లియగునే, పిల్లి బెబులియగునె" అని తేలికపదములతో అందరకు నందుబాటులో నున్నదే కవిత్వమని నిర్దేశించుచున్నారు. కఠినపదయుక్తమై గంభీరభావావేశ ప్రాధాన్యమైన కవిత వేలయని అధిక్షేపించు చున్నారు. ఏమి ! ఈకలి విజృంభణము అని వచించుచు సభనుండి బయటకు వచ్చెను.

ఆమె ఆవిధముగా అనేక దేశములు తిరుగుచు నొకనాఁడు వీర నారాయణ పురంబున కరుదెంచి మన్నారు రాజగోపాలస్వామి వారి యెదుట దేవగానముతో సర్వేశ్వరుని స్తుతించుచు నిలువ బడెను. ఆ సమయమున నాథముని లాలయముననేయుండి పరవశత్వముతో నాగానమునువిని, పులకీకృత దేహుడై ఆమెతో "అమ్మా ! యీ గానము నెట్లు నేర్చితివి ? ఎవరు చెప్పిరి ? మనుష్య గానమును వినుచుంటిమిగాని, యీ దేవగాన మపూర్వము. ఎన్నడును వినమైతిమి. చాల సంతోషము కలిగినది" అని పొగడి, ఆమెకు స్వామివారి శేష వస్త్రమును, తీర్థ ప్రసాదముల నిప్పించి పంపించెను.

ఆవేశ్య అప్పుడే రాజసభ కేగి "రాజచంద్రా ! నాగానమును తెలియదని మీరు తృణీకరించి త్రోసిపుచ్చితిరి. నాగానము నెఱింగిన మహా మనీషి వీరనారాయణ పురంబునగలడు. అతడు మూర్తీభవించిన తపోరాశి. బ్రాహ్మణ కులస్థుడు. ఉత్తముడు ఆయనను నాథముని యని లోకులు వ్యవహరింతురు. ఈ దేవగానము నాయన పరి

పూర్ణముగా నెఱుంగు. నాయనను పిలిపించి విచారింపుడు" అని విన్నవించుకొనెను.

రాజు సగౌరవముగా నాథమునిని పిలిపించి, సభ చేయించి, వేశ్యల నిద్దరిని రావించి, గానము చేయించెను. అంత నాథముని ఆరాజునుచూచి "దేవగాన మొనర్చిన యీమె విద్యాధికురాలు. ఈమెను గౌరవించి పంపుము" అని పలికెను. ఆ మాటలకు రాజు "ఆర్యా! ఆ దేవగానమేమో మాకెవ్వరికిని అర్థముకాలేదు. మీకు తెలిసినట్లు మాకేమిగుర్తు? మీరలామెపై అభిమానము చేతనో, ప్రేమచేతనో లేక వేరువిషయములచేతనో ఈవిధముగా చెప్పుచున్నారు అని మేము భావింప వచ్చునుగదా!" అనెను.

ఆమాటల కలరి నాథమునులు "రాజశేఖరా! లెస్సగా మాటాడితివి. సంతసించితిని. నాకు దేవగానము తెలిసినదానికి, నొక పరీక్ష నేర్పాటు చేసెద. 500 తాళముల జతలు తెప్పింపుము. వాని నన్నింటి నొక్కసారి మ్రోగింపుడు. ఆధ్వనిని విని ఆతాళముల బరువు చెప్పెద. సరిగా చెప్పినచో నాకు దేవగానము తెలిసినట్లంగీకరింపుము, లేనిచో విశ్వసింపవలదు" అని బదులు చెప్పెను. ఈ పరీక్షకు, రాజును సదస్యులును సంతసించిరి. అంత 500 తాళములు తెప్పింపబడెను. అవి యన్నియు నొక్కసారి మ్రోగింపబడెను. ఆధ్వనివిని నాథముని యొక్కొక్క తాళపు జతబరువు వరుసగా చెప్పెను. అవితూచి, నాథముని సక్రమముగా చెప్పెనని సంతసించి, గానముల విషయము నాథమునికి తెలియునని అంగీకరించిరి. ఆ వేశ్యను ఘనముగా సత్కరించి పంపించి, రాజు నాథమునుల మాహాత్మ్యము ననేక విధముల కొనియాడి, అనేక దివ్యాంబరాభరణ వస్తు వాహనాదులు సమర్పించి, పూజించెను.

అంతనాథమౌని పుడమిఱేనుంజూచి "భూపాల చంద్రమా! ఈ వస్తువులు మాకెందులకు? భోగేచ్ఛగల మీ వంటివారికిని కావల

యును. తాపసులము మాకేల? ఇచ్చట గల బీదలకు పీనిని పంచి పెట్టుము" అని చెప్పి స్వగ్రామమున కేగెను. తృణీకృత దేవతా సార్వ భౌములు సమలోష్టాశ్మకాంచనులగు మహనీయులకు, ఈ గ్రామ్య వస్తువులయందు కాంక్షయుండునా? ఇట్లు నాథముని రాజగోపాల సేవ చేయుచు వీరనారాయణపురమున వసించియుండ, పుండరీకాక్షులు (ఉయ్యక్కొండారు) కురహవాలప్పన్ మొదలగు వారనేకులు వచ్చి వారి నాశ్రయించిరి. వారిలో కురహవాలప్పన్ గారికి అష్టాంగ యోగ రహస్యము నుపదేశించి, పుండరీకాక్షులను జూచి "వత్సా! నీవీవైష్ణవ దర్శనమును నిర్వహించు చుండుము" అని చెప్పి బ్రహ్మసూత్రముల అర్థమగు బోధాయన మహర్షి కృతవృత్తిని, అష్టాక్షరీ మహామంత్ర మును, ద్వయమంత్రమును, చరమ శ్లోకమును, అర్థాను సంధాను పూర్వముగా నుపదేశించి అనేకుల నుద్ధరించుచు అష్టాంగయోగ సాక్షాత్కృత హృత్పుండరీక భగవద్దివ్య మంగళ విగ్రహుండై నివ సించియుండె.

ఒకానొక దినమున చోళరాజు తన భార్యా ద్వయముతో వీర నారాయణపురమునకు వచ్చెను. రాజగోపాలస్వామిని దర్శించి తిరిగి రాజధానికి పోవుచు నాథమునుల గేహమున కరుదెంచెను. అచ్చట బాలబాలికలాడుచుండగా చూచి "నాథముని యేమిచేయుచున్నా" డని యడిగెను. వారు భూపతింగాంచి "నాథమునులు గృహంబున ధ్యాన యోగమున నున్నారు" అని చెప్పగా మరియొక పర్యాయము వచ్చి నపుడు చూచి పోవచ్చును అని వెడలిపోయెను.

నాథముని యోగసమాధినుండి లేచెను. ఆ బాల బాలికలు ఆయనతో "ఎవరో రాజు ఇద్దరు భార్యలతోకూడి వాహనముపై వచ్చుచు, మన యింటియొద్దదిగి నాథముని యేమిచేయు చున్నాడని అడిగెను. వారు యోగసమాధిలో నున్నారని మేము చెప్పగా తిరిగి తన వాహనముపై వెడలిపోయెను" అని చెప్పిరి. నాథముని వారిని

జూచి "అయ్యయ్యో! ఆయన మనయింటికి వచ్చి అడిగినప్పుడే చెప్ప వలదా? ఎంత పొరబడితిరి. ఆవచ్చినవాఁడు గోపాలమౌళి. దేవేరు లిరువురు, రుక్మిణీ సత్యభామలు. ఆ ఎక్కివచ్చిన వాహనము గరుడుఁడు. జగత్కర్త మన నిలయమునకు రాగా మీరు నాతో చెప్పకుండితిరి. నాస్థితి ఎంత దౌర్భాగ్యమైనది! సిరిరా మోకాలొడ్డిన వాని వలె నున్నది. ఇప్పటికైనను గోచరింతురేమో పోయి చూచివచ్చెద" నని చెప్పి వీధివెంట బయలుదేరి పోవుచుండెను. ఆవిషయము నెవరో చెప్పగా పుండరీకాక్షులు మొదలగు శిష్యులు కొందఱు వెంటబడి గురుపుంగవుని జేరి నమస్కరించి, "ఆర్యా! మీరిట్లు ఎవ్వరి కొఱకు వెదకుచుండితిరి? మీరు సర్వజ్ఞులైనను, ఈ విషయమున పొరబడితిరి. ఆవచ్చినవాడు గోపాలబాలుడుకాడు చోళభూపాలుడు. తన భార్యా ద్వయముతో నేనుగునెక్కి వచ్చి రాజగోపాలస్వామిని దర్శించి పోవు చున్నాడు. అతనితో మనకేమిపని? రండు పోవుదము" అనిచెప్పి యింటికి తీసికొనిపోయిరి.

ఒక దినమున నాథముని స్వహృత్పుండరీకస్థుండై దివ్యతేజో మయాకారుండై వెలుగొందు జగదీశ్వరుని యోగసమాధిచే చూచుచు భగవదనుభవ తత్పరుండై యుండి, కొంత సేపటికి లేచికూర్చుం డెను. ఆ బాల బాలికలువచ్చి "అయ్యా! ఎవరో యిద్దరు పురుషులు ధనుర్ధారులై, తూణీర ఖడ్గధరులై పీతాంబర ధారులై మన యింటికి వచ్చినారు. వారిమధ్య దివ్యాంబరా భరణ భూషితయగు నొక కాంత యున్నది. వారివెంట నొక వనచరుడు కలడు. వారందరును మన గేహమునకు వచ్చి నాథమును లేమిచేయుచున్నారని ప్రశ్నించిరి. ఇంట్లో నున్నచో మారాక వారికి తెలియజేయుడు" అనిరి. మేము వారిని జూచి నాథమునులు యోగసమాధి యందున్నారు. ఇప్పుడు లేవరు. ఎవరితోడను మాటాడరు. అని చెప్పితిమి. అంతట వారు నలువురును కలిసి ఈ బజారువెంట వెళ్ళిరి అని వచించిరి.

వారి వాక్యములాలించి పిల్లలను జూచి "పిచ్చిపిల్లలారా! ఎంత మోసము తెచ్చిపెట్టినారు.

"అగ్రతః ప్రయయౌరామః సీతామధ్యే సుమధ్యమా
పృష్ఠతస్తు ధనుష్పాణిః లక్ష్మణోనుజగామహ"

ముందు ధనుర్ధరుండై రామచంద్రస్వామియు, మధ్యభాగమునందు సన్నని నడుముగల సీతాదేవియు, వెనుక శరచాపధారియగు లక్ష్మణుడును అరిగిరి. అని రామాయణమున చెప్పబడినట్లు ఆ వచ్చిన వారు, సీతారామలక్ష్మణులు. ఆవనేచరుడు హనుమంతుడు. వారందరును కలసి నాదర్శనార్థము ఇచ్చటకు వేంచేయగా మీరు పాడుచేసినారు. చేతికందిన మహాఫలమును వ్యర్థ మొనర్చిరి. మిమ్మేమని నిందించినను నిష్ప్రయోజనము. నాకా దుష్ట సమాధి వారువచ్చినపుడే ఏల కలుగవలె? సర్వేశ్వరుడు ప్రపత్తికేగాని, యితరయోగములకు గోచరింపడు అని పెద్దలు చెప్పిన వాక్యము లేలతప్పు?" అని నిర్వేదించెను. కురహవాలప్పన్ అను శిష్యునకు అష్టాంగయోగ రహస్యములను మరువ వలదని చెప్పెను. పుత్రుడగు నీశ్వరభట్టును చూచి "బిడ్డా! నీకు నావంటి కుమారుండొకం డుదయించు ఆతనికి యమునాచార్యులని నామకరణము చేయుము" అని వచించి పుండరీకాక్షులను జూచి "నీవీ వైష్ణవ దర్శనమును నిర్వహించుచు, నామనుమడు భగవత్తత్త్వమును వీడి రాజ్య పరిపాలనా వ్యాసంబున తగిలి వర్తించునపుడు భగవత్తత్త్వంబు నుపదేశించి మరలనతనిని వైష్ణవసిద్ధాంతమున పాదుకొల్పి మత్సన్నిధానమునకురమ్ము" అని ఆజ్ఞాపించెను. తదుపరి "అయ్యో! భగవదర్శనమునకు దూరుండనైతిగదా" యని వగచుచు "జలేవిష్ణుః స్థలేవిష్ణుః విష్ణుస్స్థావరజంగమః అంతర్విష్ణు ర్బహిర్విష్ణు స్సర్వవిష్ణుమయం జగత్" నీరు విష్ణుస్వరూపము. భూమియు చరాచరంబులును, లోపలి వెలుపల భాగంబులును, సర్వజగత్తంతయు విష్ణుస్వరూపము అనెడి న్యాయమున లోకమంతయు విష్ణు స్వరూపముగా

నాతడు దర్శింపగలిగెను. సీతారామ లక్ష్మణుల దర్శించెదగాక యని నిలయమును వీడి బాలకులు చెప్పిన మార్గమువెంటబడెను. ఆవీథివెంట వచ్చిపోవువారిని చూచి "అయ్యలారా! ఈ మార్గమున ధానుష్కులిరువురు, ఒక వనితయు, వనచరముతో పోవుటకంటిరా? యని, ప్రశ్నించుచుండెను. ఆర్తి అధికమయ్యెను. పరమాకాశమునందైనను సర్వేశ్వరుని దర్శింప వలయునని యెంచి, ఆనాథముని వరుండు దివ్య లోకమునకు వేంచేయ వాంఛించెను. భగవదేకాంతచింతాసమాక్రాంతుడై యుండెను.

"చక్రాష్టకేవ్యష్టిరూపాం సర్వానందే సమష్టికాం
అష్టాక్షరీం మహావిద్యాం ధ్యాయేన్నారాయణాత్మికామ్"

క్రమముగా మూలాధార, స్వాధిష్టాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, జ్ఞాన, లలాటక, సర్వానందాభిధానముల చక్రాష్టకము కలదు. అష్టాక్షరీ మహామంత్రము 8 అక్షరములు వరుసగా నున్నవనియు, సర్వానంద చక్రమునందు పూర్తిగా నున్నదని శాస్త్రములు వక్కాణించుచున్న కతమున ఆ అష్టాక్షరీ మంత్రమును నాథముని స్మరించుచుండెను.

నాథముని గురుండగు పరాంకుశముని దివ్యపాదారవిందములు ధ్యానించుచు, హృత్పుండరీకాధిష్ఠితుండగు పరమపురుషుని అనుగ్రహముచే మూలాధారమునందు, తద్గత కతిపయ సూక్ష్మతత్త్వములచే నిర్గమించెను. 'శతంచైకాచ హృదయస్యనాడ్యస్తాసాం మూర్ధానమభి నిస్సృతైకా, తయోర్ధ్వమాయన మృతత్త్వమేతి' హృదయము నుండి వ్యాపించిన నాడులునూటఒక్కటి వానిలో సుషుమ్న 'యను పేరుగలనాడి, ఊర్ధ్వముగాపోయి బ్రహ్మరంధ్రమును పోవునది. మిగిలిన నాడులు శరీరపార్శ్వములకు క్రిందకు పోయినవి. ఊర్ధ్వగత సుషుమ్నా నాడినుండి నిర్గమించిన జీవుడు మోక్షమునకు పోవును. మిగిలిన నాడు

లనుండి నిర్గమించిన జీవులు మరల పునర్జన్మమునంది యీ లోకమునకు వత్తురు." అని కఠోపనిషత్తు వచించుచున్నది.

నాథముని సుషుమ్నానాడినుండి, సహస్రార చక్రమునుండి, బ్రహ్మరంధ్రమును ఛేదించుకొని, ప్రణవవిమానారూఢుండై మనస్సే సారథిగా అర్చిరాదిమార్గమున చనియెను. మార్గమధ్యమున వరుసగా వహ్నిలోకము, దినాధిపతిలోకము, పూర్వపక్షాభిమానిలోకము, ఉత్తరాయణాధికారిలోకము, అగ్ని, వాయు, సూర్య, చంద్ర, విద్యుత్, వరుణ, ఇంద్ర, విధాతృలోకంబులు దాటుచు, తల్లోకాధిపతులచే నర్చింపబడుచు, ఒకదానికంటె మరియొకటి, పదిరెట్లధికముగనున్న ఆవరణసప్తకంబును దాటెను. యుగపదాగతశతసహస్ర సమానాంధకార బంధురంబైన మూల ప్రకృతి నుత్తరించెను. శివవిధి సనకాదులకు అవాఙ్మనసగోచరంబై సూర్యచంద్రాగ్ని ప్రకాశ నిరపేక్షంబై, కోటిసూర్యప్రభానిభదివ్యజ్యోతిర్మయంబై, ఆమోద సమ్మోద ప్రమోద వైకుంఠాఖ్యభేదంబై "పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాద స్యామృతందివి" అను వేదవాక్యానుసారము ఈభూతజాలముతో కూడిన విశ్వమొకపాదము నిత్యవిభూతి మూడు పాదములు. ఈ నిత్యవిభూతి పరమపదము, పరమాకాశము, అమృతాకాశము అను పేర్లు కలిగియున్న దివ్యలోకమునకు పోయెను. అచ్చట అమృతప్రవాహ పూరితంబై దివ్యవాహినిగా రజోఽభావలేశంబుచే విరజయను పేర భాసించు దివ్య నదియందు నాథముని స్నానము చేసెను. అందు లింగశరీర ధూననం బొనరించెను. జ్యోతిర్మయాకారుండై నీలనీరద నిర్ముక్త రాకాసుధాకరుని భాతి ప్రకాశించుచు, మహోన్నత శాఖాలసత్తిల్య వృక్షమూలంబున కొంతసేపు విశ్రమించెను. చతుర్భుజ విరాజమానుండై, దివ్య భూషణ భూషితుండై అమానవకర స్పర్శంబుచే చతుర్భుజ విరాజింబును, పంచోపనిషన్మయంబునునగు సుందర సుకుమార దివ్యదేహమును తాల్చెను. భగవదానంద విహీనమై స్వ స్వరూపానంద కందళిత

హృదయారవిందులగు కేవలులకు నివాసంబైయున్న కైవల్యమును, పార్శ్వభాగమ్ముల గోచరించుచుండెను. దివ్యప్రవాహపేరమ్మదీయ తటాకస్థమగు నశ్వత్థమూలంబునకు చేరి ఆతడు కూరుచుండెను. అంత దివ్యాంబరాభరణోపేతలగు పంచశత దివ్యాప్సరసలు, నిత్యసూరి, బృందములతో, శంఖకాహళపటహభేరీమృదంగాది దివ్యవాద్య ఘోషంబులతో నెదురువచ్చి ఆయనను బ్రహ్మాలంకారముచే నలంకరించిరి. భగవత్సంకల్ప కల్పితంబగు దివ్యమాల్యోపశోభితంబగు దివ్య విమానంబును వైనతేయుఁడు తీసికొని వచ్చెను. అపుడు నాథముని అమ్మహాత్ముని పాదారవిందములపై బడి యనేక విధమ్ముల ప్రస్తుతించెను. ఆ మహాపురుషుండు నాథమును లనాలింగనాద్యుపచారములచే లాలించెను. తదుపరి నాథమునిని ఆవాహనము నం దారోహితుం జేసికొని పోయెను. ఆ విమానము ద్వాదశ ప్రాకారశోభితంబగు దివ్య వైకుంఠమును సమీపించెను. అనేక యోజన ప్రమాణంబై, అత్యున్నతంబై దివ్యరత్నాలంకృతంబై, మణిమయతోరణ వితాన సుందరంబై యున్న దివ్యగోపురంబును జూచి, దానికి రెండుచేతులు జోడించి జోహారులొనరించి, వాహనమునుండి క్రిందికి డిగ్గెను. గోపురంబును దాటి నగరమ్మును ప్రవేశించెను అస్పృష్ట సంసారగంధులగు విష్వక్సేనాది నిత్యసూరు లెదురువచ్చిరి. వారికి సాష్టాంగనతు లొనరించెను. వారు తమతమ గృహంబులలోనికి గొనిపోయి భార్యాసహితులై యర్చించిరి. పరుసవేది సోకిన లోహము, హేమించినట్లు అనేక జన్మ పరంపరలయందు తాననుభవించిన తాపత్రయాగ్ని సర్వమును శమించెను. ఆతడు మహానందకందళితుండై నిత్యసూరులతో కూడి, విధి శివ సనకాది మహాయోగుల కందరానిదియు, నిత్యైశ్వర్యయుతులగు దివ్య పురుషసీమంతినీ సంఘములకు నాస్పదమైనదియు, నిత్యసూరులకుగూడ ఇయదైశ్వర్యము, ఇయత్ప్రమాణము, అని చెప్పుటకు వీలుగానిదియు, విశాల దివ్యవీథులు గలదియునగు శ్రీ వైకుంఠనగరంబున ప్రవేశించి

తిరుమామణి మంటపమును చూచెను. దానియందు పారిజాతమందార కల్పవృక్షాది దివ్యానోక హసమూహ విరాజితానేక శతసహస్ర దివ్యోద్యాన విహరణ శుకపిక శారికా సముదయకల కలారావంబువీనుల విందై యుండెను. దివ్యపరిమళ రసోపేతానేక హ్రదాంతర్వర్తిత కల్హార సౌగంధికాంభోజేంది వరనట త్కలహంసీ, హంస చక్రవాక కారండవాది దివ్యఖగములు కన్నులవిందు చేయుచుండెను. అందు జగన్మాతయగు లక్ష్మీదేవి గుణగణంబులు వర్ణించుచున్న శుకంబులును, సర్వేశ్వరుని లీలావిషయంబులగు గానమొనరించుచున్న పికంబులును, భూదేవి మహాత్మ్యమును ప్రకటించుచున్న శారికలును, స్ఫటికమణి నిర్మిత సోపాన విరాజితానేకవాపీ కూపంబులును గలవు. వాని నన్నింటిని దర్శించుచు, పాటలీపున్నాగ పుష్పరస గంధమత్త మధుకరగీయమాన, మనోహరగాన సంయుతమును, దివ్యసౌరభమందానిల సేవ్య మానమును, రాశీభూత పుష్పసంచయంబును, గల దివ్యపర్యంకముమీద రాకా సుధాకర సహస్రసదృశుండై, దివ్యరత్నఖచిత సహస్రఫణ విరాజితుండగు ననంతునిమీద, శ్యామసుందర దివ్యవిగ్రహుండును, వనమాలా విరాజితుండును, కిరీట కేయూరగ్రైవేయక ముక్తాదామోదర బంధన కటిసూత్ర మంజుల పీతాంబరాది దివ్యభూషణ భూషితుండును, స్వాభావికానవధికాతి శయజ్ఞాన బలైశ్వర్య వీర్య,శక్తి తేజస్సౌశీల్యవాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సౌమ్యకారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య చాతుర్య స్థైర్య ధైర్య శౌర్యపరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞతాద్య సంఖ్యేయ కళ్యాణ గుణగణ మహార్ణవుండు, అఖిలభువన జన్మస్థేమ భంగాదిలీలుండు, భక్తాభీష్టప్రదుండు, నిత్యసూరి నిర్వాహకుడు, చేతనోద్ధరణ దీక్షాధురంధరుడు, ఉభయ విభూతి నాయకుండును నగు నారాయణుండు దక్షిణ హస్త, ముపధానంబుగా, రెండవ దివ్య హస్తమునుసాచి పవ్వళించి యుండెను. వచ్చుచున్న నాథమునింగాంచి "కస్త్వం" నీ వెవ్వడవు ? అని ప్రశ్నించెను. నాథముని "అహం

బ్రహ్మాసి” నేను పరబ్రహ్మనగు చున్నాను. అని బదులు పలుకుచు, “పాదేనాధ్యారోహతి” అను వేదవాక్యానుసారము శేషునిపై రెండు పాదములుంచి యెక్కుచు “సర్వమంగళ విగ్రహాయ శ్రీమతే నారాయణాయనమః” అని యుచ్చరించుచు, నెక్కి జగదీశ్వరుని పాదారవిందమ్ములకు నమస్కరించెను.

దూరదేశగతుండగు సుతుండు మరలి తిరిగి వచ్చిన తండ్రి యెంత సంతసించునో అట్లే నాథమునిని గాఢముగా పరిష్వజించి, ‘నాయనా! అనేక కాలమునుండియు సంసార బంధము ననుభవించుచుంటివి. ఇప్పటికి ఆ బంధములన్నియు వదలి నన్ను సమీపించితివి. ఎన్ని కల్పములు గతించినను, నీకిక బంధన ప్రాప్తి లేదు’ అని దీవించి, జగన్మాతయగు లక్ష్మీదేవికి నొప్పగించెను. ఆమె నాథమును లనేక విధముల లాలించి, శరీరం బొక్కపరి ఆపాదమస్తకమును స్పృశించెను. అపుడు నాథమునులు శంఖ చక్రాది దివ్యాయుధములతో, హార కిరీటాది దివ్యభూషణములతో సర్వేశ్వర సారూప్యంబు కలవాడై భాసించెను. ఇట్లు నాథమునులు పరమాకాశముం జెంది సుఖంబుండెను.

ఇంక ఇచ్చట పుండరీకాక్షుడాదియగు శిష్యులు కుమారుడగు నీశ్వరభట్టుతో కలిసి, నాథమునుల నారయుటకై ఆతడు పోయిన తెరువు వెంట బడిపోయిరి. ఒకచోట నాథమునుల కళేబరము పడియుండెను. ఆకళేబరమును గాంచి వారందరును దుఃఖించి, ఆ విగ్రహమును తీసికొనివచ్చి బ్రహ్మమేధ సంస్కారముగావించిరి. ఈశ్వరభట్టు తండ్రికి నూర్ధ్వ దైహిక క్రియలు నిర్వహించి, పరమ పదోత్సవము నిర్వర్తించి, అనేకులకు దక్షిణ లొసంగి, వీరనారాయణపురంబున ధైర్యంగూడి నివసించి మన్నారురాజగోపాలస్వామికి కైంకర్యము లొనరించుచు సుఖంబుండెను.

పుండరీకాక్షులు విష్ణుదర్శనము నిర్వహించుచుండ శ్రీరామమిశ్రులు మొదలగు మహాపురుషులనేకులువచ్చి వారి పాదము లాశ్ర

యుంచి శిష్యులైరి. వారికి గురుండు మంత్ర, మంత్రార్థము లుపదే శించి, నాలాయిర ప్రబంధముల అర్థానుసంధాన పూర్వకంబుగా నుపదేశించెను. బ్రహ్మసూత్రములను, బోధాయన మహర్షి ప్రణీత మగు వృత్తిని శ్రీరామ మిశ్రులకు చెప్పెను. కొంత కాలమునకు పుండరీకాక్షులకు భార్యావియోగము సంభవించెను. ఆ కారణమున శ్రీరామ మిశ్రులు గురువుగారి కుటుంబ భారమును పై వేసికొని గురువునకు సమస్త సపర్యలు చేయుచుండెను. ఒకానొక దినమున శ్రీరామ మిశ్రులు పుండరీకాక్షుల సుతల నిరువుర కొలనికి తీసికొని పోయి స్నానము చేయించి, మరల నింటికితీసికొని వచ్చుచుండెను. దారిలో నొకచిన్న బురదకాలువ గలదు. ఆకాలువనుజూచి పిల్లలిద్ద రును, స్నానముచేసిన మేము, ఈ బురదకాల్వలో దిగము అనిభీష్మించి నిలువబడియుండిరి. వారిని చూచి శ్రీ రామమిశ్రులు 'అమ్మ లారా ! మీరు బురదలో దిగవలసిన అవసరములేదు. నేను కాల్వను అడ్డముగా పండుకొనియెద నామీదుగా నడచి, యీవలకు రండు'. అని చెప్పి కాల్వకడ్డముగా పరుండెను. ఆ బాలిక లిరువురు ఆతని మీదుగా ఈదరికి చేరిరి. శ్రీరామ మిశ్రులులేచి, వారిని తీసికొని ఆచార్య గృహంబునకు పోయెను. ఆ విషయమంతయు పిల్లలు పుండరీకాక్షు లకు నివేదించిరి. పుండరీకాక్షులు శిష్యభక్తికి మిక్కిలి అక్కజంబంది శిష్యుని పిలిచి, "వత్సా ! నీవు కావించిన విధము నా కుమార్తెల వలన వింటిని. దీనికి ప్రత్యుపకారమేమి చేయగలను ? నీ ఋణభారము నెట్లీగగలను ? మరల తిరుమంత్ర మొక్కసారి చెప్పెద రమ్ము" అని ఆతని కుడిచెవిలో మరల నింకొక పర్యాయ మా పవిత్రమంత్రము నుప దేశించెను. శ్రీరామ మిశ్రులు గురునింగాంచి "గురుదేవా ! ఇది నాకు చాలదా ! దీనికన్న మించినది వేరొకటి జగత్తున నున్నదా ?" అని ఆచార్యులకు పాదాభివందనం బాచరించెను. ఇట్లాతడు గురుశు శ్రూష యొనర్చుచుండగా, పుండరీకాక్షులకు అంత్యకాల మాసన్న మాయెను.

అపుడు పుండరీకాక్షులు శ్రీరామదేశికునిం గాంచి "వత్సా ! మా గురుండగు నాథమునులు మాపై నొక కార్యభారమునుంచి పరమ పదమునకు వేంచేసిరి. నాథమునుల కుమారుడగు నీశ్వర భట్టునకు పుత్రుఁడొకండు పుట్టి యీ వైష్ణవ దర్శనంబునువీడి, రాజ్యపాలనా లోలుండై యుండు. అట్టి సమయమున నీవాతని యొద్దకేగి, మన వైష్ణవ సంప్రదాయములనెల్ల బోధించి, సరిదిద్ది మరల వైష్ణవ మత సామ్రాజ్యమునందు పట్టాభిషిక్తుని జేయుము. అని నాకు చెప్పిరి. కాని అది యీ దాసునకు ప్రాప్తింపలేదు. నేను నాగురు సన్నిధానమున కేగు చుంటిని. నీవైనను, ఈ నాఆజ్ఞ తీర్చిరమ్ము" అని ఆజ్ఞాపించి, నాథ మునీంద్రు పాదారవిందమ్ములు మనస్సున ధ్యానించుచు, గురుసన్నిధి కేగెను. రామదేశికుండు గురునకు బ్రహ్మమేధాది సంస్కారము లాచ రించి, శ్రీ వైష్ణవమత స్థాపకుండై గురుపుంగవుండు వచించిన సమయ మెన్నఁడాసన్నమగునా యని ఎదురుచూచుచు, 'సంస్కృతద్రావిడ' ద్వివిధ వేదాంతముల నుద్ధరించుచు, సర్వేశ్వరధ్యాన నిమగ్నుండై యుండెను.

ఓం తచ్ఛాంతిః తచ్ఛాంతిః తచ్ఛాంతిః

---

## యామునాచార్య వైభవము

"స్వాదయన్నిహ సర్వేషాం త్రయ్యన్తార్థం సుదుర్గ్రహమ్
స్తోత్రయామాస యోగీంద్ర స్తం వందే యామునాహ్వయమ్"

ఈశ్వరభట్టు సతీలలామోపేతుండై గృహస్థ ధర్మంబు నాచరించుచు, మన్నాగు రాజగోపాలమాళికి సర్వవిధ కైంకర్యంబు లొనర్చు చుండ, ఆతని ధర్మపత్ని గర్భమును ధరించెను. సర్వేశ్వరుని సింహాస నాంశమామె గర్భమునందు ప్రవేశించెను. ఆమె గర్భమును దాల్చిన విషయమునువిని, శ్రీరామ మిశ్రు లీశ్వరభట్టు గృహంబున కేతెంచి

ఆతని భార్యంజూచి, యోగక్షేమంబు లారసి, ఆ మంత్రణంబు వడసి, మా పరమాచార్యుల ఆజ్ఞ నెరవేర్చుటకీ దాసునకు కాలమెప్పుడు సమకూడునాయని యోజించుచు, తన నిలయంబున కేగెను. ఈశ్వరభట్టు ధర్మపత్నికి నవమాసములు నిండెను. పదియవమాసమున ప్రాచీదిశాంగన పద్మాప్తునిగన్న చందంబున ఆమెయొక చిన్నారి పుత్రునిం గనియె. ఈశ్వరభట్టు పుత్రజననానందం బనుభవించెను. శ్రీరామమిశ్రుని గూడి, జాతకర్మాదు లాచరించి, జాతాశౌచాదులు నివర్తించి, తదుపరి ఆ బాలునకు యామునాచార్యులని నామకరణం బొనరించిరి.

ఆ బాలకుండు శుక్లపక్ష చంద్రునివలె దిన దిన ప్రవర్ధమాన శరీరుండై యుండె. తేజస్వియగు పట్టింజూచి యీశ్వరభట్టు సంతసించుచుండె. పంచమ వార్షికుండగు యామునునకు, మంచి లగ్నమును జూచి, అక్షరాభ్యాసము చేయించి తండ్రి అక్కరములు నేర్పించుచుండెను. అక్షర సమూహంబంతయు కొలదికాలముననే అబ్బినది. వెంటనే బాలరామాయణమును ప్రారంభించి చెప్పుచుండెను. ఆ బాలునకు, ఎంతటి విద్యయైనను, ఒక్కసారి విన్నమాత్రము చేతనే కరతలామలకమగుచుండెను. ఎనిమిదవ సంవత్సరము వచ్చెను. బాలునకు చౌలోపనయనాది కార్యములు పూర్తిచేసి, కొంతమంది యామున సమవయస్కులగు బాలురను చేర్చుకొని, ఈశ్వరభట్టు వేదమును చెప్పుచుండెను. వేదపాఠములకు సంతయని పేరు. ఈ శ్రుతికి ఉదాత్తానుదాత్తస్వరితములను స్వరములు గలవు. స్వరవిన్యాసముతో వేదము నుచ్చరింపవలయుగాని, యూరక చదువరాదు. గురువు చెప్పుచుండ శిష్యుడాధ్వని ననుకరించి పలుకవలయును. అట్లు కొంతకాలము చెప్పిన తదుపరి, దానిని వదలి మరల పైకిపోవుచుండును. దీనికే సంతయని పేరు.

ఈశ్వరభట్టు ఒకనాడు సంత చెప్పెను. మరునాడువయమున దానినే ప్రారంభించెను. తోడి బాలకులాధ్వని ననుకరించి, యుచ్చరింపలేక బాధనందుచుండిరి. వారు, వచ్చీ రాని విధముగా పలుకుచుండిరి.

యామునుడు వారితోపాటు కొంతసే పుచ్చరించి లేచిపోయి క్రీడావినోది యయ్యెను. రెండవ దినమున తండ్రి కుమారునిగాంచి "అర్భకా ! సంత చెప్పుచుండ నిన్న నీవు లేచిపోయితివి. వేదము చదువుదువా? లేక మూర్ఖుడవయ్యెదవా ! బ్రాహ్మణత్వ ముండవలయునా? లేదా ? అని మందలించెను. చిఱుతడు తండ్రిని జూచి "తండ్రీ ! మీరు ప్రతి దినము చెప్పినదానినే చెప్పుచుంటిరి. పై భాగమునకు పోవుటలేదు. మీరు ముందుదినమున చెప్పినప్పుడే నాకది కంఠస్థమైనది నోటికివచ్చిన దానినే ప్రతిదినమును వల్లెవేయుట యిష్టములేక లేచిపోయితిని. అంతియకాని; వేదపఠనమున ఆసక్తి లేకకాదు" అని ప్రత్యుత్తరము చెప్పెను. ఆ వాక్యములకలరి యీశ్వరభట్టు కుమారునిజూచి "వత్సా! నీకు నేను చెప్పినది వచ్చినచో చదువుము" అని కోరెను. బాలుడు తండ్రి చెప్పిన వేదమునంతయును నిరాఘాటముగా పఠించుట కారంభించెను. తండ్రి ఆనందాబ్ధి నోలలాడి, "మా తండ్రియగు నాథమునులీ బాలకుని మహాత్మ్యము నెన్నడో చెప్పిపోయినారు. వీడు సామాన్య బాలకుండు కాడు. వీడు భగవదంశసంభవుండని చింతించి, కుమారుని ముందు కూర్చుండబెట్టుకొని ఆతనికి వినిపించునట్లు వేదము పఠించుట కారంభించెను. ఇట్లు యామునాచార్యు లచిరకాలముననే వేదమును సమగ్రముగా నభ్యసించెను. తదుపరి సంస్కృత విద్యయందు పారపాండితీవిశేషమునంది, సాహితీ గ్రంథములెల్ల పఠించుచు, న్యాయ, వైశేషికముల కూలంకష ప్రజ్ఞావంతు డయ్యెను.

"పూర్వదత్తా చయావిద్యా పూర్వదత్తం చ యద్ధనమ్
పూర్వదత్తాచయానారీ అగ్రేధావతి ధావతి"

పూర్వజన్మమున తనచే దానము చేయబడిన విద్యయు, ధనమును, వనితయు, రెండవ జన్మమున ముందునడచుచుండును. అనినట్లు ఆతడన్ని విద్యలయందారితేరి, పతంజలి మహర్షి ప్రోక్త మహాభాష్యమును

చదువవలయునని యెంచి. 'మహాభాష్య భట్టరు' అను పేరుగల యొక ఆచార్యునియొద్ద చేరి వ్యాకరణ శాస్త్రమును నేర్చుకొనుచుండెను.

ఒకానొక దినమున చోళరాజభటులు ఒక పత్రిక కొనివచ్చి మహాభాష్య భట్టరున కొసంగెను. అది చూచి యాతడు మిక్కిలి ఖేద పడుచుండెను. గురుని విచారమును చూచి, యామునాచార్యులు 'అయ్యా! ఈ పత్రిక యేమి ? ఈ వచ్చిన భటులెవ్వరు ? ఎవరు పంపిరి ? ఎందుల కాపత్రికనుచూచి వ్యసనపడు చున్నారు ? ఆ విషయ మీదాసునకు చెప్పవచ్చునని తమ మనస్సున దోచెనేని సెలవిండు. నాకు సాధ్యమైనచో తీర్చెద' 'శరీరం వసువిజ్ఞానం గుర్వర్థంధారయేన్నరః' శరీరము గాని, ధనముగాని, విజ్ఞానముగాని, గురువునకే సమర్పింపవలయునని యెవడు తలంచునో, వాడే శిష్యుడు' అని శాస్త్రములు ఘోషించు చున్నవి. కావున ఆకార్యమేమో నా కెఱింగింపుడు అని పలికెను. ఆ వాక్యములాలించి గురుండు శిష్యునితో 'నాయనా! ఏమి చెప్పుదు ? నాదురవస్థకు నేనే దుఃఖించుచుంటిని. ఈ వచ్చినవారు చోళరాజు భటులు. ఈ పత్రిక ఆరాజ్ఞ. దీనిని సవిస్తరముగా చెప్పెద నా కర్ణింపుము. ఈ చోళదేశమును పాలించుచున్న రాజు మహాదుష్టుండగు ఆతడు మన్నించు వారందరట్టివారే 'యధారాజా తథాప్రజాః' అని, కదా పెద్దలనుడి. ఆ రాజసంస్థానమున అక్కియాళ్వారను బ్రాహ్మణుడు పురోహితుడై యుండె. అతడు విద్యాధికుడు విద్యకంటెను గర్వమత్యధికము. దుర్నీతుడు.

రాజును తన కుత్సితోపాయమున వశమొనర్చుకొని, ఆ అక్కియాళ్వారు దేశమునందలి విద్యాధికు లందఱకును పన్ను విధించుచున్నాడు. రాజు బుద్ధిహీనుడు. పండితులనందరను తన అధికార బలమున రాజధానికి పిలిపించి, సంవత్సరమున కింత ధనము చెల్లింపవలసినదని వసూలు చేయుచున్నాడు. ఇతర రాజ్యములందు మహారాజులు పండితుల ననేక విధములుగాపోషించుచుండ ఈ దుష్టుడు మాత్రము

వారిని వేధించుచు వారి ధనమునే కొల్లగొట్టుచున్నాడు. ఇంతటి దుర్మార్గుని పాలనమున నుండుటకన్న ఎచ్చటికైన పోవుట మేలని తోచుచున్నది. గృహక్షేత్రాదులు వీడజాలక యిచ్చట నివసించుచుంటిని. నేను మునిత్రయ ప్రోక్తమగు వ్యాకరణ మాసాంతము చదివితిని. కావున రాజునకు పన్ను కట్టవలసియున్నది. కావున తరువు కాండ్రను తద్ధనమును కొనిరమ్మని నాయొద్దకు కంపినారు. ఇప్పటి నా యీస్థితి దైవమునకే కాక మానవులకనూహ్యము. నాఅర్ధాంగి ప్రసవించియున్నది. ఇంటియందు తండులంబులు లేవు. బెల్లము, చింతపండు మొదలగు వస్తువులు శూన్యము. ఏరండ తైలమును కొనివచ్చుటకు చేతరాగి డబ్బులేక కొనలేక బాధపడుచుంటిని నిత్యకృత్యములకు హాని కల్గినదని నేను వ్యసనపడుచుండ ఇప్పుడే వీరుకూడ దాపురించినారు. ఇంతద్రవ్య మెటనుండి తెచ్చెద ? వారికెట్లిచ్చెద ? ఈయకున్నచో రాజాజ్ఞ మీరినకతమున శిక్షార్హుడనగుదు నని చింతించుచుంటిని'' అని తెల్పెను.

ఆమాటలకు యామునముని గురునింగాంచి "అయ్యా ! పండిత ప్రవరులు పూజార్హులుగాని శిక్షార్హులు కారే. విద్యావంతుడైనది ఈ రాజునకు డబ్బు కట్టుటకా ?'' అని ఆ చార్యుని చేతియందలి పత్రికను గ్రహించి, ముక్కలు ముక్కలుగాచింపి, రాజభటులం జూచి "మీరు పోయి నేను చించివైచితినని మీ రాజునకు చెప్పుడు.'' అనెను. భటులు చోళరాజు యొద్దకుపోయి నమస్కరించి "రాజాధిరాజా ! రాజమార్తాండా ! మా విన్నపమాలకింపుము. మీయుదల గొనిపోయి మేము మహాభాష్యభట్టరున కొసంగితిమి. ఆతడా పత్రికను చూచి కన్నుల నీరునించి, విషణ్ణుడై యుండెగాని, ఏమియు పలుకలేదు. కాని ఆయన యొద్ద పంచవింశంతి వత్సరంబులుగల యువకుండొక్కడు చదువుకొనుచున్నాడు. ఆతడు మన పత్రికను చించివైచి, 'నేను చించితినని మీ రాజుతో చెప్పుడు అనిపలికె' ఆవిషయమును దేవరవారికి విన్నవించుకొనుటకై వచ్చియుంటిమి'' అని విన్నవించిరి.

చోళరాజావృత్తాంతమును విని భగ్గునమండిపడి, "మాయాజ్ఞను ధిక్కరించుట కాపిల్లవాడెంతటి వాడు? ఎన్ని గుండెలున్నవి? ఇట్లుంద రును చేసిన రాజాజ్ఞ నవ్వుల పాలగును. ధనమెవ్వడు చెల్లించును?" అని క్రోధోద్దీపిత మానసుడై కొందరు రక్షక భటులను పిలిచి, మీ రిప్పుడే పోయి మాయాజ్ఞను తిరస్కరించిన యువకుని తీసికొనిరండు. పొండు" అని ఆదేశించెను. వారు వీరనారాయణపురమును ప్రవేశించి మహాభాష్య భట్టరు నింటికేగి, యామునాచార్యులజూచి "అయ్యా! మీరు రాజధిక్కార మొనర్చిరట. అందువలన మిమ్ము రాజసభకు తీసికొనిర"మ్మని ప్రభుశాసనము కనుక తమరు మావెంటరావలె" నని పిలిచిరి. రాజభటులను జూచి యామునులు "రాజసేవకులారా! మేము రాజసన్నిధికి వచ్చుటకు తప్పేమి చేసితిమి? రాజు పంపిన పత్రిక ధర్మ విరుద్ధము. కావున చింపివైచితి. మహాపండితులు శుల్కమును చెల్లిం చుట యే యుగమునందైన కలదా? అట్లున్నదని మీరు వింటిరా? ఏరాజైన, ఏకాలముననైన నిట్లు చేసెనా? విద్యావంతులు పూజా వాక్యంబులకేగాని తర్జన భర్జనోక్తులకు తగరు. నన్ను సగౌరవముగా ఆహ్వానించినచో మీ రాజసభకు వచ్చెదను. ఊరక శాసించినంత మాత్రమున కాళ్ళీడ్చుకొనుచు వచ్చుటకు నేను నిందా కృత్యమేదియు నొనరింపలేదు. మీరు నా వాక్యములన్నియు మీరాజునకు విన్న వింపుడు" అని చెప్పి పంపించెను.

వారు రాజదర్శనార్థమై పోయిరి. ఆసమయమున రాజదంపతు లిరువురు నొకే ఆసనము నలంకరించియుండిరి. భటులు వారికి నమస్క రించి, 'రాజా! మహాభాష్య భట్టరు నొద్దకేగితిమి. ఆయన శిష్యుడు వైష్ణవ యువకుడు. ఆతడు తేజస్సంపన్నుడు. తనను సగౌరవముగా పిలిపించిన రాజసభకు వచ్చునట. రాజపురోహితుని విద్యాబలముగూడ చూడగలడట' అని చెప్పి, ఆ విషయమును పురోహితునకు గూడ చెప్పిరి. పురోహితుడు "ఈయర్భకుడే విద్యయందు పండితుడో?

కవియో (లేక పండితుడో) తెలిసి కొనిరమ్ము" అని వారల మరల పంపించెను. వారువచ్చి యామునునకా విషయమును చెప్పిరి. యాము నముని ఒక శ్లోకమును రచించి "దీనిని తీసికొనిపోయి మీ పురో హితునకిండు" అని పంపించెను.

పురోహితుడు కమ్మనువిప్పి 'న వయం కవయస్తు కేవలం-నవయం కేవలతంత్ర పారగాః-అపితు ప్రతివాద వారణ-ప్రకటాటోప విపాట నక్షమాః" అను నీక్రింది యర్థము వచ్చు శ్లోకమును పఠించెను. మేము కేవలము కవులముకాము, కేవల పండితులముకాము. కవుల మనియు, పండితులమనియు తలంచి గర్వభూతులగు మదించిన ఏనుగుల కుంభస్థలములను చీల్చుటకు సమర్థతగల సింహముల వంటివారము. ఈ శ్లోకమును చదివి, మండిపడి, పురోహితుడు రాజును గాంచి "ప్రభూ! యీ యర్భకుడు నన్ను చాల తేలికగా భావించి, యీపత్రి కను రచించి పంపించినాడు. ఆతనిని గౌరవముగా తెప్పింపుడు' అని కోరెను. అంత రాజొక ఆందోళికను సిద్ధపరచి, కొంతమంది పరివార మును ఏర్పాటుచేసి, వారితో "మీరు వీరనారాయణపురమునకేగి, నాథముని మనుమడగు యామునుని సగౌరవముగా తీసికొనిరండు" అని ఆజ్ఞాపించెను. వారాయాజ్ఞగైకొని వీరనారాయణపురమున కరుగు చుండిరి.

ఇదంతయు గమనించిన రాజపత్ని ప్రభువును గాంచి "ప్రభూ! ఈ వచ్చుచున్న బాలుడు నాథముని మనుమడు. మహామేధావి. మీ విద్వాంసుడోడక తప్పదు. మీ పురోహితుడు మహా విద్వాంసుడనని గర్వించియున్నారు. ఈ బాలకుని చేతిలో నాతని ఓటమి తప్పదు. మీగర్వము, మీ విద్వాంసుని గర్వము నశించి పోవునట్టి సమయ మాసన్నమైనది." అనెను. ఆమాటలకు రాజు ధర్మపత్నిం గాంచి "మావిద్వాంసుని జయింపగల వాడింతవఱకు భూమిపై జనింపలేదు. ఇకముందు జనింపడు. ఆసేతు హిమాచల పర్యంతము గల దోషజ్ఞ

లెల్లరు నాకు దశబంధమర్పించు చున్నారు. ఈబాలకుడెంతటివాడు' అని చప్పరించి పలికెను. అంతట రాజపత్ని భర్తనుజూచి "ఆర్యా! కాలము బ్రహ్మస్వరూపము. ఒకనాడు మహావిద్వాంసుడుగా పరిగణింపబడినవాడింకొకనాడు మహా మూర్ఖుడనంబడు. జగతీతలంబు నకలంకంబుగా, నిరాతంకంబుగా పాలించిన సార్వభౌముండు భిక్షుకుండగు. ధనవంతుడు దరిద్రుండగు. దరిద్రుడు అష్టైశ్వర్య వంతుడగు. పుట్టిననాడు వ్రేలెడంత శిశువు వయస్కుడై వృద్ధుడై అస్తమించును. ఒకనాడు హిమమును వర్షించిన దివాభాగంబిం కొకనాడు నిప్పుకలుకురియును. మహానందంబిడిన కాలమే మరొకప్పుడు విపహేతు వగుచున్నది. ఇది యంతయు కాలస్వరూపము. కాలప్రభావము నథఃకరింపగలవాడు లేడు. వ్యాధిని పక్వము చేయగలుగునది కాలమే కాని మందులుకావు. ఎన్ని మహౌషధములు ప్రయోగించినను తత్క్షణము రోగనివారణముకాదు. "సర్వాధారః కాలః' కాలమే సమస్తమున కాధారము. ఇంతవఱకు మీ ఆట సాగినది. ఇకమీ ఆటకట్టు. పండితులదగ్గర కప్పములుగ్రహించుట ఆబాలకుని ఆగమనముతోసరి వేయేల? మీ పురోహితుని గర్వాంధకారము నశింపగలదు. ఆవైష్ణవ బాలకుడు మీ పురోహితున కోడెనేని, నే నారుమాసములు దాసీత్వమున కంగీకరించి, మీకుక్కలకు మాంసము వండివేసెద. ఇదియేపన్నిదము. ఆ బాలుడు గెలిచినచో మీరేమి పందె మొడ్డుదురో చెప్పుడు" అనిపలికెను.

అందులకారాజు భార్యతో "తన్వీ! ఎంతటి యొట్టుపెట్టితివి? మా విద్వాంసుడోడినచో మారాజ్యమునందు సగము భాగమాబాలున కొసంగెద. అక్కియాళ్వానుని మా ఆస్థానమునుండి వెడల నడిపెద. మావిద్వాంసుడు జయించినచో నారాయణోపాసన చేయుచున్న నీమెడలో, నీవెంత గోలపెట్టినను త్రొక్కిపట్టి శివలింగము కట్టక మానను. మీ పండితుండు జయించినచో నేను వైష్ణవుండనయ్యెద' నని పలికెను. ఆమె అందుల కంగీకరించెను.

రాజభటులు ఆందోళికను తీసికొని వీరనారాయణపురమున కేగి మహాభాష్య భట్టరునింట కేగిరి. యామునునితో 'స్వామీ! మిమ్ము సగౌరవముగా తోడ్కొనిరమ్మని మా మహారాజులీయాందోళిక నంపించినారు. దీనిపై నెక్కినచో తీసికొనిపోయెద" మని విన్నవించిరి. యామునుడు ప్రయాణ సన్నద్ధుడయ్యెను. గురుండు బాధపడి "వత్సా! యిట్లేల చేసితివి? రాజపురోహితుడు చాలకుయుక్తులు గలవాడు. నిన్నొక్కనినే పంపుటకు మనస్సొప్పుటలేదు. నేనును వచ్చెద" నని శిష్యునితో బయలుదేరెను. వాహనారూఢులై ఈ విధముగా పోయి చోళరాజాస్థానమును ప్రవేశించిరి. ఆ సమయమున కప్పమును చెల్లించుటకై యీ దక్షిణాపథమునందున్న పండితులందరునువచ్చి సభలో నుండిరి. ఆపండిత ప్రకాండుల పారజూచి, మిక్కిలి బాధపడి "ఏమి ఈ రాజెంత హృదయరహితుడు! ఈ మహాపురుషులయొద్ద నరి చెల్లించుకొనుచున్నాడు. ఇది యంతయు దుష్టుడగు నా పురోహితుని వలననే కదా!" అని తలంచుచు, యామునుడు, గురువును మొగసాల దగ్గర వాహనమునుండి దిగి సభాభవనమునందు ప్రవేశించెను. సభాభవనము విద్వాంసులచే క్రిక్కిరిసియుండెను. రాజకింకరులు తెచ్చిన పత్రికను చింపివైచిన బాలుడీతడే యనియు, నీతనికి రాజపురోహితునకు వివాదము జరుగనున్నదనియు, నెవ్వడు జయించునో చూతమనియు సభలో విద్వాంసులు నిశ్శబ్దముగా నుండిరి. చోళభూపాలుడఖండవైభవంబున సింహాసనాసీనుండై యుండె. పురోహితుడు రాజపార్శ్వంబున నొక ఆసనమధిష్ఠించియుండెను. రాజపత్నియవనిక మాటున బంగరు గద్దియపై నధివసియించియుండె.

ఆ సమయమున సభలో నడుగిడుచున్న యామునునింజూచి అక్కియాళ్వానుండు 'ఇతడేనా నాపత్రికంజింపి, శ్లోకమును వ్రాసియిచ్చినవాడు. బాలుండు ఈతడేమి వాదింపగలండు? అని చమత్కారముగా "ఆకారో హ్రస్వః" ఆకారము కురుచగానున్నది అని పలికెను. ఆ

వాక్యమునువిని యామునముని హరిహరీ ! హరిహరీ ! అని చెవులు మూసికొని 'ఈ బ్రాహ్మణుండింతటి అక్షరజ్ఞాన శూన్యుండని తలంపనైతి. ఇట్టివాడెట్లు పండితులతో వాదించుచున్నాడు ? కప్పము లెట్లు తీసికొనుచున్నాడు ? ఆకారో హ్రస్వః అనుచున్నవాడు. 'అ' కారము హ్రస్వము 'ఆ' కారము దీర్ఘము. హ్రస్వదీర్ఘాక్షరముల తారతమ్యము తెలియనివాడు విద్వాంసుడా' ? అని అధిక్షేపించెను. ఆ వాక్యములు విని రాజపురోహితుడు మోమునగంటు వెట్టుకొని "సురాపీతా" కల్లు త్రావబడినదాయేమి ? ఇట్లు పిచ్చిగా మాటాడుచున్నావు. నీ యాకారమును గూర్చి నేను పలుకగా నీవక్షరవ్యవస్థకు తెచ్చితివి. అనెను యామునార్యుండు చెవులు మూసికొని 'రామ ! రామ ! ఈ వృద్ధ బ్రాహ్మణు డక్షర జ్ఞాన శూన్యుండనియే తలంచితిగాని లౌకిక పరిజ్ఞాన శూన్యుండని యెంచనైతి. 'సురాపీతా' అనుచున్నాడు. 'సురా' కల్లు' పీతా 'పచ్చనిది', అని అర్థము. పచ్చనికల్లు లోకమందెచ్చటనైన కలదా ? ఈ బ్రాహ్మణుడు కల్లు త్రాగనప్పటికి నెప్పుడును చూచియుండలేదా ? శాబ్దలౌకిక జ్ఞాన శూన్యుండగు వానినెట్లు రాజాస్థానమునందుంచె నోకదా, యీ చోళరాజు అని వచించెను. ఆ మాటలకు సభలోని వారందరు నొక్కసారి గొల్లున నవ్విరి. ఆబాలుని జూచి 'భళిభళీ ! ఈ పిన్నవాడు సామాన్యుడు కాడు. హయగ్రీవుండే యీ రూపము ధరించి యీ పురోహితుని గర్వము ఖర్వమొనర్చుటకు వచ్చి యుండనోపు ఈ పిల్లవాని చేతిలో నీతనికి పరాభవముతప్పదు. వృద్ధ బ్రాహ్మణుడు గ్రుడ్లు మిటకరించి చూచుచున్నాడు. పిల్లవానిదే జయము"అని హర్షధ్వానములు చేసిరి. ఆ సమయమున సభయంతయు కంపించెను. అక్కియాళ్వాను మాత్రము, కదలక మెదలక స్తంభీభూతుడై యుండెను. కొంతవడికి సభలోని కలకలము నిలిచిపోయెను. అపుడు పురోహితుడు బాలునిజూచి బాలకా ? శబ్దార్థముల విపరీతము చేసి చమత్కరించుటయేనా ? మీమాంసా శాస్త్రమునందేమైన ప్రజ్ఞ కలదా ?

చాలు చాలు నీవైదుష్యము నీ చమత్కారము జూచి, ఈ సభలోని పిచ్చిపండితులందరును, నిను గొప్పవానిగా నెంచు చున్నారు. కార్యారంభమున పొంగరాదు. ఉప్పొంగినచో ఆ కార్యమును చేయజాలడు. ఇల్లలుకగనే పండుగకాదు. నన్ను జయించి నప్పుడుగదా నీ ప్రజ్ఞ” అని పలికెను.

అంతయామునుడు పురోహితునిజూచి, ‘వృద్ధుడా! నన్ను వాచాడంబరునిగా నెంచుచుంటివేమో! కాను, నన్ను జయింప ఫణిపతికైన సాధ్యంబుకాదు. నీవెంత! అదిగాక ఇన్ని దినములనుండి విద్వాంసుల నేడ్పించితివి. ఆ పాప మూరకపోవునా? నన్ను మీమాంసాశాస్త్రమున ప్రజ్ఞకలదా? యని ప్రశ్నించితివి. వినుము చెప్పెద.

శ్లో॥ ఆశైలాదద్రి కన్యాచరణ కిసలయన్యాస ధన్యోపకంఠా
దారక్షోనీత సీతాముఖ కమల సముల్లాసహేతోశ్చ సేతోః
ఆ చప్రాచ్య ప్రతీచ్యక్షితి ధరయుగళాదర్క సోమావతంసా
న్మీమాంసా శాస్త్రయుగ్మ శ్రమవిమలను నా మృగ్యతాం
మాదృశోఽన్యః

పార్వతీదేవియొక్క చిగురుటాకువంటి పాదముల విన్యాసముచే పవిత్రములగు నుపకంఠములుగల పర్వతరాజమగు హిమవంతము మొదలు, రావణునిచే తీసికొనిపోబడిన సీతామహాదేవి ముఖకమల వికాసముకొఱకు కట్టబడిన సేతువు వఱకు, తూర్పున సూర్యచంద్రు లుదయించు నుదయపర్వతము మొదలు, అస్తమించు నస్తమయ పర్వతమువఱకుగల ఈ సరిహద్దులమధ్య నుభయ మీమాంసాశాస్త్రముల యందు నావంటి ప్రజ్ఞగలవానిని, మరియొకరిని మీరు వెదకి కొనవచ్చును. అనగా నావంటి ప్రజ్ఞాశాలి వేరొకడు లేడని భావము. అను శ్లోకమును చదివెను. ఆ శ్లోకమును విని సభాసదులందరును, దాని అర్థగాంభీర్యమునకును, శయ్యకును, రసస్ఫూర్తికిని ఆనందపడి జయ జయధ్వానములు గావించిరి.

అంతవారిరువురకును వాదము ప్రారంభమయ్యెను. ప్రజాపతి బృహస్పతులవలె, మదేభంబులభాతి, మత్తకంఠీరవంబులలేవ పోరాడు చుండిరి. ఆ సమయమున వినుచున్న విద్వాంసులు కొందరు వారిం జూచి 'అయ్యలారా ! మీరిద్దరును మహాపండితులు మీరు వాదించు చుండ నహోరాత్రములు - పక్షములు - మాసంబులు తిరిగిపోవును. శాస్త్రమపారము వాదము పూర్తియగుదనుకనిందెవ్వారు నుండరు మధ్యస్థులు లేనిదే మీ వాదమునకు ఫలములేదు. కావున మీలో నొకరు మూడు ప్రశ్నలు లౌకికమునందుగాని, ఆధ్యాత్మికమునందు గాని, యిచ్చుట, మరియొకరు ఖండించుట అట్లైనచో తేలికగానుం డును. ఇది సుళువగు మార్గము 'అని పలికిరి. ఇది బాగున్నదని అం దరు నంగీకరించిరి. చోళభూపతియందులకు సమ్మతించెను. అంత యామునాచార్యులు రాజపురోహితుంజూచి,'నీవు పెద్దవాడవు. నేను పిన్న వాడను నీవా మూడువాక్యములిమ్ము ఖండించెద లేనిచో నే నోడి పోయినట్లే. ఓడినవానికి శిక్ష నీవే నిర్ణయింపుము 'అని వచించెను. అంత అక్కియాళ్వాను యామునునితో 'నీవే యిమ్ము నేను ఖండిం చెద. గెలిచిన వాడోడిన వాని శిరస్సు తన్నుటయే శిక్ష' అని పలికెను. అంతయామునులు వానితో "ఇవిగో వాక్యము లిచ్చుచుంటిని. పూర్వపక్షము చేయుము అని.

"నహివంధ్యా చ తేమాతా-రాజాపరమ ధార్మికః
పతివ్రతా రాజపత్నీ-త్రీన్ ప్రశ్నాన్ ఉపసంహర"

నీతల్లి గొడ్రాలుగాదు. ఈ చోళరాజు ధర్మాత్ముడు. చోళరాజ పత్ని పతివ్రత, అను నీమూడు ప్రశ్నల నొనంగెను.

ఈ ప్రశ్నలను ఖడించుట యనగా "నాతల్లి గొడ్రాలు ఈరాజు ధర్మాత్ముడు కాడు-రాజపత్ని పతివ్రతకాదు" అని చెప్పుటకు వీలు పడక, ఏమిచేయుటకు తోచక, అక్కియాళ్వాను బెల్లముగొట్టినరాయి

వలె మెదలకయుండెను. విద్వాంసులు నోరెత్తక యూరకుండిరి. గ్రుడ్లు మిటకరించి చూచుచున్న తన వృద్ధ పురోహితుని చూచి, రాజు "ఏమయ్యా! ఖండింపవు?" అనెను. అంతనాతడు రాజును చూచి "అయ్యా! ఈవాక్యములు ఖండింపబడవు దుస్సాధములగు ప్రశ్నల నీయవలెగాని, అసాధ్యములగువాని నీయరాదు" అని బదులు చెప్పెను. రాజు యామునునిగాంచి "బాలకా! సాధ్యము కాని వాక్యము లొసంగ వచ్చునా? బుద్ధిబలముచే ఖండింపబడు ప్రశ్నల నియవలయు, ననిపలికెను. అందులకు యామునాచార్యులు "అసాధ్యము లగు ప్రశ్నల నీయలేదు. మీా పురోహితునకు సాధ్యము కాదని ఒప్పు కొనుడు. ఆతని చెప్పుమనుడు. నేనే ఖడించెద' ననిపలుక 'నేను ఖండింపజాల, నని పురోహితుడు వాక్రుక్కెచ్చెను.

ఆమాట లాలకించి యామునాచార్యులు సభాసదులం బార జూచి "మహాశయులారా! ఈ వృద్ధ బ్రాహ్మణునితల్లి గొడ్రాలు ఒకే సంతానముగల స్త్రీ అరటిగొడ్రాలు అని చెప్పెదరు. ఈతనితల్లికీత డొక్కడే పుత్రుడు. లోకమునందు ధర్మాధర్మము లిట్టివని నిర్ణయించు విద్వాంసులు వీని జన్మమును గూర్చి ధిక్కరించుచున్నారు. ఈతడేల జన్మించెనా? ఎప్పు డంతమగునా? అని యెదురు తెన్నులు చూచు చున్నారు. ఆకారణమున నీతడు జన్మించియు జన్మించనివాడే. వ్యర్థుడు అని ఈతనిని లోకమెంచుచున్నది. కావున నీతనితల్లి వంధ్య పుత్రవతి కాదు. అని నిర్ధరించెను. సభలో కరతాళధ్వనులు మిన్నందెను. యామునులు రెండవ వాక్యము నెత్తుకొని "ఈరాజు ధర్మాతుడు కాడు. ఎలయన, ఈలోకమున ధర్మాధర్మములు వ్యాప్తి చేయుటకు, మంచి చెడ్డల వివరించి వచించుటకు, విద్యావంతులే యోగ్యులు. వారులేని నాడీసమాజమున అధర్మపూరితాంధకారమే మిగులును. పండితులకు శుల్కమును విధించుట, ఉత్తమ విద్యల నభ్యసింప వలదని అరికట్టు టయేకదా? అట్టిశాసన మొనర్చిన ఈరాజెటు ధర్మాత్ముడగును? ఇక

మూడవ విషయము, ఈరాజపత్ని పతివ్రతకాదు. పతివ్రత యన "పతిరేవవ్రతం యస్యాస్సాపతివ్రతా" భర్త యేవ్రతము నిర్వహించునో అట్టివ్రతము నాచరించునది పతివ్రతయని వ్యుత్పత్త్యర్థము, ఈమె అట్లు ఆచరించుటలేదు. భర్త శైవుడు-ఆమె వైష్ణవి, భార్యా భర్తల ఆచారములువేరు. వ్రత భేదమువలన నీమె పతివ్రతకాదు. ఈమే "మహాభాగ" పతివ్రత కర్థకామములేఫలము. ఈమెకు ధర్మ మోక్షములు ఫలము. ఈమె భగవత్పదారవిందన్యస్తభరయైయున్న హేతువున ఈమె ఈలోకమునందలి పతివ్రతలకు మేలుబంతిగా నుండుటయే గాక, ఆదర్శప్రాయురాలై యున్నది. కావున నీమె పతివ్రతాస్థాయిని దాటి పైభాగమున నున్నది. అని విరమించెను. ఆసభయందలి పండితులందరును జయజయ ధ్వానము లొనరించి, యామునాచార్యుల ప్రతిభ ననేకరీతుల కొనియాడుచుండిరి. దశరథుని వాక్యానంతరము కోసల దేశరాజసభలో.

"ఇచ్ఛామోహిమహాబాహుం-రఘువీరం మహాబలం
గజేనమహతాయాస్తం-రామం ఛత్రావృతాననమ్"

అని కోసలదేశ వాసులందరును లేచి, హర్షధ్వానములు చేసిరి, అట్లే చోళరాజ సభలో పండితులందరును హర్షధ్వానము లొనర్చిరి.

అపనిక మాటుననుండి యదియంతయు వినుచున్న మహారాజ్ఞి ఆనందమును పట్టజాలక, తెరనెత్తివైచి, సభలోనికేతెంచి, "అళవందీయారే" మమ్ము రక్షించుటకు వచ్చిన ప్రభూ! అని యామునాచార్యుల నొక్కసారి కౌగిలించుకొనెను. అక్కడనుండి ఆపిల్లవానికి 'ఆళవందారు' అను నామము ప్రసిద్ధ మయ్యెను. పండితులందరును ఆళవందారును ఆశీర్వదించి రాజును దీవించి "నేటికికదా! మా బాధలన్నియు నశించినవని యానందపడుచు, తమ తమ దేశంబులకేగిరి. అంత ఆళవందారు అక్కియాళ్వానుగాంచి, "బ్రాహ్మణుడా! గలిచిన

వాడోడిన వాని శిరస్తాడనము చేయవలసియున్నది. కాని నీవు వృద్ధుడ వగుటచే నేనాపని చేయను. నీవు మాత్రము, నీవిద్వద్బిరుదంబులన్నియు వర్జించి, ఆయాసనమునుండి దిగిపొమ్ము" అని శాసించెను. ఆతడట్లే చేసెను. జనసర్వస్వము సంతసించెను. చోళభూపాలుడు యామునాచార్యుల పాదములపై బడి నమస్కరించి, ఆతనిని పూజించి బ్రహ్మరథమున వేంచేపుచేసి నగరోత్సవము నెరపెను. తన భార్యకిచ్చినమాట ప్రకారము రాజు తన రాజ్యమునందు సగముభాగ మొసంగెను.

ఆళ్వందారు పట్టాభిషిక్తుండై తల్లి దండ్రుల పిలిపించి, గృహస్థాశ్రమమును స్వీకరించి భార్యాయుక్తుండై రాజ్యపరిపాలన చేయుచుండెను. గజ, తురగ, రథాది పరికరసహితుండై, వంది మాగధులు నిరంతరము స్తుతించుచుండ, మంత్రులతో సామంతులతో మంతనములు సాగించుచు మహా వైభవముగ నుండెను.

రాజ్యపరిపాలనచేయు కుమారుని, తత్సంతానమును చూచుచు, ఆనందించుచు భగవదా రాధనపరుండైయుండి, ఈశ్వరభట్టు కొంత కాలమునకు పరమపదించెను. ఆయన సతీతిలకంబును దివ్యలోకమునకు వేంచేసెను. పరలోకగతులగు తల్లి దండ్రులకు ఔర్ధ్వదైహిక క్రియ లాచరించి, మాతృ పితృవియోగ విశ్లేషముచే కొంత బాధనందియు, సుఖ దుఃఖాదులు సర్వమానవ సమానంబులుగాన స్థిరచిత్తుండై యుండెను.

అప్పటికి శ్రీరామమిశ్రులు వృద్ధుడై యుండెను. యామునాచార్యులు రాజ్యపరిపాలన చేయుచున్నాడని విని, ఆచార్యాజ్ఞను నెరవేర్చుటకు నేటికికదా, యీదాసునకు సమయము సమకూడెనని మోదించెను.

"హేగోపాలక! హేకృపాజలనిధే! హేసింధు కన్యాపతే!

హేకంసాంతక! హేగజేంద్ర కరుణాపారీణ! హేమాధవ!

హేరామానుజ ! హేజగత్త్రియగురో! హేపుండరీకాక్ష! మాం
హేగోపీజననాథ ! పాలయ పరం జానామి నత్వాం వినా."

"నంద గోకులమున సంచరించువాడా! అపారదయాసాగరా! అబ్ధికన్యాధవా! కంసుని సంహరించినవాడా! గజేంద్రుని రక్షించినవాడా! మాధవా! బలరామునకు తమ్ముడవైనవాడా! త్రిలోకప్రభూ! తెల్లదామరల తెగడుచున్న నేత్రద్వయిగలవాడా! గోపికా వల్లభా! నన్ను పాలింపుము. నిన్నుతప్ప వేరు వస్తువు నెఱుంగనుగదా" అను నర్థమునిచ్చు పైశ్లోకమును పఠించుచు, యామునాచార్యుల భవనము కడకేగెను. ఆభవనమున కనేకకక్ష్యలు కలవు అందు గజరథ తురగ పదాతి సైన్యంబుల సమ్మర్దము కలదు. ఆభవన ప్రాంగణమున అనేక దివ్య భవనములు ఉద్యానవనములు కలవు. రాజదర్శనంబు చేయుటకు వీలుకాక, అనేకద్వారపాలక సంరక్షితంబై యుండెను. శ్రీరామ మిశ్రులకు యామునుల దర్శించుట శక్యము కాకపోయెను. మెల్లగా రాజుగారి వంటయింటికిపోయి సూపాధ్యక్షుని కలిసి, మీరాజుగారికి శాకములయందేది మిక్కిలి యిష్టమో చెప్పుమనెను. ఆతడు మారాజు గారికి అలర్క-శాకము. మిక్కిలి ప్రీతిపాత్రమైనది అని చెప్పెను.

అంతట శ్రీరామదేశికులు ఆగ్రామమునందే నివాస మేర్పరచుకొనెను. ప్రతిదినమును అలర్క- శాకమును తీసికొనివచ్చి వంటవానికిచ్చుచుండెను. వాడు ప్రతిదినమును, ఆకూరను వండి, రాజుగారికి వడ్డించు చుండెను. అట్లు చాలకాలము గడచెను. చుట్టుపట్ల చేలు చేమలు-పుట్టలు-గుట్టలు వెదకి శ్రీరామ మిశ్రులాకూరను తెచ్చి యిచ్చుచుండెను. ఒకనాడు శ్రీరామ మిశ్రులు తన మనంబున 'ఇదియేమి ? ఇన్ని దినములనుండి కూర తెచ్చి యిచ్చు చున్నను ఈ రాజొక్క-సారియైన పిలిపింపడు. ఈకూర యెచ్చటిదనియైన విచారింపడు. సర్వశేషియనుగ్రహ మిట్లున్న నేనేమి సేయగలవాడ' ననితలంచి శాకమును తీసికొనిపోవక కొన్ని దినము లూరకుండెను. వంట వాడా కూర చేయుటలేదు.

ఒకనాడు రాజు వంటవానిని జూచి 'ఓయీ! ప్రతి దినమును అలర్క శాకమును వండిపెట్టుచుంటివి. రెండు మూడు దినముల నుండి వండుట మానినావు కారణమేమి?' యని యడిగెను. అంతనా సూపాధ్యక్షుడు రాజుతో "ప్రభూ! ప్రతిదినమును, నొక వృద్ధవైష్ణవ విప్రుడు ఆశాకమును తెచ్చియిచ్చుచున్నాడు. ఎందులకో యీ రెండు మూడు దినములనుండియు తెచ్చుటలేదు." అని తెలిపెను. అపుడు యామునులు పాచకుని జూచి "ఓయీ! ఆవృద్ధ వైష్ణవునిచే నేల తెప్పించు చుంటివి! ఆతడేల తెచ్చుచున్నాడు? ఇంతకాలము నుండి మన మేమూల్యము నీయకున్నను తెచ్చుచున్నాడు కదా! ఆ బ్రాహ్మణునకు మనము ఋణపడియున్నాము. మరల ఆతడు వచ్చినచో నాయనను నాయొద్దకు కొనిరమ్ము' అని ఆదేశించెను.

నాలుగవ దినమున శ్రీరామ మిశ్రులు అలర్క శాకమును తీసికొని బయలుదేరి 'సర్వేశ్వరానుగ్రహ మిట్లున్నచో నేనేమి చేయగలవాడ? ఈవేళకు తీసికొనిపోయి యిచ్చెద. ఎన్ని రోజులు తిరిగినను, శ్రమయించుకయు ఫలింపలేదు. ఆ పభు దర్శనము కలుగుటయెట్లు? నాగురువాజ్ఞ నిర్వర్తించుట యెట్లు?' అని విచారించుచు, రాజనగరు ప్రవేశించి తిరుమట్టపల్లె (వంటయిల్లు) కేగెను. తాను తెచ్చిన కూర నుపాచకున కందించెను. అంతనాపాచక శ్రేష్ఠుడు శ్రీరామదేశికునితో "ఆర్యా! మా ప్రభువు మిమ్ము తమయొద్దకు తీసికొనిరమ్మని ఆజ్ఞాపించిరి, కావునరాజదర్శనార్థము రండు" అని అంతిపురికి తీసికొనిపోయెను.

దివ్యాభరణభూషితుండై ఆసమయమున, యామునాచార్య లోక సుందర పర్యంకమున ఉపవిష్టుడై యుండెను. ఇరువురు చామరాగ్రాహిణులు ఇరువైపుల నిల్చి విసరుచుండిరి. భార్య సమీపస్థస్వర్ణాసనము నగూర్చుండి భర్తకేదియో విన్నవించుచుండెను. ఇరువురు పరిచారికాస్త్రీలు, ఆమెకు విసరుచుండిరి. అనేకసీమంతినీ సంతతి పరివేష్టించి యుండెను. ఆసమయమున యామునులు, శచీసమేతముగా, అప్సరోనికురుంబపరివేష్టితుండైన బృందారకేంద్రునివగిది భాసించుచుండెను.

రామదేశికుం డాప్రాసాదవైభవ విశేషంబులు తిలకించుచు రాజసన్నిధికిం బోయెను.

పాచకుని వెంట వచ్చు శ్రీరామ మిశ్రునిజూచి, యామునులు ఆసనమునుండి లేచి నిలుచుండిరి. పరిచారగణమంతయు లేచి నిలువబడిరి. దేశికుడు సమీపించిన శ్రీరామ మిశ్రునకు రాజు నమస్కరించెను. దేశికుడు భూపాలుని ఆశీర్వదించెను. గురువు యామునులు పెట్టించిన ఆసనముపై నాసీనుడయ్యెను. యామునులు గూర్చుండెను. అపుడు యామునులా వృద్ధునితో "అయ్యా! మీపాద పవిత్రధూళిచే పవిత్రీభూతమైన ధాత్రియేది? మిమ్ములనేమని వ్యవహరింతురు? ఏమివాంఛించి మీరు మాకీ అలర్కశాకమును తెచ్చి యిచ్చుచున్నారు? ఇంత కాలము నుండియు మూల్యమడుగని కారణమేమి? మీకు ఋణపడి యుంటిమి! మీకోరిక సెరిగింపుడు. నెరవేర్చెద" నని పలికెను.

ఆవృద్ధుడు రాజుంజూచి "మహాభాగా! నీవు మాకిచ్చునది గాని మేము గ్రహింపదగునదిగాని యెద్దియును లేదు. రథగజతురగ, ధనాదులు నాకవసరము లేదు. మేము సమలోష్టాశ్మ కాంచనులము. సన్యాసులము. సర్వేశ్వరేతర పదార్థములు మాకు రుచ్యములు కావు. నేను వచ్చిన కారణమును చెప్పెద వినుము. నీ తాతగారి పేరు వినియుంటిరా? 'యని యడుగ యామునులు' వింటిని. మా పితామహులు, మహామహులు నాథమునులు. మా తండ్రి యీశ్వరముని. మా పేరు యామునాచార్యులు.' అనెను. అంత శ్రీరామమిశ్రులు 'నా విషయమును చెప్పెద వినుము. మా గురువు పుండరీకాక్షులు. మా పరమ గురులు నాథమునులు. మా పేరు శ్రీరామమిశ్రులు. నీ పితామహులు, మా పరమ గురువులు నొక్కరే. ఇది మన సంబంధము' అని పలికెను.

యామునాచార్యులా మాటలు విని శ్రీరామమిశ్రులతో "అయ్యా! మీకును మాకును మిక్కిలి దగ్గర సంబంధము మా రాజ్యమునందే, మీరు మిక్కిలి మా అంతఃపురమునందే యుండుడు. మీకే

విషయమునను లోపము రాదు. ఏ కాలమున నేది కావలయునో అది మీకు సన్నిహితముగు చుండును." అనెను. ఆ మాటలకు శ్రీరామ మిశ్రులు ప్రభునితో "వత్సా! నే నిచ్చటనుండు వాడనుకాను. మాకు పటకుటీరములున్నవి. వానియందే మా నివాసము. ఈ సౌధ ములందు వసించుటకు మనస్సొప్పదు. మేము నీవు కోరినట్లే యిచ్చట నున్నయట్లే యని భావించుకొమ్ము. నాకొక్క సాయము చేయుము. నీవు సాయంకాలము నాకొఱ కొక్క గంట కాలము విరామముగా నుం డుము. నాతో అపుడు సంభాషింపుము. లేదా నీకు తీరికయగు సమ యమును చెప్పుము. రోజున కరగంట చాలును. నేను వచ్చునప్పు డడ్డ గింపకుండ నీ ద్వారపాలకుల కాదేశింపుము. అదియే నాకోరిక. నే నున్నంతకాలము నీవు రాజ్యాంగవిషయములు కట్టిపెట్టవలయు" నని కోరెను. రాజందుల కంగీకరించి 'నాకంతకంటె కావలసినది యేము న్నది? ఈ సంసారసాగరమును దాటించు నౌక సజ్జన సాంగత్యమే కదా"! 'అనెను. రాజునకు మంగళాశాసనముచేసి శ్రీరామమిశ్రులు వెడలిపోయిరి.

అది మొదలు శ్రీరామమిశ్రులు ప్రతి సాయంసమయమునను, వచ్చి రాజునకు బోధసేయుట కారంభించెను. బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు- భగవద్గీత మొదలగువానిని (ప్రస్థానత్రయము) అర్థ వివరణముతో ఉపదేశించెను. శఠారాతి ప్రణీతంబగు 'తిరువాయి మొళి'యు దాని యర్థమును, భగవద్వైభవమును, వరుసగా బోధించు చుండెను. ఆ బోధలాలించుటచే రాజునకు క్రమముగా రాజ్యమునం దును, గృహస్థ ధర్మమునందును, విరక్తి జనించి, సర్వేశ్వరునియందు భక్తి యధికమగుచుండెను. భగవద్విషయమున నాసక్తి జనించిన, ఐహిక విషయముల నాస్థ తగ్గుట సహజమే కదా! ఇట్లు చాల కాలము 'అర్థపంచకము' ఆకార త్రయము, చరమార్థము మొదల గునవి వినిపింప రాజు వినెను. విని గురునింజూచి, 'స్వామీ! మీరు

నాకొఱకు చాలకాలమునుండి శ్రమించుచున్నారు. కష్టముతో నడచి నా యొద్దకు వచ్చుచున్నారు. నేను మీకు సమర్పింపదగినదేమి ? మీ బోధలకు సమానముగు ప్రతిఫలము నిచ్చుటకు దానితో సమానమైన దేమున్నది ?' అని ప్రశ్నించెను. గురుండు ప్రభునింజూచి 'వత్సా ! నీవు నాకేమియు నీయవలదు. ఇది నా కర్తవ్యము. ఏలయన నీ పితామహులు నాకు పరమాచార్యులని చెప్పితిని. ఆతడు నా గురునింజూచి 'వత్సా ! నా మనుమడు రాజ్యపాలనావ్యవహారముల చిక్కుకొనగలడు. ఆతనిని దిద్దుబాటు చేసి భగవద్విషయమున పాదుకొల్పి, వైష్ణవ సిద్ధాంతమునందు నిల్పి రమ్ము' అని ఆదేశించిరి. దానికై నా గురుండు చాలకాలము వేచియుండెను. కాని ఆయనకాలమున నీకు రాజ్యప్రాప్తి కలుగలేదు. మా గురుండు తన అవసాన సమయమున ఈ విషయమును నాకు చెప్పి నాకాజ్ఞ యొసంగిపోయిరి. అప్పటినుండియు నీకు రాజ్యప్రాప్తి యెన్నడగునాయని యెదురు చూచుచుంటిని ఈనాటికి నా ఆచార్యుల ఋణము తీర్పగల సమయము సమాన్నమైనది' అని పలికెను. యామునాచార్యుండు తన పితామహుని గొపతనమును, తనయందాయనకు గల ప్రేమయు, భగవద్విషయమునందలి గొప్పతనమును తలంచెను. సంసారము హేయముగా తోచినది.

'నమోఽచిన్త్యాద్భుతాక్లిష్టజ్ఞాన వైరాగ్యరాశయే
నాథాయమునయేఽగాధభగవద్భక్తి సింధవే'

అనంతములు, అకృజములును, అక్లిష్టములునైన జ్ఞానవైరాగ్యములకు రాశీభూతుండును, భగవద్భక్తికి నగాధాబ్ధియునగు పితామహుడు "నాథమునికి వందన శతములర్పించుచున్నాడను" అని నాథమునుల పదాబ్జములు మనస్సున ధ్యానించుచు, 'త్యక్త్వాదారాంశ్చ పుత్రాంశ్చ రాఘవం శరణంగతః' అనునట్లు భార్యను, పుత్రులను, రాజ్యమును, ధనధాన్యారామంబుల నన్నింటిని విడిచెను. త్రిదండ కాషాయాంబరములు దాల్చెను. యతిపతియయ్యెను. ఇట్లు యతీశ్వరుండై యాము

నులు గురునితో 'స్వామీ! నాకు మీకుదక్క వేరుపరాగతి లేదు. కావున మీకు దేహాత్మలు సమర్పించితి. మీరేమి చేసినను సరియే' యనెను. శ్రీరామ మిశ్రుండు శిష్యునింజూచి "పుత్రా! మీ తాత తండ్రులనేక కాలము శ్రమపడి, సంపాదించి, నీకీయవలసినదని నాకిచ్చి పోయిన నిధియొక్కటి కలదు. దానిని నీకొసంగి కృతకృత్యుడనయ్యెద. నావెంటరమ్మ" అని ఆతనిని వెంట బెట్టుకొని. ప్రత్యక్షపరమ పదంబగు శ్రీరంగమునకు పయనమైరి.

అట్లు నడచి శ్రీరంగమును సమీపించిరి. వైకుంఠమును విరజానది చుట్టియున్నట్లుగా శ్రీరంగమును కావేరిపరివేష్టించి యుండెను. తనయందు సుస్నాతులగు వారి పాపపంకములను పటాపంచలు చేసి శ్రీరంగేశ్వరానుగ్రహపాత్రులను చేయుచున్నది. వీచికా నికరముచే రత్న విసరమును విరజిమ్ముచున్నది. కావేరి గంగా ప్రవంతిని చూచి 'ఏమే విష్ణుపాదజా! నీవు సర్వేశ్వరుని పాదంబుల నుద్భవించినదాననని గర్వించుచుంటివి. నేను జగదీశ్వరుని గర్భమునందే ధరించియుంటిని. నాసౌభాగ్యము నీకబ్బునా' పరిహసించుచున్నదో యనునట్లు ఫేనసందోహముచే నవ్వుచున్నదాయనునట్లు భాసించుచుండెను. అట్టి కావేరియందవగాహనమొనర్చి, ద్వాదశోర్ధ్వపుండ్రధారులై, సప్తప్రాకార భూసురంబును, శతసహస్ర స్తంభగుంఫితానేక దివ్యమంటప విరాజితంబును అగు శ్రీరంగదివ్య నగరంబు ప్రవేశించిరి. దేవాలయమును చేరి గరుడాది నిత్యుల నుతించి, బలిపీఠముకడ నంజలించి. ధ్వజస్తంభమునకు జోహారుచేసిరి. జయవిజయులకు మ్రొక్కిరి. గర్భాలయంబునకు చనిరి. అచ్చట ప్రణవ విమాన మధ్యభాగమున సహస్రఫణాఖచితరత్న ప్రభాభాసమానవిరాజిల్లు ననంతునిపై, శ్రీభూనీళాదిదివ్య సీమంతినీ వర్గంబుసేవింప పశ్చిమ శిరస్కుండై దక్షిణభుజంబుపధానంబుగా రెండవ దివ్యహస్తమునుసాచి, సర్వజీవులకు నా పాదారవిందములు దక్క మరియొకటి రక్షలేదని చూపించుచు,

'పాతుప్రణతరక్షాయాం విలంబమసహన్నివ
సదాపంచాయుధీంబిభ్రత్సన శ్రీరంగనాయకః'

ప్రణతులగు భక్తులను రక్షించుటయందు విలంబనమును సహిం పడాయనునట్లు ఎల్లప్పుడును పంచాయుధములు ధరించియున్న రంగ ధాముని సేవించిరి. వారిరువురు అట్లు రంగేశ్వరుని పూజించి-

"కశ్శ్రీశ్రియః పరమసత్వసమాశ్రయః కః
కః పుండరీక నయనః పురుషోత్తమః కః
కస్యాయుతాయుతశతైక కలాంశకాంశే
విశ్వం విచిత్ర చిదచిత్ప్రవిభాగ వృత్తం"

సర్వజీవులును, ఏ మహాదేవి కటాక్ష లేశప్రాప్తిని కోరుచున్నవో, అట్టి లక్ష్మికి లక్ష్మియైనవాడును, శుద్ధ సత్త్వాభియుక్తుండును, వికసించిన తామరల నిరసించుచున్న నేత్రములు గలవాడును, కటాక్ష లేశమాత్రముచే జగత్ప్రవృత్తి నివృత్తులన్నియు నిర్వర్తించువాడును, అగు నీకు నమస్కారము. అని నిలువబడియుండిరి.

శ్రీరామమిశ్రులు యామునాచార్యుంజూచి, "వత్సా ! యిది యేసుమా ! నీ పితృపితామహులు సంపాదించి, నీకీయవలసినదిగా చెప్పియుంచిననిధి" యని రంగేశ్వరుని చూపించెను. గురుశిష్యు లిద్దరును సంతోషించిరి. వారిద్దరును శ్రీరామమిశ్రుల మఠమునకు పోయి దానియందు కొంతకాలము నివసించియుండిరి. ఇట్లు కొంతకాలము చనిన మీదట శ్రీరామమిశ్రుడు యామునాచార్యుంజూచి "వత్సా ! నేను ధన్యుడనైతిని. నా ఆచార్యాజ్ఞ నిర్వర్తించితిని. ఇక నీవే శ్రీరంగముననుండి, వైష్ణవ దర్శనమును నిర్వహించు చుండుము" అని వచించి, పుండరీకాక్షుల పాదారవిందంబులు మనంబున నుతించుచు దివ్యలోకమునకు వేంచేసెను. గురువునకు బ్రహ్మమేధ సంస్కారము లొనరించి, యామునముని గురువియోగమును సైరింపజాలక, బాధ

పడి, కొంతకాలమునకు స్వస్థచిత్తుడై భగవద్విషయములు బోధించుచు, శ్రీరంగమునందు నివసించుచుండెను.

ఆ సమయమున, పెరియనంబి, తిరుక్కోట్టియూరినంబి, తిరుమలనంబి, మాలాధరనంబి, తిరుకచ్చినంబి, మొదలగు పెద్దలనేకులువచ్చి యామునాచార్యుల శ్రీపాదము లాశ్రయించిరి. ఒకానొక దినమున యామునమునియొక దివ్యదేశమునకు పోయి శ్రీరంగమునకు వచ్చుచుండెను. కొంతమంది అంతేవాసులుగూడ వెంట నుండిరి. వారొక యూరి సమీపమునకు వచ్చిరి. ఆ యూరి సమీపమునందలి పొలములో నొక పంచముడు శాలిక్షేత్రమున పనిచేయుచుండెను. అప్పటికి పదిగంటల ప్రొద్దెక్కెను. ఆ పంచముడు ప్రక్కనగల గుంటలలోని బురదను దోసిళ్ళతో తీసికొని, అందలి పుడకలు మొదలగునవి ఏరివైచి, దానిని త్రావుచుండెను. అదిచూచియామునముని, ఆ పంచముని జూచి అచ్చెరువంది 'ఓయీ! బురద నేల త్రావుచుంటివి ?' అని ప్రశ్నించెను. అందుల కాతడు "అయ్యా! ప్రతి దినము నాభార్య యీసరికి అన్నము తెచ్చియిచ్చెడిది. అది తిందును. ఈవేళ యెందులకో అది అన్నమును తీసికొనిరాలేదు. కడుపులో క్షుద్బాధ యెక్కువగా నున్నది. కావున నీ బురద త్రావుచుంటిని. 'స్వామీ! యీ బురద కేమి ? మహాపవిత్రమైనది. లోపల నింతకంటె కశ్మలమగు బురదయున్నది కదా! ఇది త్రావిన వెంటనే ఆకలిమాయమైనది.' అని పలికెను. అంతగురుండాపంచముని చూచి, 'యీతడు మహాజ్ఞానిగా నున్నాడు. ఈతనికి మంత్రోపదేశము చేసెదనుగాక' యని తలంచెను. మహాపురుషులకు దయకలిగెనేని మట్టిబంగారమగును.

శిలలు రత్నములగును. మూఢులు ధీమంతులగుదురు. వారికి నిగ్రహము కలిగెనా ఇవియన్నియు వ్యత్యస్తములగును. గురుండు పంచముని జూచి 'వత్సా! రమ్ము. నీకొక మంత్రము నుపదేశించెద. దానిని జపించితివా నీజన్మ సార్థకము కాగలదు' అనెను. ఆమాటలు

విని ఆపంచముడు "అయ్యా దేవరవారు మంత్రము నుపదేశించి, తమ త్రోవతాము పోవుదురు. దాసునిగతియేమి? అట్లుకాదు తమరనుగ్రహించినచో తమవెంట వచ్చెద" అనెను. గురుండా వాక్యములకలరి ఆతడు బ్రహ్మవిదుండని యెంచి సమీపమునకు రమ్మని పిలిచెను. అపుడాతడు 'స్వామీ! నేను పంచమజాతివాడ. దేవరవారు విప్రకుల సంభవులుగానున్నారు. నేను మిమ్ముసమీపింప వచ్చునా'? యనెను. అందులకు గురుండతనిని చూచి, 'వత్సా! ఈకులములు నిమిత్తములేకాని, యదార్థములు కావు. ఆకసమునం దక్షాంశరేఖలు. ఊహారేఖలుగావా? భూమిపై కొలతకు సంఖ్యలున్నవా? కులమును అట్టిదియే. కులము వలన ప్రయోజనము శూన్యము. సద్గుణములు కలవాడే సత్కులుడు. అవిలేనివాడు కులహీనుడే. కులమనగా గుంపు అని యర్థము. పక్షికులము. గోకులము వానరకులము, మనుష్యకులము అని చెప్పబడుచున్నవి. బహుళమగు మానవజాతికి, విభాగము కలిగినప్పుడొక కులమేర్పడెను. అందువలననే యీకులమున కానంత్యత్వమేర్పడెను. దీని విషయము నాలోచింపరాదు. కులముల ఉచ్చనీచములు నిర్ణయించుట నెవ్వారికిని సాధ్యముకాదు. రమ్ము నీవుమమ్ము సమీపించుట కన్నివిధముల తగినవాడవు' అనిపిలిచి, ఆతనికి పంచసంస్కారము లొనరించిరి. తనదేవతార్చన పేటికనతనికిచ్చి వెంటబెట్టుకొని శ్రీరంగమునకు తీసికొనివచ్చిరి. వానితోపాటు మఠమున ప్రవేశించి, వానికి మారనూరి నంబియని పేరిడి, తనయొద్దనే యుంచుకొనెను.

ఇట్లు శ్రీరంగమున నివసించుచు, రంగేశ్వరునకు నిత్యకైంకర్యము లొనరించుచు, ఒకదినమున, గురుండగు శ్రీరామమిశ్రులవసానమున చెప్పిన "వత్సా! మీతాత నాథముని 'కురహవాలప్పన్' అను సాధుసత్తమునకు అష్టాంగయోగ రహస్య ముపదేశించిపోయె. వారి దగ్గరకుపోయి నీవునేర్చుకొమ్ము' అనువాక్యములు తలంచి వీరనారాయణపురమునకుపోయెను. కురహవాలప్పన్‌గారి గృహమెచ్చట

యని విచారించుచు, వారియింటికేగెను. ఆసమయమున కురహావా
లప్పన్‌గారు, తన యోగవిద్యా ప్రభావముచే సర్వేశ్వరుని సాక్షాత్క
రింపచేసికొని, బాహ్యప్రపంచమును మరచి నిశ్చలముగ నుండెను.
ఆయన భంగవంతునియందు లయించియుండెను. అయన యొకరహస్య
గృహమందు బద్ధపద్మాసనస్థుండై యుండె. అతడు జాత్యంధుడు.
యామునులాకుటీరమును సమీపించి, ఆయన విషయ మితరులచే విని,
అయన యోగంబునకు హానిచేయ నిష్టంబు లేక, వెలుపల గోడక్రింద
కూర్చుండెను. అంత కురహావాలప్పన్‌గారు సమాధి చాలించి, శ్రోత్రి
వంశస్థు లెవ్వరైన వచ్చినచో లోనికి రావచ్చును. అని కేకవైచిరి.
అదివిని, యామునముని అదేవంశమునకు చెందినవాడగుటచే లోపల
ప్రవేశించి కురహావాలప్పన్‌గారికి నమస్కరించి. ఎదురుగా కూర్చుండిరి.
అట్లు కూర్చుండి "అయ్యా మీ యోగవిద్యకు అంతరాయము సంభ
వించునని తలంచి, మీకుటీరము వెనుక కూర్చుంటిని. మీరు జాత్యం
ధులు మీసమాధికంతరాయము కలుగరాదని, నెమ్మదిగ నడచితిని.
మీరునన్నెట్లు పిలిచితిరి"? అని ప్రశ్నించెను. అందులకు కురహావాల
ప్పన్ "వత్సా! నేను నిన్ను చూడలేదు. ధ్వనిచేగమనించిన వాడను
కాను. నేను యోగవిద్యా ప్రభావంబున సర్వేశ్వరుని బంధించియుంచి
తిని. ఆసమయమున లక్ష్మి వచ్చినను ఆమెవంక చూడడు. ఆ విద్యా
ప్రభావమటువంటిది అట్టి సర్వేశ్వరుడు నన్ను తిరస్కరించి ముమ్మారు
కుటీరము వెనుకప్రక్కకు తిరిగిచూచెను. అదిగమనించి, ఎవరో మహా
భక్తుడువచ్చి యుండనోపునని నిర్ణయించితి. అట్టిభక్తులు మీవంశము
నందు తప్ప, మరియొకచోట జన్మింపరుగదా! అను అనుమానముతో
పిలిచితిని" అని పలికెను. యామునముని ఆశ్చర్యరసార్ణవమందుమునింగి
ఆతనికి నమస్కరించి, తానువచ్చిన విషయమును విన్నవించెను. ఆతడు
యామునాచార్యులంజూచి, "అయ్యా! ఈ అషాంగయోగ రహస్యము
మీధనమేసుమీ. మీతాత నాథమునులు నాకు ఉపదేశించి దీనిని

నామునుమునికి చెప్పుమని ఆదేశించినారు. మీదానిని మీకిచ్చుటకు నాకేమిబాధ? అట్లేచెప్పెద దీనికొక నియమమున్నది. ప్రాణోత్క్రమణ సమయమునతప్ప మిగిలినవేళల దీనినుపదేశింపరాదు. అందువలన ఇప్పుడు చెప్పలేను. ఈ వచ్చు గురు పుష్యయోగమునందు నేను నా గురుసన్నిధికిం బోయెద. ఆసమయమున వచ్చినచో నీకుబోధించెద. తప్పకరమ్ము" అనియొక పత్రికయం దాముహూర్తమును వ్రాయించి యిచ్చెను.

దానినితీసికొని యామునముని తిరిగి శ్రీరంగమునకు విచ్చేసెను ఇట్లుండ నొకానొక సయమున రంగనాథునకు బ్రహ్మోత్సవములు జరుగుచుండెను. ఆసమయమున ఆచార్యులు, శిష్యులు మంటపము నందు కూర్చుండి యుండిరి. ఒకవైష్ణవుడపుడు తిరువాయిమొళి పాడి అభినయించుచుండెను. అందనంత పద్మనాభస్వామినిగూర్చి ప్రస్తావించుచు యామునాచార్యులను చూచుచుండెను. ఆ పాటవిని, యామునముని, వకుళాభరణయోగికి మిక్కలి ప్రేమపాత్రుడనగు ననంతపద్మనాభస్వామిని నేనింతవరకు చూడనైతినని విచారించి, స్వమతరక్షణమునందు దైవవారి యాండానను వానిని నియమించి, కొంతమంది శిష్యులతో అనంతపద్మనాభ స్వామిని దర్శింప పయనమై పోయెను. కొంతకాలము ప్రయాణించి, తిరువనంతపురమును జేరి, అనంతపద్మనాభ స్వామిని మూడువాకిళ్ళనుండి దర్శించి, అక్కడ నివసించియుండిరి. ఒకానొక దినమున కురహావాలప్పన్‌గారు తనకు వ్రాయించి యిచ్చిన పత్రికను తెప్పించి చూచిరి. ఆయన నిర్ణయించిన గడువు ఆదినమే యగుటచే చాలనిర్వేదించెను. శఠగోపనాథముని ప్రభృతి మహాయోగులు సంపాదించిన పెన్నిధిని నాకాలమున పోగొట్టితినని వంతకుందెను. మాకుపుష్పకవిమానము లభించినచో భగవదనుగ్రహముతో ఆవిషయమును తెలిసికొనగలము. లేనిచో నింతదూర మెట్లుపోగలము?" అని చాల బాధపడియూరకుండెను.

వీరనారాయణ పురమున కురహావాలప్పన్‌గారు తన దగ్గరనున్న వారిని తిలకించి, 'యామునాచార్యులు రాడుకదా !' యని యడిగి 'ఇకరాడు, ఈ యోగమంతటితో సమాప్తము కాగలదు' అని తలంచి నాథమునుల శ్రీపాదారవిందంబులు స్మరించుచు, తిరునాడలంకరించెను. ఆళవందారు చేయునది లేక అనంతపద్మనాభస్వామికి మంగళాశాసనముచేసి, వారి యాజ్ఞ గైకొని శ్రీరంగమునకు వచ్చుచుండెను.

ఇచ్చట దైవవారి యాండాను గురువగు నాళవందారు నెడబాటును సహింప జాలక తెల్లగా పాలిపోయెను. అన్న పానీయాదుల వర్జించెను. నడచుటకుగాని, కదలుటగాని శక్తిలేక యుండెను. సతీర్థ్యులాతనిని చేరి, నీకేమి వ్యాధియని ప్రశ్నింప గురుసన్నిధిని లేకపోవుటయేయని ఆతడు మారుపలికెను. వారందరు, నీతని నీ స్థితిలో నిచ్చట నుంచుట తగదు. గురునియొద్దకు తీసికొనిపోవుదమని భావించి, వానినొక వాహనముపై పరుండబెట్టుకొని, తిరువనంతపురాభిముఖముగా నడువసాగిరి. కొంతదూరమేగి తిరువనంతపురము సమీపించినదనుకొనుచుండిరి. ఆ వాక్యములాలించి ఆతడు గురుని సమీపించితిగదా యని, ఉత్సాహముతో వాహనము దింపుడని అర్థించెను. వారు క్రిందికి దింపగా నాతడు వారితోపాటు నడచి వచ్చుచుండెను. రెండు క్రోసుల దూరము, యామునులు తిరువనంతపురమునుండి వచ్చుసరికి శిష్యులెదురు వచ్చుచుండిరి. వారియందు దైవవారి యాండాను ఆనందపరవశుడై గురుని కోమల పాదములపై బడెను.

అతనింజూచి గురుండు కోపపరీత చిత్తుడై 'చక్రవర్తి తిరుమకనారు శౌర్యవంతుడు కాన భరతుడు రామాజ్ఞచే అయోధ్యయందే యుండెను. అడియేనికి అట్టి శౌర్యాదులులేని కారణమున శ్రీరంగమునందుంచిరా, నాయాజ్ఞ తిరస్కరించి వచ్చితివి' అనెను. అంత శిష్యుడు స్వరూపహాని వచ్చె గదాయని లేవక పాదములయందే పడియుండెను. గురువు మరల వానిని జూచి 'అయ్యా ! చాలుచాలు నన్ను స్వతం

త్రునికూడ చేయనెంచితివి' అనెను అందుల కాతడు మరియు విచార
గ్రస్తుడై యుండెను. అట్టి సమయమున మిగిలిన శిష్యులు గురునిం
గాంచి "అయ్యా! యితడు భరతుడుగాడు. లక్ష్మణుడు భరతులందరు
శ్రీరంగమునందే యుండిరి. ఇతడు మీ వియోగమును సహింపజాలక
ఇట్లు కృశించి పోయినాడు." అని వివరముగా చెప్పిరి. ఆ మాటలు
విని గురుండు సంతసించి, దైవవారి యాండానును లేవదీసి, గాఢముగా
పరిష్వజించి, 'వత్సా! ఇట్లు శ్వేతాలర్క పత్రమువలె కృశించితివి.'
అని ఎంతో ఆదరించి "బిడ్డా! అనంతపద్మనాభ స్వామివారి దేవళము
రెండు క్రోసులలో నున్నది. దగ్గరగా వచ్చితివి గాన పోయి సేవించి
రమ్ము' అని పలికెను. ఆ వాక్యముల కతడు 'అయ్యా! అది మీకు
అనంతపద్మనాభము నేనిప్పు డెదుర్కొన్నదే నాకనంతపద్మనాభము
నాకది అవసరములేదు. దయచేయుడు మీ వెంట వచ్చెద' ననెను.
ఇది స్థితప్రజ్ఞుని లక్షణముగదా యని గురుండు హర్షించెను.

తైవారు ఆండాను మొదలగు శిష్యులతో కూడి యామున దేశి
కుండు శ్రీరంగమును చేరి, పోయివచ్చిన విషయమంతయు రంగేశ్వరు
నకు చెప్పి తన మఠమున ప్రవేశించి, భగవద్విషయమును సర్వజనులకు
చెప్పుచుండ నూటయిరువది సంవత్సరములు గడచెను.

ఒకానొకదినమున యామునదేశికుండు సహస్రగీతికి అర్థము
శిష్యులకు చెప్పుచు నొక పాశురమునకు భావము చెప్పుచు నత్యా
నందము పొందుచుండెను. అపుడు శిష్యులు గురునింగాంచి, 'మీ
యానందమునకు కారణమేమి?' యని అడిగిరి. వారికి గురుండు
'శిష్యులారా! ఈ పాశురమునందు శఠగోపులు సెలవిచ్చిన అర్థమును
వింటిరా? ఈవచ్చు కలియందు పశుపక్షి మృగాదులకు మోక్షమిచ్చు
జగదాచార్యుండు రాగలండని చెప్పియున్నారు. అతడు వచ్చెనా,
ఇంకనురాలేదా యను సందేహము కలుగుచున్నది.' అనెను. అందులకు
శిష్యులు 'గురూత్తమా! అట్టివారు మీరేనేమో? ఏలకారాదు?'

అనిరి. అందులకు గురుండు నవ్వి 'వత్సలారా! నేను కాదు. అట్టివాడు రాగలడు' అని చెప్పి అట్టివా డెచ్చట నున్నాడా? యని విచారించుచు, యతీంద్రుని విషయమును వినిరి. అతడే శఠారాతికే కీర్తింపబడిన వాడని తలంచి, పెరియనంబిని పిలిచి, స్తోత్రరత్నమును, చతుశ్శ్లోకియు, గీతార్థసంగ్రహంబును, ఆగమప్రామాణ్యమును లోకోద్ధరణార్థమాన తిచ్చి, 'నీవు హస్తిగిరికిపోయి నేను చెప్పిన స్తోత్రరత్నమును వినిపించి, రామానుజుని తీసికొనిరమ్ము' అని ఆజ్ఞాపించెను. మారనేరినంబిని పిలిచి 'వత్సా! నాకు చాలకాలమునుండియు రాజవ్రణము కలదను సంగతి నీకు విశదమేకదా! ఆ విషయమున నాప్రారబ్ధము తీరలేదు. కాల మధికముగా గడచిన కారణమున శ్రీ వైకుంఠము చూడవలయు నను ఉత్సుకత హెచ్చుచున్నది. నీ వీ వ్రణమును కొంతకాలము భరింపుము. నీవు భరించినను, నేను భరించినట్లే. గురుశిష్యుల కభేదముగదా!' అని చెప్పి తన శరీరమునుండి, ఆరాజవ్రణమునుతీసి, మారనేరినంబి శరీరము నందు వైచిరి. ఆబాధచే నాతడు స్మృతితప్పి పడిపోయెను. యామున ముని ఆతనిని లేవనెత్తి కౌగిలించుకొని, తనశక్తి నాతనియందు నిక్షే పించెను. మారనూరినంబి గురుని పాదారవిందంబులబడి, లేచి నమస్క రించి 'స్వామీ! గురుప్రసాదము ఈ ఆత్మకు నేటికికదా లబ్ధమైనది. నాబోటివానియం దీ అనుగ్రహము, మీనిర్వ్యాజ కృపావిశేషమునకు నిదర్శనము' అని సంతసించెను.

అంత యామునులు పెరియనంబిని పిలిచి 'మారనూరినంబి పంచము డని భావింపవలదు. పరుసవేదిసోకి యినుము హేమమౌ పగిది, ఇతడు విష్ణు సంబంధముచే మహాపవిత్రుడయ్యెను. భగవద్భక్తుని కులగోత్రము లెన్నరాదు. నేను పోయినపిదప నీతని వెలివాడకు పంపుదురేమో! లోకులు కాకులు అట్లు చేయవలదు. ఇతని రక్షణభారము నీది. ఇతని అంతిమక్రియలుకూడ నీవే యొనర్పుము. అట్లుగాక యీతనిని మరల వెలివాడకు పంపించితిరా, భగవన్నివేదానార్హమగు పురోడాశమును

కుక్కకు వేసినట్లగును,' అని ఆజ్ఞాపించిరి. 'ఇకను నీవు కంచికిపోయి రామానుజుని తీసికొనిరమ్ము. నేనతనితో కొన్ని విషయములు మాట్లాడి, ఈ వైష్ణవదర్శనమున కతనిని అధికారిగా నియమింపవలయు' అని ఆనతిచ్చెను.

ఆ పెరియనంబి కాంచీపురమున కేగి వరదరాజస్వామి సన్నిధి యందు స్తోత్రరత్నము నధ్యయనించుచుండెను. ఆసమయమున రామానుజులు బిందెతీర్థమును తెచ్చి వరదున కర్పించి, ఆ స్తోత్రమును విని దాని భావమున కచ్చెరువంది, పెరియనంబికి నమస్కరించి 'అయ్యా! ఈ స్తోత్రమెవ్వరిచే రచింపబడినది? ఈ స్తోత్రగ్రంథనామమేమి? వా రెందుగలరు? సవిస్తరముగా చెప్పుము' అని కోరెను. అందులకు పెరియనంబి రామానుజునితో 'వత్సా! ఈ స్తోత్రమునకు స్తోత్రరత్నమని పేరు. దీనిని రచించినది యామునాచార్యులు అను సన్యాసి. ఆయన శ్రీరంగమునం దుందురు. ఆయన మహాపండితుడు. నేనాయన శిష్యుడను. నాపేరు పెరియనంబి. మా గురుండు విశిష్టాద్వైత సిద్ధాంతమును స్థాపించుచు శ్రీరంగమునందుండి, వృద్ధుండగుటచే, ఈ వైష్ణవ దర్శనమునకు నిన్ను నిలుపదలంచి, నిన్ను తీసికొనిరావలసినదిగా నన్ను పంపించిరి. నీ విషయములన్నియు విని, ఈ దర్శనము నిలుప నీకన్న వేరు సమర్థుడు లేడని తలంచి యున్నవాడు. నీవు నాతోడ వచ్చినచో మా గురునితో సంభాషింపవచ్చును రమ్ము. ఆయన కవసానకాలము సమీపించినది. శీఘ్రప్రయాణ మవసరము' అని పలికెను. అందుల కాతడు సంతసించి, యామునమునిని దర్శింప తల్లితోడను, వరదరాజ స్వామితోడను చెప్పి పెరియనంబి వెంట బయలుదేరెను.

ఆ సమయమున రంగేశ్వరుడు తన మనస్సున 'ఈ కరిగిరినుండి వచ్చుచున్న రామానుజుడు, యామునముని, యేకమైనచో, లీలావిభూతియంతయు నశించిపోవును. బద్ధజీవుల నందఱు ముక్తుల గావింతురు. నిత్యవిభూతి సమ్మర్దముకలదికాగలదు.' అని తలంచి, యామునుల

బిలిపించి 'వత్సా! నన్నుగూర్చి నూటయిరువది వత్సరములు కృషి సల్పితివి. నీయత్నము సిద్ధించినది. నీకు నిత్యవిభూతి నొసంగుచుంటిని. శీఘ్రంబుగ బోయిరమ్ము' అని పలికెను. ఆమాటల కలరి యామునముని 'స్వామీ! అట్లే పోయెదను. రామానుజులు వచ్చువరకు నుండి, ఈ వైష్ణవసిద్ధాంతమున కాయన నధికారి నొనర్చి, చెప్పవలసిన విషయములు చెప్పి యొప్పగించిపోయెద. అంతవఱకు ననుగ్రహింపుడు' అనెను. ఆమాటలు పెడచెవిని బెట్టి రంగేశ్వరుడు, 'నీవు త్వరగా నిత్యవిభూతికి పొమ్ము.' అని ఒత్తి చెప్పెను. అంత యామునముని, రామానుజులు వచ్చువరకు నుండుటకు సర్వేశ్వరు డంగీకరింపలేదని విచారించుచు మఠమున కేగెను. అచ్చటి శిష్యుల కందరకు భగవదాజ్ఞ తెలిపెను. 'రామానుజులతో మాట్లాడు భాగ్యము నాకీజన్మమున లేదు. దైవాజ్ఞ మీరుటకు సాధ్యముకాదు. దైవాజ్ఞ మీరుట కెవ్వరికిని సాధ్యము కాదుగదా! యని తలంచి, పితామహుడగు నాథమునుల పదారవిందంబులు తలంచి, శ్రీరామమిశ్రుల పాదద్వయికి నమస్కరించి, తన వైభవంబును చాలించెను. శిష్యులందరును దుఃఖసాగరమున మునింగి, కొంతసేపు నిశ్చేష్టులైయుండి, జ్ఞానాధికులగుటచే శోకము నిస్తరించి, గురునకు బ్రహ్మమేధము చేయుటకు నిశ్చయించిరి. విధులన్నియు పూర్తిచేసిరి. యామునయోగీంద్రుల భౌతికకాయమొక దివ్యాందోళికమీదనుంచి బాహ్యోద్యానమునకు తీసికొనివచ్చిరి. బ్రహ్మవేత్తలు కొందరు శ్రీమద్రామాయణ, భాగవత, భగవద్గీతాది గ్రంథముల నధ్యయనించు చుండిరి. కొందరు ఛాందోగ్యము, కాఠకము మొదలగు నుపనిషత్తుల విధ్యుక్త స్వరసహితముగా చదువుచుండిరి. కొందరు సహస్రగీతి మొదలగు పూర్వాచార్యప్రణీత దివ్యప్రబంధములు సామము గానముచేయుచుండిరి. వేశ్యాంగనాబృంద మాటపాటలతో ముందు సాగుచుండెను. కొందరు వేణువీణానాదస్వరాది మంగళవాద్యములు మ్రోగించుచుండిరి. నేలయీనినదో యనునట్లు

జనులు, ఇసుకవేసిన రాలకుండునట్లు యామునమునుల దివ్య కళేబర సందర్శనార్థమై వచ్చియుండిరి. ఇట్లు మహాకోలాహలముగావచ్చి ఉద్యానవనమున వాహనమును దింపి 'పెరియనంబి యేమాయెను? రామానుజుడు రాడయ్యెను. గురునకు బ్రహ్మమేధమును జరిపినచో, గురుని కడసారి దర్శనమైన లభింపలేదని వారు వంతనొందుదురు' అని విలంబన మొనరించుచుండిరి.

ఆ సమయమున పెరియనంబియు రామానుజులును, కావేరీనదిని దాటివచ్చుచుండిరి. పెరియనంబి యుద్యానవనమున గుమిగూడిన జనులనుజూచి నిశ్చేష్టుడై కొంతవరకు తెప్పరిల్లి రామానుజునితో 'వత్సా! మన శ్రమయంతయు నిరర్థకమైనది. రాత్రింబవళ్ళు గమించి వచ్చితిమి. కాని శ్రమయంతయు గతజలసేతుబంధనమైనది. అదిగో చూడుము. ఆ ఉద్యానవనమున మహాజనము గుమిగూడియున్నది. గురుదేవుండగు యామునముని అస్తంగతుడయ్యెను. ఆయనకు బ్రహ్మమేధమును నిర్వర్తించుటకు బాహ్యోద్యానమునకు తీసికొనివచ్చియుందురని తోచెడిని. కానిచో నింతజన మిచ్చట గుమిగూడుటకు హేతువు లేదు' అని పలికెను. ఆ మాటలకు రామానుజుడు స్తంభీభూతుడయ్యెను. నెత్తిని పిడుగుపడినట్లయ్యెను. చేష్ట లుడిగెను. మనము, శరీరము వశంబుగాక, నిలుచుటకు శక్తిలేనివాడై భూమివిూద పడిపోయెను. పెరియనంబియు కొంతసేపు బాధపడి, తెలిసినవాడై రామానుజులను లేవదీసి, 'వత్సా దుఃఖంచినందువలన ప్రయోజనములేదు. కావలసినదేదియో అది జరిగిపోయినది. లెమ్ము మనము త్వరగా వెళ్ళనిచో గురునికళేబర దర్శనముకూడ అందదేమో? భౌతిక విగ్రహ దర్శనము లభించును. ఇక్కడ ఆలసించినచో నదియు లభింపదు. అని తేర్చి తీసికొనిపోయెను. వీరు పోవుసరికి బ్రహ్మమేధావసరక్రియలన్నియు పూర్తిచేసి గర్తస్థాపన చేయుటకై చూచుచుండిరి.

ఆ సమయమున రామానుజులును, పెరియనంబియువచ్చి గురుని కళేబరంబుపై బడి, భోరునవిలపించిరి. దుఃఖించుచున్న వారినిచూచి, అచ్చటగల మిగిలినవారును శోకించిరి. అట్లు దుఃఖాక్రాంతులైన వారిని కొందరుపెద్ద లూరడించి ప్రబోధింపగా నందరును తేరి నిలువబడి యుండిరి.

అప్పుడు యామునముని భౌతిక దేహమునుచూచి రామానుజులు చుట్టు నున్నవారితో 'అయ్యలారా! ఈ మహాపురుషుండు మూడు వ్రేళ్లు గట్టిగాపట్టుకొని యున్నవాడు. వీరి మనస్సునం దేవియో మూడు కోరికలు హత్తుకొనియున్నవి. వానిని మీ కెప్పుడైన చెప్పియుండి రేమో! వారి కోరికలు తెలిసినచో నాకు చెప్పుడు' అని కోరిరి.

ఆ మాటలువిని కొందరునవ్వి 'ఇవి యెచ్చటిమాటలు? చైతన్య హీనునకు కోరికలుండు టేమి? కొందరు చచ్చిన తరువాత వారి దేహము లిట్లే యుండును. కొందరికి అవయవములన్నియు బిగుసుకొనిపోవును.' అని పలికిరి.

ఆ మాటలువిని రామానుజులు 'అయ్యలారా! ఈ చనిపోయిన వ్యక్తి మహాపురుషుండుగాని, సామాన్యుండుకాడు. ఏమియో కోరికలు వారి మనస్సు నంటిపెట్టుకొనియున్నవి. తెలిసినచో వచింపుడు' అని పలికిరి. అపుడు యామునులవారి ముఖ్య శిష్యులు కొందరు 'స్వామీ! మా గురువరుండు మాతో మూడు విషయంబులు చెప్పుచుండెడివాడు.

1. ఈ విశిష్టాద్వైతమునకు మహోపకారమొనర్చినవారు పరాశర వ్యాసమహర్షులు. మంచి వంశమునందు పుట్టినపిల్ల లెవరికైన ఆపేర్లు పెట్టవలయునను నది వారి మొదటి కోరిక.

2 ఈ మతానుకూలముగా బ్రహ్మసూత్రములకు భాష్యము వ్రాయవలయునను నదియన ద్వితీయవాంఛ.

3. ఈ భారత దేశ మంతయు పర్యటించి, ఈ మతమును వృద్ధి చేయవలయు నను నది వారి చివరికోరిక' అని తెల్పిరి.

ఆ వాక్యముల కఖండానందమంది రామానుజులు యామునుల కళేబరమును సమీపించి కుడిచెవిలో 'స్వామీ! మీ యనుగ్రహ మున్నచో మీ మనస్సు నందలి మూడు కార్యములు, ఈ దాసుడు నెరవేర్చగలడు' అనెను. వెంటనే ఆకుంచితములగు యామునముని మూడు వ్రేళ్ళను విడిచిపైచెను. అదిచూచి జనులందరును, విస్మయా విష్టచిత్తులై రామానుజుని కొనియాడి 'ఎంతో కాలమునుండి మేము యామునుల సమీపించియుంటిమి. మాకీసంగతి తెలియలేదు. మీ రెప్పుడును వారిని సమీపింపలేదు. ఈ విషయము మీ కెట్లు తెలిసినది?' యని ప్రశ్నించిరి. అంతట రామానుజులు 'అయ్యలారా! నేను యామునమునికి, ద్రోణున కేకలవ్యునివంటి శిష్యుడనుకానా? అని చెప్పెను. అంత వారందరును కలిసి గురునకు బ్రహ్మమేధం బొనరించిరి. కావేరియం దవగాహన మొనర్చిరి. అందరును శ్రీరంగపుర ప్రవేశం బొనరించుచుండిరి. ఆ సమయమున పెరియనంబి రామానుజునిం జూచి 'వత్సా! నా వెంటరమ్ము. రంగనాథుని దర్శించి, విశ్రాంతి తీసికొని పోవచ్చును.' అనెను. ఆ మాటవిని రామానుజులు 'ఆర్యా! పొదలో నున్న పెద్దపులి మొగమైన చూడవచ్చునుగాని, యీ రంగేశ్వరుని మొగము చూడరాదు. నాకును గురుండగు యామునులకును ఎడబాటు చేసినవా డీ రంగనాథుడుకాడా? నేను వచ్చువరకు గురుండుండి యున్నచో ఈ లోకమునందుగల బద్ధచేతనులు, నిత్యపదవికి పోవుటకు వీలుగా సోపానములు నిర్మాణముచేసి యుండెడివారము. అదియంతయు నీ రంగేశ్వరుడు వ్యర్థమొనర్చినాడు. కావున నిప్పుడుకాదు. మరియొక సారి వచ్చెద' నని చెప్పి తిరిగి కంచికిపోయి, జరిగిన వృత్తాంతమంతయు వరదరాజస్వామికి విన్నవించి, సుఖంబుండెను. పెరియనంబి మొదలగు వారు రంగేశ్వరుని దర్శించి, తమ తమ నెలవులకేగి సుఖించియుండిరి.

ఓం తచ్ఛాంతిః ఓం తచ్ఛాంతిః.

---

విజయ ఆర్టు ప్రెస్, తెనాలి.

## ఈ రచయిత ఇతర గ్రంథములు

శేషనగేశ స్తవము (పద్యము) 3-00
(పద్మావతీస్తుతి సహితము)

పూర్వాచార్య చరిత్రము (వచనము) 10-00
(శ్రీ రామానుజులవారి దివ్యచరిత్ర)

దివ్యసూరి హృదయము 15-00
(మొదటి భాగము)

## అముద్రితము

దివ్యసూరి హృదయము
(ద్వితీయ భాగము)


వలయువారు :

శ్రీ మొవ్వ శ్రీనివాసపెరుమాళ్లు.
శ్రీ వేణుగోపాల సేవాశ్రమాధిపతులు
పూడివాడ.
వయా - నగరం.
పల్లపట్ల తాలూకా. గుంటూరు జిల్లా.




భాష్యకార సమాజ స్థాపకులు
మహర్షి శ్రీ వేంకటదాసస్వామి గారు



శ్రీరమా చిత్రశాల

తర్క వేదాంత విశారద

**పండిత శ్రీ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ళు గారు**

